

సంవత్సరము 25
సంచిక 2

# భారతి

ఫిబ్రవరి 1948
సర్వజిత్తు పుష్యము

## పాద పూజ*

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ప్రవిమలమైన చెళ్లపిళ్లవంగస మర్గ నునుపాలవెల్లికా
లువ కను చందమామ! కవిలోకమహాగురవే నమో నమః.

*　　　　*　　　　*

తొవతుది రేకమెత్తనలు దూసిన సోగతెలుంగులో పదా
లు వెలలు తేనెవాక! కవిలోకమహాగురవే నమో నమః.

*　　　　*　　　　*

తొలికవులెల్ల గష్టపడి తూచిన యెల్లపదార్థముల్ కడుః
సులభముగాఁగఁ జూరగొను శుద్ధమహామతయే నమో నమః.

*　　　　*　　　　*

తలఁచిన యెల్లశబ్దమును దానును మెత్తనరూప మూని మం
జులమయి సేవసేసెడు విశుద్ధమహావచసే నమో నమః.

*　　　　*　　　　*

కోనలలోన మిన్నొరయు కొండలలోన హిమాంబుదాళిలోఁ
గానలలో వినిర్భరముగాఁ బ్రవహించెడు నాంధ్రశారదా
నూనసురాపగ౯ మృదులనూతనసాధుసమప్రసారధా
రానతరేఖ తీర్చిన ధురాప్రతిభానిధయే నమో నమః.

---

* కడచిన నెల 18-వ తేదీనాడు బెజవాడలో ఆంధ్రనాట్యకళాపరిషత్తుసందర్భమున కింక ర్తీంద్రఘటాపంచానన, శతావధాని, శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగురువరేణ్యులకు చి. బందా కనకలింగేశ్వరరావు చేసిన యైదు పైడిపూల పూజానామములు. —వి. స.



# పాదపూజ, ౨



శ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రి

ప్రతిభారమణి మనోరంజన మొనరించె
  ధారణాతరుణి మోదమ్ముఁ గూర్చె
వాగ్రత్నకవిత సువర్ణపీఠిక నిల్పె
  కల్పనాంగన యశోగంధ మలఁదె
సుకవిసారస్వతసుమమాలికలు నిండె
  బుధుల హెగ్గడికె లద్భుతముఁ గొలిపె
ఆబాలవృద్ధమ్ము హర్షధ్వను లెసంగె
  నుభయభారతికి నభ్యుదయ మొదవె

కింకవీంద్రఘటాహరి కృతికలాప్ర
పూర్ణసంపూజ్య తిరుపతిముఖ్యభావ్య
శిష్యమణివిశ్వనాథేశ్య 'చెళ్ళపిళ్ళ
వేంకట'కవీంద్ర పాదార్చవింతపూజ.

# నన్నయ తెనుగు

— శ్రీ కోరాడ రామకృష్ణయ్య —

నన్నయభట్టారకు డాంధ్రశబ్దచింతామణిని వ్రాసె నను వ్రాయకపోయినను అది ఆంధ్రభాషలో మాత్రము రచింపబడియుండలే దనుట స్పష్టము. ఆంధ్ర జగద్విదితము నపేక్షించినను నన్నయభట్టు తెనుంగునసే మహాభారతసంహితారచనబంధురు డైనాడు. తిక్కనార్యుడుగూడ నాంధ్రావళి మోదముం బొరయ నట్లు రచించిన గద్యములను, పద్యములను "తెనుగున రచియింతు నధికధీయుక్తి మెయిన్"అని చెప్పి యట్లే చేసినాడు. ఆదికవు లిట్లు జాతిపరముగా నాంధ్ర శబ్దమును తరచు వాడినవారేయైనను భాషాపరముగా 'తెనుగు'శబ్దమునే వాడియున్నారు. కాని యీ రెండు పదములు భాషాపరముగాను, జనులపరముగానుగూడ నభిన్నములుగానే చిరకాలమునుండి వాడుకలో లేక పోలేదు. ఇంతకాలమునుండి వీని నిట్లు వాడిన కవులకు గాని, యట్లే వ్యవహరించిన జనులకుగాని వాని మూలముగా ప్రత్యవాయ మేమియు గలిగిన దని తలచుట కవకాశము లేదు. కాని యిటీవల మనవారిలో గొందరకు మన మాంధ్రులమా-అంధ్రులమా, తెనుంగువారమా తెలుంగువారమా యను పెద్ద సందేహ మొకటి బయలుదేరినది. కాలగతిని ప్రతివస్తువు, ప్రతి మనుష్యుడు మారిపోవుచున్నట్లే అతడు వ్యవహరించు భాషకూడ ననేకవిధములగు మార్పులకు లోనగుచుండు ననుట అందరకు తెలిసినదే. గ్రామనామములు, పట్టణపు పేర్లు ఎన్నివిధములుగ మారుచున్నవో మనము చూచుచునే యున్నాము. ప్రాచీనశాసనాలలోని 'కాకందివాడు' ఇప్పుడు 'కాకినాడ' అయినది. ఆంగ్లోచ్చారణసంపర్కముతో 'కోకనాడ' అనియు బలుకబడుచున్నది. మద్రాసులోని 'హామిల్టన్ బ్రిడ్జి' అమిట్టన్ బ్రిడ్జి—అంబట్టన్ బ్రిడ్జి యై, తుద కిప్పుడు 'బార్బర్స్ బ్రిడ్జి' ('బీబీకూడ') ఐనది.

పసుపుంబల్లు పసుమఱ్ఱు అయినది. 'రట్టగుళ్లు' రెడ్లయినారు. ప్రాచీనశాసనములలోని 'ఎణుంబోది' శబ్దమే తరువాతికాలపు 'ఎనుబది' 'ఎనభై' శబ్దములకు, 'ఎనిమిది'శబ్దమునకుకూడ మూలముగా గనబడుచున్నది. చాళుక్యప్రభువు జయసింహవల్లభుని విప్పర్ల శాసన మా రాజు 'విజయరాజ్యసంవత్సరంబు ఎణుంబోది అణ్ణెంటు' వెలసినది. అనగా ఎనిమిదవ యేటనో, ఎనుబదియవ యేటనో కావలె. చారిత్రకముగ నెనభైయవయేట యనుట యసంభవమగుటచేత ఎనిమిదవయేట యనవలసి యున్నది. అట్లయినచో 'ఎణుంబోది' 'ఎనిమిది' అయిన దనవలసియుండును. లేదా, ఎణ్ + ఉమ్ + బోది అని విడదీసికొని ౧౮ వ యేట యని చెప్పుకొనవలెను. ఇట్లు కాలక్రమమున జనుల వ్యవహారమున శబ్దము లిన్ని రీతులుగా మారుచున్నపుడు ఏ ఐతరేయబ్రాహ్మణములోనో 'ఆంధ్ర' శబ్దమే తజ్జాతిపరముగా వాడబడియున్నదిగావున మన మిప్పు డా 'ఆంధ్ర'శబ్దమునే వాడుకలోనికి దేవలయు ననుట పరిహాసాస్పదము కాకపోదు. ఇంతకాలము నుండి యాంధ్రులమైయుండి యే యపాయమును బొందక యిప్పు డంధ్రులము గావలసిన యావశ్యకతయు గానరాదు. తెలగాణ్యులు, తెలగాలు మొదలగువా రందరు దేశీయంబగు 'తెలుంగు' జాతికి

సంబంధించినవారే. తెలంగాణము తెలంగుల యాదిమనివాసమై యొప్పినది. ఆ తెలంగుజాతివారి భాషయే తెలుగు. 'తెనుగు' అనునది గంగానదీతీరము నుండియో, అహిచ్ఛత్రప్రాంతమునుండియో వచ్చి వింధ్యదక్షిణభాగమున నెలకొని గోదావరీకృష్ణానదుల నడిమిదేశమగు తెలంగాణము నాక్రమించిన కాలము నాటి యాంధ్రుల భాష ప్రాకృతమే. తెలుగుదేశమున నెలకొనిన యాంధ్రులు దేశీయులగు తెలంగులతో గలిసిపోయి యభిన్నులై ఆంధ్రులు, తెలుంగువారు అని రెండుశబ్దములతో వ్యవహరింపబడుచున్నట్లే, దక్షిణ దేశీయమగు నీ భాషయు నిటీవల ఆంధ్రము అను పేరున బడయుటచే ఆంధ్రము, తెలుగు నభిన్నములైనవి. 'తెలుంగులో'ని 'ల'కారము నకారముగా మారినంత మాత్రమున తెలుగువారికి ప్రత్యవాయ మేమియు గలుగబోదు.

'తెలుంగు' శబ్దము, జనులు, వారి జీవితము మొదలగున వన్నియు కాలక్రమమున మారిపోయినట్లే వారి భాషయు ననేకరీతుల మారిపోయినది. ఇంకను మారి పోవుచునేయున్నది. జీవజంతువులవలెనే జీవద్భాషలను మార్పు సహజమే. క్రీస్తుశకము తొలి దశశతాబ్ది లోని తెలుగుభాషాస్వరూపలక్షణములను తెలిసికొనుట కాకాలమున వెలసిన యేవో కొన్ని శాసనములుతప్ప వేరు ఆధారము లేదు. ఆ శాసనములలోని తెలుగుభాష తొలుత దేశీయములగు దాని సహజలక్షణములను వ్యక్త పరచునదై యుండుటచే మన కిప్పుడు మిక్కిలి యపరి చితమైనదానివలె గనుపట్టుచు, కాలక్రమమున గలిగిన సంస్కృతప్రాకృతములతోడి సంసర్గముచే తచ్ఛబ్ద జాలమును, సంప్రదాయములను గ్రహించి కొంతవరకు సుబోధకమై వెలసినది. తరువాత రెండవ దశశతాబ్దిలో నన్నయవిరచితమగు నుద్గ్రంథమే యాంధ్రసాహిత్య మున కంతకు మూలగ్రంథమై ప్రామాణికమగుట కటస్థిం చుటచేత, యాతని భాషకు శిష్టకవిపండితలోకమున చాలకాలమువరకు నొకవిధమగు స్థిరత్వము, ప్రామాణి కత్వము నేర్పడినట్లైనది. తరువాతి కవులలో పెక్కు మంది యాతని నామమునే స్మరించి యాతని మార్గ మునే యనుసరించినవారైరి. కావుననే సంస్కృత బహుళమైనను ఈతని రచన యిప్పటికిని మనకు సుపరి చితమైనట్లగపడుచుండును. నన్నయ యీ సాహిత్య మున తొలికవి యగుటచేతను, అతడు చేపట్టిన గ్రంథము పంచమవేద మనబరగిన భారత మగుటచేతను, అం దాత డవలంబించిన మృదుమధురగంభీరమగు రచనారీతి చేతను అతని భాష సుపరిచితముగనే కనబడు చుండును. నన్నయభారతము చదివినప్పుడాతని ప్రసన్న కథాకలితార్థయుక్తికి, అందలి యక్షరరమ్యతకు గూడ మనము ముగ్ధులమై, యాతని భాషాజాతీయ ప్రయోగవిశేషముల నంతగా గుర్తింపము. అవి సుపరి చితములుగను, సులభముగ నర్థమైనవిగను కనబడుచుం డును. కాని యాకాలపు టాతని భాషాప్రయోగము లను, పలుకుబడిని ఈకాలపు భాషలో నర్థముచేసి కొనవలె నని ప్రయత్నించినపుడే అతని రచనలో, పలుకుబడిలో గల చమత్కారమును, భాషాజాతీయ ప్రయోగములలో, ప్రయోగసరళిలో కాలక్రమమున గలి గిన మార్పును మనము గ్రహింపగలుగుదుము. షేక్స్పి యర్, ఛాసర్ ల ఆంగ్ల భాషాజాతీయములకు ప్రత్యేక లక్షణ మేర్పడినట్లుగా, నన్నయ తిక్కనల భాషా జాతీయములకు ప్రత్యేకలక్షణ మేర్పడవలసియున్నది. నన్నయ ప్రయోగించిన శబ్దముల పట్టికయైనను ఇంత వరకు భాషలో నేర్పడియుండలేదు. దీనికి ముందు మూలపాఠము స్థిరపడియుండవలయు ననుటయు వాస్త వమే. లభ్యములగు తాళపత్రప్రతులు పూర్ణముగా శిథిల ములు గాకపూర్వమే వాని నన్నిటిని పరిశీలించి నన్నయభారతభాగమునకైనను పాఠనిర్ణయము చేయ వలసిన యావశ్యకత యెంతేనియు గలదు. నన్నయ భాషాస్వరూపమును వ్యాకరణదృష్టితో పరిశీలించి శ్రీ డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు చాల శ్రమచేసి నిరూపించియున్నారు. నన్నయప్రయోగ సరళి జాతీయము, అపారమైనది. వాఙ్మయమున తొలి గ్రంథమగుటచేతను, అతనికి పూర్వమందును, పర మందును గల యీ భాష స్థితిని, దాని పరిణామరీతిని గని పెట్టుటకు నన్నయభాషాజాతీయముల యథార్థస్థితిని, అత డద్దానిని తీర్చిదిద్దిన పద్ధతిని తెలిసికొనుట యత్యా వశ్యక మగుచున్నది.

భాష కాలక్రమమున మారుచుండుట కనేక కారణములు గలవు. అం దితరభాషాసంపర్క మను నదికూడ ప్రబలకారణములలో నొకటి. ఇతరభాషల నుండి శబ్దములనుగాని, భావమునుగాని యెరువు తెచ్చుకొనునపు డీ భాషను వ్యవహరించువారు వానిని తమ కనువైన ధ్వనిసంప్రదాయములకు, భావరీతులకు ననుకూలముగా మార్పుచేసికొని వాడుకొనుచుండుట సహజము. ఈ కారణముచే శబ్దముల స్వరూపమునందును, అర్థమునందును, ప్రయోగసరళిలోనుగూడ మార్పు లేర్పడుచుండును. సంస్కృతభాషానిష్ణాతుడును, తత్సంప్రదాయములందు విశేషాభిమానము కలవాడు నగు నన్నయ తెనుగున భారతమువంటి గ్రంథమును రచింప దలచినపుడు తత్సంప్రదాయము లీతని రచనలో దొరలకమానవుగదా. కావుననే యాతడు ప్రయోగించిన భాషలోని శబ్దప్రయోగరీతి, వాక్యరచనాసరళి, అందలి కారకము, జాతీయము మొదలగునవి యీ కాలమున దానిని చదువువారికి కొంత యపరిచితములుగ గనబడుట తటస్థించుచున్నది. నన్నపార్యుని రచనలోని సంప్రదాయరీతులను ముందు ఇంచుక పరిశీలించినగాని కవిత్రయములోని మిగిలిన పురుషుల రచనామహత్వమును గుర్తింపలేము.

నన్నయభట్టారకుడు భారతకృత్యాదిని స్తుతించిన శ్రీ వాణీ గిరిజలను వక్షోముఖాంగములందు ధరించిన పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరు లను త్రిపురుషుల వలెనే, భారతరచనారూపమున నాంధ్రభాషాసాహిత్య ప్రపంచస్థితి నావహించుటకు కూడ కవిత్రయరూపమున త్రిపురుషులే యావిర్భవించి యాంధ్రలోకముచే సంపూజ్యులగుట యపూర్వదైవసంఘటనాచమత్కృతులలో నొకటి. అందును ఈ కవిత్రయమున కా పురుషత్రయముతో నామసామ్యముకూడ నేర్పడినది. శంభుదాసుడగు ఎఱ్ఱన భారతరచనావిషయమున మూలస్థానము—అనగా నడిమిభాగము నాక్రమించినాడు. అతనికి దక్షిణవామాంగములందు మిగిలిన పురుషు లిద్దరును గలరు. 'కవిబ్రహ్మ' వామాంగమును, నారాయణసహోదరుడగు నన్నయ దక్షిణభాగమును నాక్రమించి యున్నారు. నన్నయతిక్కనల భారతరచనారీతుల యంశములు శంభుదాసుడగు నెఱ్ఱనలో సమముగా నమరియుండుటకూడ నీ త్రిపురుషోపమానమున కద్భుత రీతిని వన్నెపెట్టుచున్నది. మూలశ్లోకములో 'పురుషోత్తమాంబుజభవశ్రీకంధరు'లని చెప్పిన క్రమమును తరువాతి గద్యలో 'హరిహరహిరణ్యగర్భపద్మావాణీపతులను స్తుతించి' అని మార్చుటలో నన్నయకు ప్రత్యేకోద్దేశ మేమైన గలదా అను ప్రశ్న కలుగకమానదు. శ్లోకమునందలి త్రిపురుషుల క్రమము భారతభాగరచనాకాల ప్రాధాన్యములను సూచించునదివలె నున్నది. నన్నయ తరువాతివాడు కవిబ్రహ్మ; అతని తరువాత శంభుదాసుడు. గ్రంథమున నన్నయతరువాత హెచ్చుభాగమును రచించినవా డగుటచే కవిబ్రహ్మకు శంభుదాసునికంటె ప్రాధాన్యము కూడ హెచ్చు. ఇక గద్యములోని క్రమము పూర్వాపరభాగములను రెండిటిని కలుపుచు నడుమ నిలిచి గ్రంథమునకు సంపూర్ణత్వము నాపాదించినవాడు, వారిద్దరి యంశములను దనలో సమర్చుకొనినవాడు శంభుదాసుడు అను భావమును సూచించునదివలె నున్నది. ఇది వాస్తవముగా నన్నయయుద్దేశము కాకపోయినను, అత డట్లు శ్లోకమున నొకరీతిని త్రిపురుషులను స్తుతించి, లేదా రాజనరేంద్రుని చే స్తుతింపజేసి, వెంటనే యా క్రమమును మార్చి గద్యలో చెప్పుటనుబట్టి యేర్పడిన యొక అపూర్వచమత్కారముగా గనబడుచున్నది. అతని వాక్కున కట్టి భావిదర్శకశక్తి కలదనవలెనేమో. ఏమైనను మహాభారతమునందలి యాయా భాగములు తెలుగుచేతకు వారివారి పాల బడుట ఆంధ్రలోకమున కబ్బిన యొక మహాభాగ్యమని తలపవచ్చును. ఆంధ్రోక్తిమయప్రపంచమున నీ త్రిపురుషులమూలమున గలిగిన యీ తొలిసంఘటన మత్యద్భుతమైనది.

భారతమునందలి మొదటి మూడు పర్వములలోని కథాభాగము నన్నయవంటివాడు తెనిగించుట కెట్లు తగియుండినదో, నానారసాభ్యుదయోల్లాసి యగు విరాటపర్వకథ యావలిభాగముతో గూడి కళావిదుడగు కవిబ్రహ్మచే తెనిగింపబడుట కట్లే తగియుండినది. వీరి యంశములను దనలో నిమిడ్చికొనిన శంభుదాసుడు

‘తద్రచనయత్నా’ నారణ్యపర్వశేషమును పూరించుటలో విష్ణ్వంశముయొక్క ప్రాధాన్యమును వ్యక్తపరచినవాడైనాడు.

అంతకుపూర్వము దేశమున వ్యాప్తిగాంచియున్న దేశీయ సాహిత్యసంప్రదాయములను, తన కాలమునందలి సర్వభాషాంతరములందలి విద్వజ్జనంబుల యనుగ్రహమును బొందగలిగిన రీతిని, గీర్వాణభాషా సాహిత్యసంప్రదాయముతో సమ్మేళనము బొందించి, మహాభారతబద్ధనిరూపితార్థ మేర్పడ దెనుగున రచించుటలోనే నన్నపార్యుడు తన లోకజ్ఞతను, అధికధీయుక్తిని వ్యక్తముచేసికొని, ఆంధ్రభాషా వాగనుశాసనుడై వెలసినాడు. కవి యెట్టివాడైనను దేశకాలపరిస్థితు లాతని రచనావైఖరియందు కొంతవరకైనను ప్రతిఫలింపక మానవు. ఇంతే కాక వారివారి భావములకు, జీవితపద్ధతులకు ననుకూల వాతావరణము కలిగినప్పుడు, లేదా వారు కల్పించుకొనగలిగినప్పుడు కవిప్రతిభావిశేషము మరింత వన్నెగాంచును. నన్నయకు రాజనరేంద్రుని యాశ్రయమున నట్టి యపూర్వావకాశము లభించినది. ఆతడు అవిరళ జపహోమతత్పరుడు, సంహితాభ్యాసుడు, నానా పురాణవిజ్ఞాననిరతుడు, సద్వినుతావదాతచరితుడు. ఇట్టివానిని కరుణతో జూచి "మనుమార్గవర్తనుడు, అగ్రజన్ములకు ననుగ్రహమున జారుతరాగ్రహారముల నిచ్చువాడు, భూదేవకులాభితర్పణమహీయః ప్రీతియుక్తా భారతశ్రవణాసక్తియు పార్వతీపతిపదాబ్జ ధ్యానపూజామహోత్సవమును సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యము నెప్పుడు బాయకుండువాడు, భారతశ్రవణాభిరతి కలవాడు అయిన విష్ణువర్ధనుడు "అస్మదీయవంశమున ప్రసిద్ధులైన పాండవోత్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట"మని బహుభాషల బహుభంగుల వినుచు భారతబద్ధస్పృహులగువారికి బహుయాగ ఫలంబు చేకూరునని ప్రకటించి కృష్ణద్వైపాయనమహాభారతబద్ధనిరూపితార్థ మేర్పడ దెనుగున రచియింపుమని యానతిచ్చుటకంటె ననుకూల వాతావరణ మేమి కావలయును?

అట్టి వైదికమతాభిమానము గల ప్రభువుయొక్కయు, అప్పటి విద్వజ్జనంబులయు ననుగ్రహమును బడయగలిగినరీతిగే, ధరామరవంశవిభూషణుడగు నారాయణుని సహాయముకూడ లభించుటచే, నన్నయభట్టు తెనుంగునకు మహాభారతసంహితారచన బంధురుడైనాడు. ఈతని జీవితపద్ధతికి, మేధాసంపత్తికి, ఈతని ప్రభువుయొక్క భావవృత్తికి సరిపోయినట్లుగనే మహాభారతమందలి తొలి మూడుపర్వములు మాత్రమే యీతనిపాల బడినవి. ఇందలి కథాభాగమే వైదికమార్గప్రవణమగు నీతని హృదయతత్త్వమునకు జక్కగా సరిపోయినది. భృగువంశభారతవంశాదుల సంకీర్తనము, ప్రాచీనమహర్షుల మాహాత్మ్యకథనము, మహాపురుషులయు, భారతవీరులయు జన్మాదుల కథనము, ఋష్యాశ్రమపుణ్యతీర్థాదుల వర్ణనము ప్రాచీనభారత పురుషులయు పాండవేయులయు సుగుణాదిసంకీర్తనము, వైదికధర్మములు, యజ్ఞయాగాదులు, వేదఘోషలు, తీర్థయాత్రలు, ధర్మమీమాంసలు, దేవాసురమానవసంబంధములు, లోకాంతర జన్మాంతర సంబంధములు మొదలగువానిని గూర్చిన వర్ణనల చేయుటలో నన్నయకు గల సహజోత్సాహమును వ్యక్తపఱచుకొనుట కాతని కీభాగము చాల ననువుగా లభించినది. అవిరళజపహోమతత్పరుడగు నన్నయవలెనే తిక్కనార్యుడును వైదికమార్గనిష్ఠను వర్తనముకు దానను నిర్వహించుచునే, కావ్యరసముం గొనియాడుచు కవిత్వతత్త్వనిరతిశయానుభావాంతఃకరణుడై యాతనివలెనే భారతసంహితను హరిహరనాథున కారాధనవిశేషముగా జేసి చెప్పగాంచి తన పుట్టువును కృతార్థతం బొందించికొనెను. శ్రీవాణీగిరిజలను వక్షోముఖాంగములందు ధరించిన త్రిమూర్తుల నాతడు స్తుతింపగా, శ్రీయన గౌరినా బరగు చెల్వకు చిత్తము పల్లవింప హరిహరంబగు రూపము దాల్చియున్న హరిహరనాథపరతత్త్వమునే యీతడు గొల్చి లేఖ్యంబైన యా భారతామ్నాయమునందలి ధర్మాద్వైతస్థితి నాంధ్రలోకమున నెలకొలిపినాడు. హరిహరుల కారాధన విశేషముగా సమర్పింపబడిన ప్రబంధమండలినే యనుసరించి తాను ప్రబంధపరమేశ్వరుడైన శంభుదాసు

డీ యిద్ధరనడుమను నిలిచి యీ భారతామ్నాయపరిపూర్తికి దోడ్పడినాడు. ఆకాలమున నింకను మూలమూలల దేశమునందు బ్రబలియున్న జైనబౌద్ధధర్మములను నిశ్శేషముగా నిర్మూలించి సనాతనధర్మ ప్రతిపాదకమైన వైదికధర్మమును ప్రతిష్ఠాపించుటకై చాళుక్యకులాభరణుడగు రాజరాజనరేంద్రుడు తలపెట్టిన మహోద్యమమున కండగా నిలిచి యీ వేదత్రయమూర్తుల వలెనే యీ కవిత్రయమూర్తులును పంచమవేద మనబరగిన భారతసంహితనాంధ్రమున వెలయించి ఆమూర్తుల యద్వైతభావముతోబాటు ధర్మాద్వైతస్థితిని గూడ శాశ్వతముగ నాంధ్రలోకమున బ్రతిష్ఠాపించినవారై నారు. ఈకారణముచేతనే కాబోలు నీదేశమున జైనబౌద్ధములు నిశ్శేషములగుటయే కాక వీరశైవము, వీరవైష్ణవముగూడ నొకకాలమున బ్రబలినను అవి యిచట పాదుకొనలేకపోయినవి. అప్పటికి నిప్పటికినిగూడ నాంధ్రుల కద్వైతభావముననే, ధర్మాద్వైతముననే యాదరభావ మధికమైయున్నది. దక్షిణదేశమున గల యన్ని సుప్రసిద్ధ శైవవైష్ణవదేవాలయములుగాని, అచ్చటి శైవవైష్ణవమతాభినివేశముగాని యాంధ్రదేశమున గానరావు. ఆంధ్రజనసామాన్యమునకు శివకేశవు లిద్దరియందును సమానముగ ప్రతిపత్తియే కలదు. ఆనాటి కవిత్రయమువారి భారతమువలెనే యాంధ్రసాహిత్యమునందలి తరువాతి కవుల రచనలుగూడ, అనగా భాగవతాదిపురాణములు, పెక్కుప్రబంధములును ఆంధ్రజనుల జీవితమున నిరూఢమైన ధర్మాద్వైతస్థితిని సూచించునవై వెలసినవేగాని మతపరముగా వీరత్వమును సూచించునవి కాలేదు. ఇట్లాంధ్రుల యీ వైదికధర్మతత్పరతకు తొలుత పునాదివేసినవాడు నన్నపార్యుడే.

ఈ వైదికధర్మతత్పరతయందువలెనే, వేదసమ్మితమగు నా గీర్వాణభాషయందు నీతనికి గల విశేషాభిమానమును వెల్లడించుకొనుటకే గావలయు, తెనుగు భారతము కృత్యాదిశ్లోకమును గీర్వాణభాషలోనే రచించినాడు. వైదికమతాభిమానమువలెనే గీర్వాణభాషాభిమానముగూడ నీతని రచనయం దెల్ల యెడల గానవచ్చుచునే యుండును. ఈతని పదప్రయోగపద్ధతి, వాక్యరచనారీతి, భావావబోధనసరళి మొదలగునవి పెక్కుచోటుల సంస్కృతభాషామర్యాద ననుసరించి తెనుగున జేసిన రూపకల్పనమా యని యనిపించుచునే యుండును. నన్నపార్యుడు ప్రయోగించిన తత్సమశబ్దములే కొన్ని మూలార్థముననే ప్రయోగింపబడుటచేతనో, కాలక్రమమున వాడుకలోను, అర్థమునను మార్పు గలుగుటచేతనో, ఈకాలమున మన కవి విచిత్రములుగా గనబడుచుండును. ఆకాలమునాటి యాతని భాష, ప్రయోగసరళి తరువాతికాలమున సరిగా నర్థముకాకపోవుటచేతనే వ్రాయసగాండ్రచే క్రొత్తపాఠములు గల్పింపబడుట తటస్థించినది. అప్పకవినాటికే యట్టి పాఠములు గల్పింపబడిన ట్లాతడు సూచించియే యున్నాడు. ఇట్టి సందర్భములో నన్నయ మూలపాఠమును గనిపట్టుట కొంత ప్రయత్నసాధ్యముగాని సులభము కాబోదు. ఆంధ్రవాఙ్మయమున తొలిగ్రంథము నీ నన్నయభారతభాగమును భిన్నరీతుల బరిశీలింపవలసిన యావశ్యకత గలదు. నన్నయ ప్రయోగించిన శబ్దజాలము నకారాదిపట్టికగా జేర్చినగాని, యంతకు పూర్వమునను, సమకాలమునను గల శాసనభాషకును, దీనికిని గల తారతమ్య మెట్టిదో, యీతడు చేసిన సంస్కార మెట్టిదో, ఎంతవరకు గలదో, అప్పటి దేశీయమునకును—లేదా వ్యావహారికమునకును, నన్నయ భారతమున సమకూర్చిన శిష్టగ్రాంథికభాషకును గల వ్యత్యాస మెట్టిదో మనము తెలిసికొనలేము. భారత భారతీసముద్రము దరియంగ నీద సాహసించినపు డుభయభాషాకావ్యరచనాభిశోభితుం డని చెప్పికొనిన యీ నన్నయ అటు సంస్కృతభాషనుండియు, నిటు దేశభాషనుండియు నెట్టి సాధనకలాపమును సంగ్రహించి మేళవించుటచే, సామాన్యముగా నపభ్రంశభాషయని, ఉద్గ్రంథరచనానర్హ మని యూహింపబడుచుండెడి తెనుంగుబాసను తేనెలొలుకు మృదుమధుర భాషగా నిర్మాణముచేసి, దానిచే తరింపగలిగెనో, ద్వైపాయనోద్యానజాతమహాభారత పారిజాతమున నమరభాష కంటుగా గట్టిన యాంధ్రభాషలో నెలకొల్పుటలో నాతడు చూపిన ఘటనాఘటన సామర్థ్య మెట్టిదో, యీ మొదలగు ననేకవిషయములను తద్ర

-చిత భారత భాగానుశీలనమువలన మనము తెలిసికొన వలసియున్నది. గ్రంథమా, సంస్కృతమున కృష్ణ ద్వైపాయనమునివ్యాసభాభిహితమహాభారతము. దీని యామోదించువారు 'బహుభాషల బహ్వర్థంబుల వినుము భారతబద్ధస్పృహుడగు' చాళుక్య ప్రభువు, నాతని సత్సభాంతరమునందలి విద్వజ్జనంబులు, వారిని మెప్పించి తాను ధన్యుడగుటకై నన్నయ యాంధ్ర భాషను సంస్కృతభాషామహాపారిజాతమున కంటుగా గట్టి తన కార్యమును సాధించుకొనగలిగినా డన్న తప్పేమున్నది? ఈ కారణముచేతనే తెను గొక్క సారిగా నట్టి యుద్గ్రంథరచన కనుకైన భాషగా దీర్ప బడినది. ఆతని చేతులలో తెను గట్టి మహాకార్యనిర్వహణమునకు సమర్థమైన రూపమును బొంది దానిని నిర్వహింపగలిగినది. ఈ సందర్భమున నన్నయ దేశీయమై, పండితకోటిచే నొకవిధముగ నీసడింపబడుచుండెడి తెనుగు నెట్లు సంస్కరించినాడో, యీ దేశభాషను వారి దృష్టిలో గౌరవనీయమైనదానినిగా జేయుట కట్టి గీర్వాణభాషామర్యాదలను, పదజాలమును నిందు చేకవించి దీనిని మహత్తరమైన భాషగా దిద్దినాడో మనము పరిశీలింపవలయును. ప్రస్తుతము నన్నయ చేసిన కొన్ని సంస్కృతపదప్రయోగములందలి చమత్కారముల నారయుదము.

అభిప్రాయంబు:—రాజనరేంద్రునకు మహాభారతమునందలి 'యభిప్రాయంబు' విన నభిలాష. పెద్దదై యుండునట. ఒకరి యభిప్రాయమును వినగోరుదుము గాని ఒక గ్రంథమునందలి యభిప్రాయ మనునది యిప్పటివారికి క్రొత్తగా గనబడకపోదు. ఒక గ్రంథమునందలి 'యభిప్రాయ' మనగా నందలి తాత్పర్యార్థమని భావము. మరియొకచో "మీ యనుగతి నాకు నభిప్రాయంబు"—ఇచ్చట 'అభిప్రాయంబు'నకు 'సమ్మతి' మని యర్థము కావచ్చు.

పైవాక్యమున 'విన నభిలాష పెద్ద' యనుటకు బదులుగా భారతము లక్ష్మీపతిగారి ప్రతిలో 'విన నర్థి పెద్ద' యను పాఠముకలదు. 'అర్థి'శబ్దము కోరిక,అభిలాష యను నర్థముననే ప్రయోగింపబడియుండును. కాని యది వ్యవహారభ్రష్టమై క్రొత్తగా గనబడుటచే 'అభిలాష' యనునది దాని స్థానమున జేర్పబడి యుండును. నన్నయ దీనిని పలుమార్లు ప్రయోగించెను. యుద్ధమల్లుని బెజవాడ శాసనములో 'రాజ పల్కిభూవల్లభుం డర్తిగా' అనుచో 'అర్తిగా' అని కలదు. ఇది 'అర్థిగా' అనుదానికి బదులు లేఖకుని ప్రమాదము గావచ్చును. లేదా 'ప్రేమతో' అను నర్థము గల 'అరులు'శబ్దసంబంధమగు 'అర్తి'శబ్దమా?

తర్పణము :— 'భూదేవకులాభితర్పణమహీయప్రీతి' కలవాడు రాజనరేంద్రుడు. ఈ 'తర్పణ' శబ్దమును వాడుటలో నన్నయకు ప్రీతి ఎక్కువ. దాని మూలార్థమగు తృప్తినొందించుట యను నర్థముననే యాతడు వాడును. "దేవబ్రాహ్మణులకు నానావిధ పూజనముల తర్పణము చేసి"—ఈ 'తర్పణము చేయుట' అనునది యిటీవలి కాలమున 'పితృతర్పణము'లనే స్ఫురింపజేయునదైనది. "జనమేజయుండు గురుదేవమహీదేవ తర్పణాభిరతుండై" యుండె. 'రుధిరజలంబుల బితృతర్పణముసేసి'యనియు నాతడే ప్రయోగించినాడు. 'తృప్తినొందించి' యనుటకంటె 'తర్పణముసేసి' యనుటలోనే యాతనికి ప్రీతి మెండు. సామాన్యమై వైదికశిష్టవ్యవహారమున దీని కా కాలమున ప్రాచుర్యముండి యుండును. నన్నపార్యునికి వైదికశిష్టవ్యవహారమున గల యాదరమునకు మరికొన్ని నిదర్శనములు.

క్షణీయించుట:— "నీ వతిథివి మాయింట కృతభోజనుండవై పొమ్మని పౌష్యు డుదంకుని 'క్షణీయించె'నట. 'క్షణీయించుటకు' 'భోజనార్థము వరియించుటే'యర్థము కావచ్చును. 'క్షణంకృత్వా'-అనగా అవకాశము కలుగజేసికొని రమ్ము అని చెప్పుటయే లౌకి యర్థము. కాని 'క్షణః క్రియతాం'అని పితృకార్యములందు బ్రాహ్మణార్థమునకై చెప్పునపుడే ఇది తరువాతి వాడుకలో నిలిచినది. ఈ 'క్షణంకృ' అను దానినుండి 'క్షణీయించు' అను తత్సమధాతువును వైదికోత్తముడగు నన్నయతప్ప మరియొక రా కాలమున చేసియుండరేమో. దీనివలనే 'బ్రాహ్మణార్థము చేయుట'నుగూడ నన్నయ చమత్కారముగా బ్రయోగించినాడు.

నన్నయప్రయోగవిశేషముగా చెన్నదగినది శ. ర. లో గ్రహింపబడలేదు.

ఉపదేశము:—గరుత్మంతుడు వాడు లావు గలుగ కలయు, సాహారం బుపదేశింపుమని వినత నడిగినాడు= చూపుమని. ఉప + దిశ్ (to point out. show)= చూపుట. ఇప్పు డుపదేశము సామాన్యముగా మంత్రోపదేశపరము, లేదా హితోపదేశపరముగా వాడుకలో నున్నది.

జీవితంబు:—"నూరు గద్యాణంబుల జీవితంబు వాడు", "భృత్యకోటి కనూనముగా దగు జీవితంబు లాయత్తము సేసియిత్తె"—జీవితంబు = జీవనోపాధి= జీతము, జీవనాధారమగు వేతన మను నర్థమున 'జీవిత' శబ్దభవము 'జీతము' అనునది స్థిరపడుటచే 'జీవిత' శబ్దము జీవనము, ప్రాణము అను నర్థములనే యిప్పుడు సూచించుచున్నది.

నిర్గతములు:—"త్రేతాగ్ను లెల్లను తేజరిల్లమి జేసి క్రతుకృత్యము లని ర్గతములయ్యె"నట.=బయటకు వెళ్లగొట్టబడినవి. అనగా విడువబడినవి. చేయబడుట లేదని తాత్పర్యము. కృత్యములు నిర్గతములనుట ఇప్పుడు కొంత విచిత్రముగా గనబడక మానదు.

అపక్రాంతులు:—పారిపోయినవారు, దాటి బయటబడినవారు. "ఎదురోపఁబట్టభూవివరంబునం దపక్రాంతులై బ్రతికిరి" పాండవులు వివరంబునందు అపక్రమించినవారట. వివరమునందుండి (వివరము ద్వారా—గుండా) బయలువడిరి అన్నచో మన కిప్పు డర్థమగును. "వివరమునం దపక్రాంతులనుట" ఇప్పుడు మన కపరిచితభావముగా గనబడును. ఇట్టిదే "నూతిలో వెలువడ కోమలిం దిగిచి".

అక్షయులు:—పాండవులు లాక్షాగృహదాహము వలన 'నక్షయులై' జననీసహితంబుగా వనంబునకుం జనిరట. గృహదాహంబువలన నక్షయులగుట అనగా క్షయము లేనివారై—నాశనము పొందనివారై యనియా? లేదా క్షయము—ఇల్లు దగ్ధమైనదిగాపున ఇల్లు లేనివారై వనంబునకు జనిరనియా? రెండర్థములను సూచించునట్లు ప్రయోగమును చేయుటలోనే నన్నయ చూపిన చమత్కారము కలదనవలె.

అవకర్ణించుట:—అనాదరముతో వినుట, పెడ చెవి పెట్టుట. "జనహూ యజ్ఞము కడచనఁ నేరదు" అనిన పౌరాణికుని వచనం బవకర్ణించి యాజ్ఞికులు వేల్వ దొడంగిరట. సులభమైన తెలుగుపదము వాడక గంభీరమగు సంస్కృతశబ్దమును వాడుటయే నన్నయ కిష్టము.

అవజ్ఞానము:—'అవజ్ఞ' యనుటకు. "దీనికి ధృతరాష్ట్రు నవజ్ఞానము వడయుదును". శబ్దగాంభీర్యము కొరకే ప్రయోగము.

అపకర్మము:—జూదమాడుటకు ధర్మనందను దోడ్కొనిరమ్మని విదురుం బంపిన వాతంబు నాపగేయున కంతయు నెఱింగించి యిది 'యపకర్మ' మను చుండెనట. చేయగూడని పని యనుటకు.

కైతవము:—సుయోధనుడు తండ్రితో నిట్లను: "విదురుడు దీని నెఱింగెఁ జుమానుగా కత డేల శకుని కైతవంబున గొడంబడు గౌరవేంద్ర" కితవుని=జూదగాని, భావము=కైతవము. దీనిబట్టి కైతవమనగా మోసము, మిష అను నర్థము వచ్చినది. శకుని కైతవమునకు అన్నప్పుడు శకుని రాజ్యాపహరణమునకుగా చేయదలచిన మోసమునకు, లేదా శకుని జూదమాడుటకు. ఈ రెండర్థములను స్ఫురింపజేసినాడు.

దూషించుట:—విదురుడు ధృతరాష్ట్రునితో "కులదూషకుండైనవాని దూషించి కులంబు రక్షింపుము" అనెను. కులదూషకుడు=కులమున కపకారము చేసినవాడు. అట్టివానిని దూషించుట=పరిహరించుట, త్యజించుట అను నర్థము కావలె. సామాన్యార్థము—నిందించు, దూరు అను నర్థ మీ సందర్భమునకు సరిపోవునట్లు లేదు.

"అపకారకారణులైనవారిం బాంధవులైన నుపేక్షింపక దూషింపన." (ఆది. ౬-౧౯౯)

సార్థము:—"ధారుణీనాథసార్థంబు రావింప వలసె"—సార్థము=సమూహము. సామాన్యముగా నిది జంతుసమూహమును, వర్తకుల, లేదా ప్రయాణికుల సమూహమును సూచించునది. ధారుణీనాథసార్థ మనుట విశేషము.

# ఆంధ్రము ద్రావిడకుటుంబములోనిదా?

శ్రీ కాశీభట్ట కృష్ణరాయశాస్త్రి

ఆంధ్రము ద్రావిడకుటుంబములోనిదను వాద మెప్పుడిది వాలోచించినను నిల్చునది కాదు. ద్రావిడసంప్రదాయము కొన్నింట నున్నది కదా యన్నచో నది దుర్నివార మని యందును. అట్టి సంప్రదాయము లెవ్వరెవ్వ రాంధ్రులతోడి నికట సంబంధము కలిగియుండిరో వారివారివి దుర్నివారముగ కలియకమానవు. అంతమాత్రమున మూలరూపమును గాదనరాదు. ఆంధ్రాదిభాషలకు మూలముగ నొక భాష యుండెననియు, నది మూలద్రావిడమనియు, దజ్జన్యములే యాంధ్రకర్ణాటద్రావిడాదు లనియు ననుకొను వాదము నమూలకమే. ద్రావిడశబ్దము శబ్దప్రపంచసృష్టిచే నత్యంతము నర్వాచీనము కావున నాంధ్రాదుల నాంధ్రకుటుంబభాషలనుట న్యాయ్యము.

ఇక నీ తెలుగుభాష కేవలార్యభాష. అన్ని సంప్రదాయములును వైదికసంప్రదాయములై యున్నవి. గత డిసెంబరు భారతిలో శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు "వింతయక్షరములు-వాని పరిణామము" అని యొక వ్యాసమును ప్రకటించిరి. అందు "వానివలనఁ గొంత గానఁబడియె, కొంత తాన కలిగె, నంతియు గాక పై తెనుఁగు బాసవాఁగ వినుతికెక్కె" అని తెనుగునకే ప్రాధాన్య మిచ్చినారని యనిరి. అవును, తెలుగు ప్రధానమే కాని నాకు తెలుగుబాస యనుట వ్యర్థము. కాని "ఏషా తయో ర్భవే ద్వికృతిః" అను భావము లే దనుకొనుచున్నారు. ఈ భావమే యుండుటవలన "ఎల్లభాషలకును దల్లి సంస్కృతంబె" అని చెప్పియున్నారు. వికృతియను నామకరణ విస్పష్టపడదు.

## కొంత తాన కలిగె

ఇది సృష్టిమర్మము. ఏదియైనను దానై యుండుట యనగ మూల మజ్ఞాత మని యర్థము. అది యనాదియంటిది. అన్నింటికి నవాదు లున్నవి. పరమాణువులకు భ్రమణ మనాది. కావుననే "అనాది నిధనా వాగుత్సృష్టా" అని యుపదేశింపబడెను. ఆ యనాద్యంశమే తా నని గ్రహించుకొనవలయును. పరమార్థమున నదియు వివర్తమే యని వినోదింపవచ్చును. కాని కొంత తానగుట నిక్కము. భాషాశాస్త్రజ్ఞుల పరమార్థ మదియు నట్టిదే. గీర్వాణభాష ఇండోజర్మానిక మనియు, నిండోయూరోపియ ననియు నందురు. మూలాన్వేషణ మట్లే యుండును. అవ్యక్త మగును. ఆ యవ్యక్తమునకు ద్రావిడ మని పేరిడుట ద్రావిడప్రాణాయామమే. దానికి 'మూలాంధ్ర' మనియో, 'మహాంధ్ర' మనియో పేరు పెట్టుడు. అప్పు డర్థవంత మగును. దేశ్య, ప్రవాహిని యనిరి, కాని ద్రావిడ మని యెవ్వరును ననలేదు.

కొన్నివర్ణములు దేశీయభాషోచ్చారణసంప్రదాయములకు జెందిన వని యనుచున్నారు. అవును. వర్ణములు, పదములు, వాక్యములు మున్నగునవి కొన్ని దేశీయములే కావని యెవ్వరందురు? ద్రావిడము మాత్రము గాదు. అనాది. కొన్నింటికి మూలము లన్వేషింప వైదికములుగ దెలియుచున్నవి.

## ఎ, ఒ, చ, జ, ఱ, ఁ

ఈ యాఱింటను గల సంప్రదాయమును సమన్వయించుకొందము. ఈ యాఱును మూలప్రకృతియను

సంస్కృతమున లేకున్నను దెనుగున నుండుటకు గారణ మేమి? సమాధానము లేదే యని యనుచున్నారు. సంస్కృతమున లేకున్నను ప్రాకృతమున గలవని మఱి మున్నది. "అసలు ప్రాకృతమున నుండుటకు గారణ మేమి!" అని శంకింతురు. సమాధానము కుదిరినను శకటరేఫమో యని వాదింతురు. ఇంతకును వర్ణోచ్చారణము వివిధము.

ఏవేని పలుకబడవలయునో వానిని స్వయముగ సృష్టింపజేసిరి. అది స్వసంప్రదాయము; స్వాభావికము. ప్రాకృత మను శబ్దమునుగూడ స్వాభావికము (Natural) గనే భాషాతత్త్వజ్ఞులు గ్రహించిరి. అయినను వేదసంస్కృతమునను యా జాడలు గలవు. 'ఏ' అను రేఖయే మొదటి యక్షర మగుటయు, దరువాత బలుకబడునది చిన్న యోజక రేఖతో 'ఏ' అనిరి. వేదజ్ఞులు 'హా వామ-హో' అనుదాని స్వరకల్పనమును సామములో 'హో...ఏ' అని యజంతమును విఱిచి పఠింతురు. మఱియును సాంప్రదాయికముగ 'ఏ' ను వ్రాసి కావలయునన్న 'ఏ'గా, రేఖారహితముగ నుచ్చరింతురు.

వ్యాకరణజ్ఞులును నకారాదులు హ్రస్వదీర్ఘములుగ జెప్పబడినను నష్టాపకాలభేదముల నున్నవని యండ్రు. ఇన్నియును ఉటంకర్పరించియుండునో అట్లు హ్రస్వమగు ఎకారోచ్చారణము సంతర్పరించి పలుకుబడుల నుపయోగించియుండ్రు. ఆ యాచార మంతరించుటచే గ్రహింపకున్నను జాడలను దీయవచ్చును. మఱియును, వైయాకరణులీ యక్షరములను విశేషాక్షరములనుగా గ్రహించిరి. కావుననే గుణసంజ్ఞకములయ్యెను. ఈ 'ఏ, ఓ' లు గుణము లనటలోనే ముఖ్య వర్ణగ్రహణ మున్నట్లు స్ఫురించుచున్నది. 'ఏ' అని వ్రాసిరే 'ఎ, ఏ' ల కుపయోగించుట యాంధ్ర సంస్కృత పండితుల కందఱకు దెలుసు. నాగరాక్షరములు కృతకములు. పూర్వాక్షరములు పరిణతములు. కావున హ్రస్వమగు ఎకారము వేదసమకాల వేదసన్నిహిత వ్యవహారభాషలలో గలదని నిశ్చయింప గలయును. వేదగతభాషాపదములలో నొక్క పదమేని హ్రస్వమగు ఎకారములో జూపలేరుకదా యని తృప్తిపడుట కవకాశము లేదు. జ+ఞ, క+ష—ఈ మొదలగు నక్షరముల యుచ్చారణ ఎట్టిదని నిరూపింపలేము. ఏ సమాసమునందే పదమున కే స్వరమో యెట్లో చెప్పలేరము. అనునాసిక్యము లగునవి యేవో నిర్ణయింపలేము. గురుశిష్యపరంపరలో గొన్ని యుచ్చారణములు ప్రతిజ్ఞాతములై యున్నవి. కావున హ్రస్వోచ్చరిత మగు ఎకారము లే దని యనలేము. ఆర్యభాషావిభాగ మన్నింటను ఎకారము వినబడుచున్నది. కావున ఆంధ్రంబునందలి 'ఏ' కారమును, ప్రాకృతగతమగు ఎకారమును వేదభాక్షియమే యని నిర్ణయింపవలయును. ఇంతకును ప్రాకృతమునం దున్నవని యందఱెఱిగిన విషయమే. అట్లే 'ఒ' కారము గూడ వైదికమే. సంస్కృతమగు 'అ' కారమే 'ఒ' కారమై యుండవలయును. ఆ యుచ్చారణమే యుత్కలాదిభాషలలో గలదు. పాణినియు "అ అ" అను సూత్రమున నిరూపించెను. రేఖాన్యాస మీ భావమునే స్థిరపఱచును. 'ఎ, ఏ—ఒ ఓ'—ఈ యక్షరముల రేఖాన్యాసములే పూర్వోచ్చరరూపోచ్చారణ నిరూపకములై యున్నవి. దేశీయుల యుచ్చారణసంప్రదాయమునుబట్టి ఎ, ఏ, ఒ, ఓ, ఐ, ఔ లుత్పన్నములైనవని యందురు. అవును. ఆమాత్రమున ద్రావిడ మెట్లగును? ఆ వైదికులే దూరదూరముగ నుంట నుచ్చరించుటలో భేదమును సంఘటించిరి. 'వరేణ్యమ్' అనునదియే 'వరేణియం'గా మాఱెను. 'తత్ సవితుః' 'తద్ సవితుః' అనియు, 'హంసః' 'హగ్ంసః' అనియు భేదించెను. ఇట్టి భేదములన్నియు వ్యవస్థాభేదములు. వైదికులు 'కపాల' మనగా ధార్మికులు 'కఫాల' మందురు. కావున ఎ, ఒ మొదలగు నక్షరములు వికసితము లనుటకంటె ప్రకాశితము లనుట లెస్స.

### చ - జ

ఈ రెండును ప్రాకృతములయందు గలవు. వైదికుల పూర్వోచ్చారణమునందు గలవు. కావుననే చ, జ-లు త, ద-ల వినిమయస్వరూపములతో నున్నవి. వ్రాతయందును "త్స-చ" వాడుక యందందు గలదు.

ఆంధ్రాక్షరములలో ద్వితీయజాతి యని సూచించు 'ఛ' ద్విసంఖ్యారేఖా వ్యాసమున్నది.

The M S S. generally writes 'ch' instead of 'cch' as result of the combination of 't' and 'c'. (Sanskrit grammar- by Whitney.)

ఈ మొదలగు పరిశోధక వాక్యములవలన చ, జ ల దంత్యస్వరూపముగూడ ననార్య మనరాదు. ఉచ్చారణోచితస్వభావానుగుణ్యముగ నున్న యాంధ్రాక్షరతద్భవములను ద్రావిడ మనుట న్యాయ్యమో, పరిమితమై సంకీర్ణమై యున్న ద్రావిడధ్వనులను మూలమనుట న్యాయ్యమో విశదింపుడు. కావుననే చ,జ-లు సవర్ణము లని వైయాకరణు లనిరి. సంస్కృతధ్వనుల నుచ్చరించు సంప్రదాయ మాంధ్రాదిభాషలలో నట్లుండుటయే సహజము. ఆర్యభాషాకుటుంబమునకు భిన్నముగ చ, జ లు పలుకబడలేదు. స్వభావసిద్ధము గాదు. కావున వైదికార్యులే విస్తరింపబడు మనుచ్చారణములలో కొన్ని యతిక్రమములు పూర్వరూపమును వ్యాకరణశాసనము నుల్లంఘించియే వాడుకొనుచున్నారు. ఇంతియేగాని, ఏవి కేవలార్యసంప్రదాయము లని శ్రుతిస్మృతీతిహాసములను బట్టి నిర్ణయింతురో యా యార్యసంప్రదాయము లెల్ల నన్నింటను నాంధ్రము నందు స్పష్టముగను, దాక్షిణములందు భాషామాత్రముగ నున్నది. సంస్కృతమున ళకారము లేదు. వేదమున గలదు. కాని యాంధ్రమున గలదు. 'క్ష' వర్ణము సంయుక్తాకారమున నాంధ్రమున నున్నది. నాగరమున ప్రత్యేకముగ సంయోగరూపవిలక్షణముగ 'क्ष' వ్రాయబడు చున్నది. తాలవ్యశ్యవహారము శాసనములందు దున్నను సనాతనముగ క్వాచిత్కమైన దంత్యస్వభావ ముండుటచే సంధులయందు దారూపము గానవచ్చును. తత్ + చతురః = తచ్, చతురః అగును. అనగా 'త' కారము చకారాంతములో లయింపగల దనుట. ఏ వర్ణ మెందు లయించునో యా వర్ణమునకు సమగ్రత లెల్ల తత్స్వభావమునుబట్టి బోధపడగలదు. వేదకాలమునుండియు నున్న వర్ణమాలావ్యవహారములోనివే 'ఎ, ఒ, చ, జ' వర్ణములు. అట్లగుటచేతనే వర్ణమాలాంతఃపాతులుగ నీ వర్ణచతుష్టయము నాంధ్రులు వర్ణమాలలో జేర్చుచున్నారు. ఇందును వైదికముగనే యుచ్చరదివ్యాల్గు వర్ణము లనియు, దదధికము లనియు మతము లున్నవి. శైలాలి యను నామమున నాకున్నను మన పూర్వులు భాషాతత్త్వము నెఱిగియే యున్నారు. కావుననే అచ్ సంజ్ఞ చేతను, ఏచ్ సంజ్ఞచేతను ఎ, ఒ లను గ్రహించి, చజలను ద్విరోక్ష్యముగ నిపతించి సవర్ణము లనిరి.

ఱ,ఁ

ఇక శకటరేఫము, నఱసున్న యను నీ రెండు ధ్వనులను సంస్కృతప్రాకృతజన్యము లనరాదు. "కావున వీని నైనను తెనుగున సహజము లనక తప్పదు గదా" అని రామకృష్ణయ్యగారే వ్రాసిరి. వారి వ్రాతయే ఎ, ఒ, చ, జ - లు ద్రావిడదౌర్బల్యములను సూచించును. అది యట్లుండనిండు. ఈ శకటరేఫము తెనుగున ప్రత్యేకశ్రద్ధతో నాదరింపబడుచు న్నదని చెప్పవచ్చును. తెనుగున సహజన్యము లున్నవి. ఉన్నవి కావున ద్రావిడమే యనరాదు. అనుట కాధారము లేదు. తమిళాదులందుగూడ నీ శకటరేఫము వంటి దుండుటచే తెనుగును దమిళాదికుటుంబమున జేర్చుట కంటె దమిళాదిని తెనుగుకుటుంబమున జేర్చుటయే తగును. అట్లు చేర్చుటచే సంప్రదాయము అయినను నాంధ్రదేశమున తొలినుండియు భాషాతత్త్వ సంప్రదాయ మొక టున్నది. వర్ణమాలాబోధమునందు గ్రమముగ జెప్పి య, ర, ల, వ, శ, ష, స, హ లను సంస్కృతప్రాకృతత్రిలింగసాధారణముగ గ్రహించి, విలక్షణవిసర్గము లగుటచే "ళ, క్ష, ఱ, ఇతి" చెప్పుకొనుట యాచారముగ నున్నది. ఇందలి 'ళ' వేదప్రాకృతసమానము. 'క్ష' సర్వసామాన్యమే కాని విలక్షణన్యాసి గలది. 'శాంక్షను' (Sanction) ధ్వనివంటిది కాదని ప్రశంసించిరి. ఇక మిగిలినది శకట రేఫము. ఈ వర్ణ మాకృతిధ్వనివ్యత్యయభిన్న మగుటచే ప్రశంసించిరి. దీనిని బండిఱ యని యందురు. రేఫత్వ ముండుటచే శకటరేఫము రేఫస్థానీయమయ్యె శకట లక్షణవిధతోచ్చారణము దేశీయజాతికవ్యక్తమై భిన్న

భిన్న లేఖకులచే భిన్నభిన్నాకారములను బొందుచు న్నయవాటికి స్థిరాకృతిమత్త నొందియుండ వచ్చును.

అలవనియా మెతగా ('ஞ') ఒత్వమునకు బదులు ('ஐ') ఎత్వోత్వములు రాలేదా? 'కొ' అనుటకు 'కెు' అని వ్రాయుచున్నాము. ఇది దురాచారముకదా! ఇట్లే శాసనలేఖకులను గండాచార్యులు లేదేశమువారో యెట్టివారో, తెలిసికొన్నచో లేఖన వైవిధ్యమునకు గారణము బోధపడును. తమిళమును వ్రాయునప్పుడు 'ழ' అను యక్షరమును 'ళ'గనో, 'డ'గనో వ్రాయుదురు. జిహ్వామూలీయములు, యమవర్ణములు, వర్త్స్యశ్రము లేఖనమునుండి తొలగిపోవుచున్నవి. కావున శకటరేఫమే వైదికసంయుక్త వర్ణోచ్చారణమునకో వ్రాయబడియుండును. వేదమునందలి వర్త్స్యవర్ణమే ఱ, ఱ, డ, ఱగ వ్రాయబడి యుండనోపును. ఆంధ్రమునుండి యితర భాషలకును సంక్రమించియుండును. ఏది యెట్లున్నను శకట రేఫము మన తెనుగున నేటివఱకును నున్న దనగలము.

తమిళమున గల పదాంతనకారమును అన్నకారము తెనుగున నుండెడి దనియును, దరువాత నంతరించి ద్విత్వటకారోచ్చారణముల బరిణమించె ననియును, నదియే వర్త్స్యశకార మనియు ననుచున్నారు. ప్రమాణలేఖనములు శాసనములే. అందు న్ఱ న్ఱు, న్ఱి, న్ఱు వివిధముగ నున్నవి. శబ్దనికాసమే శరణ్యము. మగన్ఱు, అచ్చినవాన్ఱు ఇత్యాదుల యంత్యమున దంత్యనకారయుక్తవర్త్స్యశకారమే శకటరేఫముగ బరిణమించె నందురు. దాని కేమిటెండు: పాళీ, గాథా, మాగధీ ప్రముఖప్రాకృతభాషలలోని మార్పు, నీ తెనుగులో మార్పు సమానముగ నున్నది. మగశబ్దము 'మహత్' శబ్దభవము. 'మహా' 'మగ' అయి, నిర్దేశవాచకముగ నాలంబభూతమైన వైదికమగు 'ను'కారము (తదుపర్యవస్థ)చేరి 'మగన్ను'గనై, సాజాత్యమువలన 'మగండు' అని సిద్ధించెను. కొన్ని శబ్దము లకారణముగ సానునాసికములగుట స్వభావము. విద్—విన్ద్, చది—చన్ద్, కృష్—కృష్ణ్ ఇత్యాదు లన్నింట నున్నవి. కావుననే "ప్రతిజ్ఞానువాసిక్యాః పాణినీయాః" అని సంప్రదాయ మయ్యెను. తొల్కాప్పియమున జెప్పబడిన పదాంతనకారము అ-స్థానీయానునాసిక మగును. దాని యుచ్చారణము మూర్ధన్యస్థానీయముగనే యుండవలయును. కావున మన తెనుగువర్ణమాల కడపటిదగు 'ఱ'వర్ణమునే యనుకరించి తమిళులు అన్నకార మని వాడుకొని రనుకొందును. సంధి రూపములందు స్వరవ్యంజనసంచలనములు విపర్యాసములుగ నుండునంత జన్యజనకతల కతలు కానిపనియే. చిట్టెలుకరూపములో గల గుట్టుమాటో యని యందు రేమో?

## చిట్టెలుక

చిఱు + ఎలుక—ఈ రెండును గలిసి ప్రారంభమున 'చిఱ్ఱెలుక'యై ద్విత్వటకారముతో నేటికి బరిణత మయ్యెనని యందురు. ద్విత్వటకారము నిపాతములవట్లు తత్సజాతీయములుగ బలుకబడునవియే కాని ద్రావిడసంప్రదాయము కాదు. మొదలు + మొదలు, తుద + తుద, చీకటి + చీకటి, కడ + కడ, ఈ మొదలగు శబ్దముల కలయికలో ద్విటకారస్థితి కేమి కారణము? స్వ వై స్వ్యమని వానికి పేరు. 'పలుకక' అను పదమును జానపదులు 'పల్లక'యని యందురు. లు, క-లు 'ల్ల'గ మాఱెను. మఱియును మిద్దె + ఇల్లు = మిద్దెటిల్లు అగును. ఇందలి టకారమునకు గారణమేమి? యుద్ధపుటోడలోని టకారమునకు గతి యేమి? ఆయా పదములయు, దత్సంయోగములయు ప్రాబల్యము మనస్సుపై వ్యాపించి యథోచితవర్ణముల బలికించును. శ్రీ అరవిందపండితు డనినట్లు కొన్ని పదపదయోజనములు మనః ప్రబుద్ధము లనవలయును. "Psychology of Philology" అని ప్రత్యేకముగ నిరూపించుకొనవలయును. మూర్ధన్యవర్ణప్రబలత యున్నచో మూర్ధన్య పరుష వర్ణము స్పష్టభావార్థము ద్విరుక్తమగును. చిఱు శబ్దాంత్యము మూర్ధన్యతరు రేఫము. 'ఎ' అనునది కేవల వివృత ప్రయత్నమగుటచే బూర్వవర్ణము స్వరవ్యంజనయుక్తిచే ప్రబలమై 'ట్ట' గ మాఱెను. ఈ శకటరేఫోచ్చారణ మిట్లుండెనని యిప్పు డనలేము. తద్వర్ణగత

ప్రత్యేకవిశిష్టస్వరప్రాధాన్యబుద్ధి నశించుటచే ఆభేద మైపోయెను. కాని ప్రాచీనులు శకటరేఫమును విలక్షణముగ నుచ్చరించి రచనలలో వందలును సుముఖులే. కాని 'అన్నకార'మన నక్కఱలేదు. ఈ శకటరేఫము వైదికమై యుండును; ఋ, ౠ వర్ణములు సవర్ణము లగుటకు హేతువేమి? ఈ సంయోగ 'ఋ+ౠ' రూపపరిణతికి శకటరేఫధ్వన్యాకృతు లాంధ్రమున నిలిచియుండవచ్చును. ఇట్టి కంపస్వరములు వేద సంప్రదాయము. సంప్రదాయైకవేద్యములగునవే యంతరించిపోవుట సహజము. ఋ, ౠ వర్ణముల యుచ్చారణము, యోజనము వేదమువాటినుండి నేటిదనుక వనిశ్చితముగనే యున్నది. రి, లి-గను, రు, లు-గను, రృ, లృ గను నుచ్చరించుటయును గలదు. వాని యుచ్చారణమునకే కంపనమనియు, వికంపనమనియు పేరులు గలవు. కావుననే ఋషి-రుసి, ఋక్షం-రిక్క, పృథివి-పుడమి మొదలగు తద్భవములు వచ్చెను. వీని నాధారము చేసికొని వచ్చిన 'యరలవ'లును వింతగనే యున్నవి. కావున యరలవలలోని 'ర, ల' వర్ణముల విలక్షణధ్వనులే 'ఱ, ళ' లని నిర్ణయించుట న్యాయ్యము. ఈ శకటరేఫము భిన్నభిన్నముగ బలుకుటచే, డ్రి, ట్రి, ల్రి, ఱ-గ ననుకొని యోజక లిపిని వాడియుందురు. కావుననే యా వింతవర్ణము లన్నియు ర, ఱ, ల, ళ, డ, ట ల పరిణామమునకు కారకములైనవి. క్రావడికి బదులు శకటరేఫమే యుంచుటవలన శకటరేఫ గురుప్రయత్నసాఫల్యము బోధపడగలదు. ఈ వాద మిట్లుండ నిండు. ఆ అన్నకారము ద్రావిడమున నుండుటకు కారణమేమి? మూలద్రావిడమునం దుండెనందురా! అట్లుండుటకు కారణమేమి? అని శ్రీ రామకృష్ణయ్యగారు ప్రాకృతమునం దాయా వర్ణము లుండుటకు కారణమేమని యడిగినట్లు నేనును నడిగెదను. ఈ చక్రికాదోషభ్రమణమును విడిచి తత్త్వమును గ్రహింతము.

'చిఱు' అనగా చిన్నది యని యర్థము. ఈ పదము వైదికధాతువునుండి వచ్చెను. 'జ్యా' అను ధాతువునుండి వచ్చెను. ఋకారాంతధాతువులనుండి వచ్చు తెనుగుపదములు సాధారణముగ శకటరేఫాంతములై నకారాంతములు నగును. చిఱుఁగు—చినుఁగు ఇట్టివే. చిఱుఁగుపదమునందలి శకటరేఫము పోయి సాధురేఫముగా ('చిరుఁగు')మారెను. కాని 'చినుఁగు' పదమునం దనునాసికవర్ణముమాత్ర మట్లే యున్నది. చిఱు+అగు=చిఱుఁగు అని యయ్యెను. చిఱునవ్వు, చిఱుత మొదలగునవి వచ్చెను. చిఱు+అ=చిన్న+ది=చిన్నది అని యయ్యెను. ఈ చిఱుశబ్దములోని శకటరేఫము న్ఱ, న్డ్రి, న్ట్రి, న్ల్రి-గ బలుకబడియుండుటవలననే భిన్నభిన్నరూపము లేర్పడినవి. చిదుకు, చిలుప, చిలిపి, చిటుకు మున్నగు పదములు వచ్చెను. ఈ పరిణామముననే చిట్టెలుక, చిట్టాముదము, చిట్టీత సంభవించెను. కాని వ్యాకరణమర్యాద తెలిసినకొలది సంస్కరించుకొనుచువచ్చిరి. మూర్ధన్యాక్షరపూర్వానునాసికముగూడ మూర్ధన్యజాతీయమగుట యుచితమని 'ను' 'ణు' గ మార్చుకొనిరి. ఇక నా వింతయక్షరమెట్లుచ్చరింపబడెనని చెప్పుటకు ద్రావిడసంప్రదాయమును శరణ మన నక్కఱలేదు. కొన్నియక్షరములు సానునాసికములుగ నుంట వైదికసంప్రదాయము. వేదమునందు, నితరమునందును రేఫాంతములగు మూలములనుండి పదజాలమెల్ల నొక్కవిధముననే కరణ, చరణ, కీర్ణ, పూర్ణ, తీర్ణ ఇత్యాదులు గలవు. కావున సానునాసికముగ గొన్ని యక్షరము లుచ్చరించియుండవచ్చును. ఇక 'వాఁడు' శబ్దక్రమమును గనుగొందము. 'వాన్ఱు' అని పెక్కు పూర్వశాసనములలో జిక్కుబడుటయు, దంత్యనకారయుక్తముగ మూర్ధన్యడకారసదృశశకటరేఫవర్ణ ముపయోగించుటయు జూడ నల్ల వింతయక్షరము అన్నకార మని యందురు.

## వాఁడు

ఈ శబ్దము వాఙ్మయంబున మత్వర్థమునను, సర్వనామ తత్ శబ్దార్థమునను వాడబడుచున్నది. మఱియు శతృప్రత్యయార్థమునను వాడబడెను. కలిమివాఁడు=కలుగువాఁడు, వాఁడు=సః, వచ్చువాఁడు=వచ్చుచు అని కలదు. ఇన్నింటికి కనుకూలముగ వేదమున మత్-వత్-వన్ అను ప్రత్యయములు గలవు. ఈ ప్రత్యయములు నొకప్పుడు పగములే యని విజ్ఞ తెలుగు

దురు. కావున తద్వాన్, తావాన్ అనునవి 'వాఁడు'గ మాఱియుండవచ్చును. ఉత్తరభాషలయందును 'వహ' అని కలదు. 'వాలా' అనికూడ నందురు. అట్టి యర్థమునసే 'వాఁడు' శబ్దము తెనుగున వాడబడుచున్నది. వైదికభాషలోఁగల తస్కరశబ్దమును విచారింపుడు. "దానిని చేయువా" డని యర్థము. కావున 'తద్' శబ్దమునకు సరిగ 'ఆ' అని యర్థము. అల్ల-ఉల్ల అని నిర్దిష్టానిర్దిష్టభావద్యోతకముగ 'తత్' వాడబడెను. కావునసే పుంలింగప్రథమైకవచనము 'సః'గ మాఱెను. అది నిర్దిష్టమై యాత్మార్థమగునెడ 'స్వ' అని మఱియు స్వశబ్దములో గూఢముగ 'తద్వత్' ధ్వనించుచున్నది. అదియే 'వాఁడు' పదమునకు మూలము. తచ్ఛబ్దము వేదాతిప్రాచీనకాలమున 'ఆ' అను నర్థమునసే వాడబడిన దగుటచే ననిర్వచనీయార్థమునం దీశబ్దము వాడబడుటయు నాచారమయ్యెను. తద్వర్ణనావిశిష్టభవనవ్యాపారవాన్ = సః అని శాబ్దిని జెప్పవలయును. "అత్యంతాసత్యపి హ్యర్థే జ్ఞానం శబ్దః కరోతి హి" అనెడు న్యాయమున 'తత్' శబ్దమును నిర్వచింపవలసి వచ్చును. విశిష్టార్థమునే సర్వనామములకు లక్షణమని శాబ్దికుల తాత్పర్యము. లక్ష్యమాణము నుపలక్ష్యమాణము నర్థవత్త్వమగును. వక్తృతాత్పర్య మెంతయో ఘనీభవించి శబ్దరూపమున ఖ్యాతిఁగనును. కావున గొన్ని శబ్దము లేకదేశోపలక్షితములై సత్త్వములు ద్రవ్యములుగ నామవంతము లగును. కావున 'వాన్' అనుదాని నవధరించి 'ఉ' అను వైదికనిపాతమునుగూర్చి 'వాను' రూపము రాగా లింగాశ్రితముగ నాంధ్రమున నున్న డుప్రత్యయము చేరి వాన్డు, వాణ్డు, వాండు, వాఁడులుగ మాఱియుండెను. డువర్ణము నకారపూర్వకముగ నుచ్చరింపబడుటచే శ్రోతృలేఖకులు భ్రమప్రమాదములకు లోనై యెట్లో వ్రాసియుండవచ్చును. కాక సమానధ్వనిబోధకభిన్నాక్షరమును వ్రాసి యుండ నోపును.

తత్ప్రత్యయము సానునాసికముగ బరిణమించుట కలదు కావున వచన్, వచన్తా ఇత్యాదికముగ నునికి తెనుగున పుంలింగ 'ఁడు'వర్ణముగ మాఱెను. చత్ + సు = చన్ (వైదికము) సు = స్, సో, ఓ, ఇత్యాదు లార్యభాషాసాధారణములు. స్ = ః, ర్ ఇత్యాదులు శాబ్దికములు. వాన్ + ఉ, ర్ + ఉ-గ మాఱి 'వాన్రు-వాండు' కావచ్చును. ర, శ, డ-ల యభేద మంద తెలిసిన విషయమే. ఇక 'డు' ప్రత్యయస్వరూపము నిర్వచింపబడినట్లే. కావునసే సనాతనముగ పచన్ = వంటవాఁడు అని యర్థమును చెప్పుకొనుచున్నాము. సత్యమగు నర్థము 'వంట చేయుచు' అని యగునుగదా? ఆంధ్రసంప్రదాయము గాదు. శతృప్రత్యయసహితరుప్రత్యయసాహిత్యమున 'ఁడు' ప్రత్యయ మేర్పడియుండవచ్చును. అట్లగుచో శాసనలేఖన మా రీతి నేల యున్నదని శంకింతురేమో?

## వింతయక్షరము

ఈ వింతలిపి యఱవమున అన్నగర మనియు, అన్నకార మనియు వ్యవహరించుచున్నారు. ఇది పదాంతనకార మందురు. ఏమైనను తెనుగున నత్యంత ప్రాచీనకాలమునందు 'రు' ప్రత్యయము 'సు-ఔ-జస్ = సస్' లకు స్థానీయముగ వచ్చినట్లూహించుటకవకాశము కలదు. ఈ సంప్రదాయమునుబట్టియే 'డు' ప్రత్యయము ప్రథమార్థమున బ్రయుక్తమయ్యెను. లేఖనమందు 'రామున్రు' అని పలుకబడినది 'న్ఱు' అని వ్రాయబడియుండెను. అప్పటి కా ద్రావిడలేఖనము 'న్ఱు'గ బలుకబడిన దగుటను స్వీకరించి దుష్టమని యెఱిగి సంస్కరించుకొన్నవారై యుందురు. యద్వాతద్వలతో సిద్ధాంతముగనా అని యాక్షేపింపరాదు. వేదార్థమును జెప్పునప్పుడు విద్యారణ్యస్వాములంతవారు యద్వాతద్వార్థము నే చెప్పిరి. మద్రాక్షరపూర్వ మాంధ్రవర్ణము లోకరీతిని, నే డింకొక రీతి నున్నవి. ప్రాచీనకారము క్రొత్తది. క్రావడికి బదులుగ శాసనములలో శకటరేఫమే కానవచ్చుటచే నీ రేఫమే మూలమనుట తగునని యందురు. సత్యమైయుండును.

## క్రావడి

చాలకాలమునుండియు దీనిని 'క్రాఁవడి' యనియే యనుచున్నారు. ఇది తప్పని నా యభిప్రాయము. 'వడి' యనగా సాంకేతికలిపి యని యర్థము. 'ముడి' యనగా సాధారణ మని యర్థము. ఈ వడియే వళి యని

వ్యవహారము. "ఆద్యో౽క్షరళిః" అన్న చింతామణి నిగూఢాభిప్రాయము సంస్కృతభాషాసాంప్రదాయిక యతి వళి కాదని. వ్యుత్పత్తిపూర్వకప్రవృత్తికై 'వళి' పదమును వాడెను. లోకమువంతును 'ఒరువడి-వరవడి' అని పృథగక్షరరూపమునకు వాడుక కలదు. ఈ 'వడి' శబ్దము గణితస్వీకృతాక్షరాకృతులకు నామకరణమయ్యెను. వ్యవహారమున యథా న్యాయ్యముగ నున్నది.

ఇక దాని పేరు 'రావడి' యని చెప్పుట యుక్తము. పామరులు గుణింతమాలి 'క' గుణించునప్పుడు 'కావు రావడి స్త్రీ—కా౹ క్రావడి స్త్రీ' అని, క్రమముగ 'క్రావడి' యని వ్యవహరించిరి. కరారావుడి యని యును వ్యవహరింతురు. వ్యావహారికమున-ను, వ లు వినిమయములై భ్రాంతిని గలిగించును. అయినను కొంచె మాలోచించిన వడిముడి భేద మెఱుకపడును. మాలాక్షరభిన్నరూపమై మాలాక్షరస్థానీయమగు నప్పుడా యాకృతి 'వడి' యనియు, సమానముగ నెడ 'ముడి' యనియు బరిభాషితమై యుండెను. ఆముడియే ప్రారంభమున వ్రాయు వాచారమై క్రమముగ రావడి నిలిచెను. అయినను ద్విత్వరేఫము బండిఱాయై నేటికిని నిలిచియున్నది. దీనికి శకటాకారమే మొదట నుండి యుండును. మొదటి శకటాకారము ౨ ఇట్టిదై యుండెను. కావున బండి యని పిలువబడెను. బండి భాండి శబ్దభవ మని విజ్ఞు లెఱుగుదురు. పూర్వ మొక కుండ నుపయోగించెడివారు. ఆకుండయాకారము ఆముడియం దున్నదని సుఖముగ గ్రహింపవచ్చును. ఇది బండిఱా విషయము. ఇక నేటి కాంధ్ర-కాలు, అండలు, కొండలు మొదలగు శబ్దములయందలి 'లు' వర్ణ మెట్లు బహువచనక మయ్యె ననునది సందేహము.

## కాలు

బహువచనమనగా సస్-ప్రత్యాహారమునుబట్టి అస్ అనునదే యని తేలుచున్నది. కార్యరూపమున అః-అః అనుటయే సిద్ధము. ఏకవచనమున ఏకసకారము, బహువచనమున త్రిసకారమును గ్రహించి యుందురు బహుధా ప్రకటించుటయే బహువచన మగుటచే దదర్థమున నేకవచనప్రయుక్తమైన 'రేఫ'మునే ద్విప్రకారముగ బలికిరి. దానిని బండిఱా యని నిర్దేశించిరి. ఆ భావచ్ఛాయలే బహువచనార్థక 'లు' ప్రత్యయమున నున్నవి. సంబుద్ధియందలి స్వరమునకు దూరాద్యర్థము నందు ప్లుత మాపాదించినట్లు 'లు' ప్రత్యయమును వాడిరి. అగుచో 'లు' సాధారణమై లేదే యందురేమో? సాధారణముగ 'లు' ప్రత్యయమునే గ్రహించిరి. ఇది 'ళ్' అనుదాని సంగ్రహరూపము. మూర్ధన్యళకారము ర, ల, ళ-ల యభేదత్వమునందు సహజముగ నున్నది. బహువచనమున వంగాదిభాషలలో 'ర్' అని రేఫము వచ్చుట కలదు. దంత్యనాసికాత్యంతసన్నిహిత మూర్ధన్యవర్ణమగు రేఫము విలక్షణధ్వనితో 'ఱ'గను మఱి యదియే బహువచనార్థమున దంత్యమూర్ధన్యాన్యోన్యప్రాబల్యమున ల, ళ గ మాఱుట యుచ్చారణస్వభావము. పేరులు-పేళ్ళు, వెడలు-వెళ్ళు ఇత్యాదుల సంయోగస్వభావ మరయునది. ఓణ్, మూణ్, ముణ్, ఇత్యాదిరూపముల సాదృశ్యములో ద్రావిడమూల మన రాదు. 'అ'కారము నూతనగా నేల గ్రహించి రనుటకు సమాధానము లేదు. వైదికాంధ్రులు ఒండు, మూండు, ముందు అని యుచ్చరింప నితరులు—ఒణ్ణు, మూణ్ణు లను గ్రహించిరి. తెనుగువారు 'మూర్' అనుదానిని మూడను నర్థములో వాడిరి. సమాసములో 'ము' అని మాఱును. 'మూణ్' అగుచో బిందుసాహిత్యముతో 'ముంగారు' మొదలగు రూపము లుండియుండును. మఱియు 'మూగురు' రూపముగాండేని 'న్' భ్రంశరూపముగాన వచ్చియుండును. లేదు కావున 'మూన్' కాదు. ముయ్యాలు, ముయ్యేడు మున్నగు శబ్దముల యం దానునాసిక్యలేశమైనను ధ్వనింపదు. కావున 'మూణ్' కాదు. 'మూణ్' కాదు కావున 'మూర్' అని వాడింతురా యని యందురేమో? 'మూడు'లో 'డు' ధ్వని యున్నది కావున 'మూర్' అని నా యభిప్రాయము.

# అశ్రుతర్పణము

శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి

హరిహరీ! యెట్టిమాట విననాయె మహాత్ముఁడె పోయె నంచుఁ; జి
చ్చుఁబిడుగైన వార్త యిది చూఁడిన గోడును దీర్ప నింక నె
వ్వరి తరమౌను! సర్వము ప్రపంచము ఘోరవిపత్పరంపరల్
పొరిఁబొరిఁ దాఱుమాఱయి యపూర్వపరిస్థితి బ్రుంగి క్రుంగదో!

అదిగో! మొన్ననె తోఁకచుక్క యని యాయా దేశదేశాల శా
పదలన్ గూర్చెడి వార్త వింటి; మది దౌర్భాగ్యంబుగా మాకె దు
ర్విధి యీరీతిగ నంటఁగట్టెనె! ధరిత్రీమండలం బెల్ల బె
ట్టిదమై యెట్టులు క్రిందుమీఁదగుచుఁ బుష్టిం బాసి పోనున్నదో!

జనసామాన్యము నిన్ను దైవమని యిచ్చన్ మెచ్చి బ్రహ్మాండసా
ధనివానమ్ముల మెట్టినట్లయిరిగాదా గాంధిజీ! యే యుగం
బునఁగానీ నినువంటి వ్యక్తి కలఁడే! పోవయ్య, మా కేల ద
క్కును నీ దివ్యపవిత్రమూర్తి భువిలో ఘోరంబు రూపెత్తఁగా?

లోకులు కాకులే యనుటలో నిజ మున్నది; కానినాఁడు చీ
కాకయి దేశమెల్ల వెటకారముగాఁ బడిపోవుదాస న
జ్ఞాఁకల నాఁగివైచిన మహాత్ముని జంపుకొనంగ బుద్ధి యే
లా కలుగుఱ్! బరాత్పరవిలాసము లిట్టివి యేమొ చెప్పుమా!

బంగరువానవెల్లువలు పాఱి ఫలించి ప్రపంచమంతయున్
గొంగున దాఁచిపెట్టు నదిగో నవభారత మంచు మించి యు
ప్పొంగితిమయ్య! దాని నిజమున్ గుఱుతించెడివేళ నిట్టు ల
య్యెంగద! యోయి పాపపువిధీ! నిను మెత్తురె లోకులిత్తఱిన్ ?

ఈఁటెల దూసి బల్లెముల నేసెడి జాతికిఁ బూలువోసి బా
పోటముగాఁ జెమర్చు హృదయంబున నవ్వులు క్రుమ్మరించు నీ

కేటికి నిట్టి దుర్మరణ మిట్టి పరిస్థితి దాపరించెఁ; ‘గుం
డేటిని వేఁటలాడు మగదేబెలు’ పుట్టిరి పాడుభూమిలో!

తక్కులు లేని సత్యులయి రేపును మాపు పరాయిసేవలోఁ
జిక్కియు స్రుక్కి మిక్కిలియుఁ జేడ్పడి నెవ్వగఁ గూరి సత్త్వముల్
దక్కనీ వింతమానుసుల దారి యెఱింగిన నీవె నేఁడు నల్
దిక్కుల శోకదేవతకు ‘తిన్న’ యొసంగితి వయ్య యక్కటా!

ఈ యుడు కెట్టులారు? మము నేలెడువా రెవరో యటంచు దుః
ఖాయుతనంబులోఁ గుమిలి యల్లడ తల్లడ గొన్న జాతి కా
ప్యాయము గూర్చి యింత మరియాద యొసంగిన గాంధిదేవుఁ డ
య్యో! యిఁక నేఁడి! కష్టముల కోర్చియుఁ బ్రాణము లిచ్చిపోయె నే!

అనుపమరాజకీయనయజ్ఞత నీ కెటు లబ్బె నయ్య! నీ
వనిన సమస్తదేశములయం దొక పెద్దఱికం బదేల క
ల్గెనొ మహనీయ! నీ విమలకీర్తికి దోహదమైన దివ్యవ
ర్తనము తలంప నద్భుతముదంబులు గల్గుచునుండు నిచ్చలున్.

కలుకుమతాభిమాన మెనకంబెనగంగ ననుష్ఠణంబు పా
మరులకుఁ బ్రాణగోడ్డమయి మారణహోమము సేయువేళ నం
దఱికును జెల్మికల్మి సముదంబుగఁ గూర్చెడిదాఁక బుద్ధి యే
మరక చరించినాఁడవుసుమా! యిఁక జీవమె పోయె జాతికిన్.

మతము ప్రభుత్వవైఖరి సమంబుగఁ జూచియు నేర్చికూర్చి య
ద్భుతపరిణామ మిచ్చితివి పో! యిది యెవ్వరు చూపరైరి యీ
క్షితి; నదిగాక, యందును విశిష్టత కెక్కిన దివ్యమూర్తివై
బ్రతికితివయ్య! నిన్నుఁ గను భాగ్యమె భాగ్యము నేఁటివారికిన్.

అవతారంబు సమాప్తమాయెఁ బరమాత్మా! యింక నేరీతి వ
త్తువొ లోకంబున నీయనంతమహిమల్ తోరంబులై మాకు ను
త్సవముల్ కూర్చును; గాని నేఁడు భువిలో దౌర్భాగ్యమే నివ్వటి
ల్లి వివాదంబుల బ్రుంగఁ జేయు; నివి నీ లీలావిశేషంబులా?

భారతయుద్ధ మైనపిదపన్ యదువంశమువోలె నున్న యీ
భారతజాతి భాగ్యపరిపాకము దప్పి జవంబు వోయి నిం
డారఁగ శోకసాగరమునందు మునింగెఁ; గిరీటివంటి యా
వీరుఁడు జవ్హారుం డెటులు విహ్వలభావముతోఁ దపించునో!

నీ దివ్యతబగు జ్యోతి భారతమునందేగాదు—లోకంబులోఁ
బాదుల్ వెట్టని చోటు లేదు—సరిగాఁ బ్రారబ్ధముల్ తీఱి యే
దో దక్కెఁగద యన్న సంబరములో నున్నారమేగాని యి
ట్లాధారం బడి కూలిపోవునని జోస్యంబైన విన్నారమా!

మా మూఁడేండ్ల కుమారుఁడే యడలి, అమ్మా! గాంధితాతయ్యనే
'బాముల్' వేసియుఁ గాల్చెనంట; అనఁగాఁ బ్రాణంబులే పోయిన
ట్లై మాజన్మము శూన్యమాయె నకటా! యావత్ప్రపంచంబురూ
పే మాయెఁగద నీవు కన్పడనిచో; నింకేమి కానున్నదో!

నిన్ను భజించి సర్వధరణీవలయంబు పవిత్రమయ్యె! నీ
యెన్నిక ఖండఖండములకేనియుఁ బ్రాఁకి వెలింగె; నింతగా
మన్ననగొన్న దివ్యగుణమాన్యుఁడు లేఁడని పెద్దసంబరం
బున్నది నేఁటిదాఁక; నదియుఁ దుది కిట్లయిపోయె నక్కటా!

'యేసుఁ' బ్రాణముతీసి శాశ్వతముగా నేజాతి నిర్భాగ్యమై
గాసిం బొందెనో కన్నులార మన మీకాలంబులోఁ జూతు; మా
దోసంబే యిటు లుప్పతిల్లె; నిపు డీ దుఃఖంబుఁ బోకార్ప రా
వే సర్వేశ్వర! కావవే! హృదికి నెంతే శాంతిఁ గావింపవే!



# శోకగీతి

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

తన సర్వస్వము భారత జన-నివిముక్తికి నొసంగి స్వారాజ్యంబున్
మనకు గడియించి యిచ్చిన-ఘనుఁ డయ్యయొ! మనల విడిచి కలిసెన్ దేవున్.

భరతజనయిత్రినోముల ఫలము, సక-లలోకమాన వాశాజ్యోతి శోకజలధి
మగ్న మొనరించి జగముల, మాయమయ్యెఁ;-జీకటులు గ్రమ్మె; లోకము పీకుచెడియె.

దారుణవార్త కర్ణములఁ దాఁకఁగ ధారుణి దద్దరిల్లె; శో
కారుణనేత్రపద్మముల నయ్యయొ! భారతమాత యేడ్చెఁ గ
న్నీరు మహాప్రవాహమయి నిల్వఁగ; నేడ్చెడుఁ బ్రాణికోటి; యే
యూఁత లేక నాయకులు నొక్కట నేడ్చిరి తండ్రికోసమై.

ముసిముసినగవుల బలుతా-పసి యిఁక మన కంటఁబడమి భావించి కటా!
సిసువులను బోలి భూప్రజ-వసివాడఁగ నేడ్చెఁ గరుణభావముతోడన్.

అతని యహింసయు, సత్యము సతతప్రేమామృతంబు, సంయమముఁ, గృపా
మతియును, త్యాగము జగముల నతివిశ్రుతి నిలుచుఁగాత మతిలోకములై!

గాంధిదేవుని యాత్మకుఁ గలుగుఁగాక-సంయములు గాంచు శాంతియు, సౌఖ్యగరిమ,
మతని దేహము నశియించినంతమాత్ర-నతని యాదర్శము నశింప కలదుఁగాత!



# స్వప్నవాసవదత్త

(ఏకాంక రూపిక)

— శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి —

ఉపక్రమణిక

(గీతం)

ఉదయన వాసవ-
మృదుల ప్రణయగాథా
ఎద మరందతుందిలబిందుల
విదళించెడినిగదా—
వత్సరాజ జీవితవల్లకిలో
వాసవకుమారి తీయని పాటగ రా—
విధి కదలించిన విషాదరుతిలో
వీణకు చీకటిపాటో యీ! ఉ!
ప్రభాతవేళా శుభాగమనమూ
'వాసవ' ముఖాన 'పద్మిని' హృదిలో
పదిలపరచునో యీ—
ఉదయన రాగోత్సవము! ఉ!

౧ దృశ్యం

(ప్రభాతం. ఉషస్సుందర కాంతులు మగధ రాజధానిమీద వ్యాపిస్తున్నాయి. రాజభవనానికి దగ్గర ఉద్యానవం. రాజకుమారి పద్మావతి, ఆమెవెంట చెలులు—అవంతి, మదనిక. ఉద్యానపరిమళాలలో ఉత్సాహంగా పాడుతూ పద్మావతి...)

పద్మా—

(గీతం)

కనులువిప్పవే శేఫాలీ! నవమల్లీ!
కలకలలాడవె విరజాజీ! చామంతీ!
ఎసగు మంచి సన్నని జలితెమల
ముసుగు లొత్తిగిల మునిముని నవ్వుచు!క!
పొడుపుకొండపై వడివడిగా—
అందపుబడుగుల చిందులలో—
ఉదయనాట్యమున ఉషఃకుమారిక
విసరిన చెరగుల పసిడికాంతిలో
కనుల విప్పవే శేఫాలీ! నవమల్లీ!
కలకలలాడవె చామంతీ— విరజాజీ!

(నాట్యంతో పూలు అందుకుంటుంది)

అవంతి—(నవ్వుతూ మదనికతో) మదనా, ఏమి టీ వేళ ఉషఃకన్యముఖంలో ఎన్నడూ చూడని నూతనోత్సాహం, వింతకాంతి కనబడుతున్నాయి!

మదన—సరిగ్గా కనిపెట్టావమ్మా అవంతీ — ఆ మెలేతహృదయం ఏ ఇనసందర్శనంకోసమో ఉప్పొంగుతూ ఆనందనృత్యం చేస్తూన్నట్టు లేదూ?

పద్మావతి—(ప్రణయకోపంతో) చాలించండి పాండిత్యాలు—

మదన—నా కో పాటొచ్చు.

అవంతి—కొత్తదా? పాతదా?

మదన—ఇక పాతపాటలు వెళ్లాయి.. ఇది సరికొత్తది.

అవంతి—ఏది?

మదన—

(గీతం)

పూలనెచ్చెలు లంత పొంచిచూశారు
కాసారపద్మమ్మ గడుసుపోకడలు—
మనసు విప్పదుగాని మా పూలరాణి
ఉదయనభానునకు హృదయ మిచ్చింది.

పద్మ—(నవ్వు అణచుకున్న కోపంతో) పోవే మదనా! నీకు మరీ ఆగడంగా ఉంది—

మీ రుండండి. నే వెళ్లిపోతా నిక్కడినుంచి..

మదన—అమ్మా, మీ వివాహకథ విన్నప్పటి నుంచి ఎంత దాచినా మన అవంతిముఖం వింతగా మారడం... మీరు కనిపెట్టలేదూ?

పద్మ—నాకూ వింతగానే కనబడ్డదిగాని... ఆమె స్వచ్ఛహృదయంలో ఏట్టి కల్మషమూ ఉండదని నా నమ్మకం, మదనా!

కుంజ—అమ్మా, ఎన్నాళ్ళనుంచో మిమ్మల్ని అడగాలనుకుంటాం. మరచిపోతాం. ఈమె ఎవరో, మీదగ్గరకు ఎట్లా వచ్చిందో ఎప్పుడూ చెప్పారు కారు.

పద్మ—అది ఒక చిత్రకథ. ఒకసారి మగధారణ్యంలోని మహర్షుల దర్శనం చెయ్యడానికి అమ్మగారు వెళుతూంటేగా వెంట నేనూ వెళ్ళాను. ముని దర్శనం చేసి తిరిగివస్తూ మునీశ్వరులకు ఏమి కావలసినా నేను సమర్పించదలిచానని కంచుకిని గట్టిగా చెప్పమన్నాను.

కుంజరి—సర్వం విడిచి ఆశ్రమాల్లో ఉన్న మునులకు ఏమి కావలసివుంటుందమ్మా, మీ భక్తికొద్దీ అన్నారుగాని—

పద్మ—ఔనా...అదే వింత. చటుక్కున ఒక కాషాయధారి ముందుకు వచ్చి ఈ కోరిక చెప్పాడు. ఈ అవంతిక తన చెల్లెలనీ, ఒక వ్రతంలో ఉండి పరపురుషులను చూడదనీ, భర్త దూరదేశంలో ఉన్నాడనీ, కొన్నాళ్లు మీదగ్గర కాపాడమనీ, కష్టాలు తీరిన తర్వాత చెల్లెలిని తీసుకువెళతాననీ చెప్పి ఈమెను నాకు ఒప్పగించి వెళ్ళాడు. నాటినుంచీ ఈమెమీద నాకు సోదరీప్రేమ—ఇదీ అవంతికథ.

మదన—అర్థంకాని పద్యంలా చాలా వింతగా ఉంది తల్లీ!

కుంజరిక—(రాజభవనంలోని మంగళసంగీతం విని) అదిగో మంగళవాద్యాలు మోగుతున్నాయి. నేను వచ్చి చాలాసేపయింది. అమ్మగారికి ఏమిపని ఉంటుందో...

పద్మ—త్వరగా పదండి.

## ౨ దృశ్యం

(మగధరాజభవనంలో ఒక భాగం. ప్రవేశం ఉదయనరాజు. పరధ్యానంగా మాటిమాటికీ రంగులు మారే పడమటి ఆకాశం వైపు చూస్తూ...)

జరిపినారీను కల్యాణ సాహసమ్ము;
నైన లావణ్యకాంతి హావ్యాయికోక్త
అమ్మహాసేనపుత్రి నీహారసంగ
దీన పద్మినిపోలె జ్ఞప్తికి వచ్చు.

(ప్రవేశం: ఇష్టసఖుడు వసంతకుడు)

వసంతకుడు—ఉదయనప్రభూ! ఏమి కల్యాణోత్సవం! ఏమి ఆనంద కోలాహలం! ఈ నుపలి ముత్తెముసరలూ — పదుమరాసీలూ ... అలంకరణలతో, ఆటలతో, పాటలతో మీకు ఊపిరాడనివ్వలేదుగదూ—

మగధప్రభువు చేసిన విందులతో—మన్ననలతో మాకు గుక్క తిరగలేదు. ఒక్కసారి మీదగ్గర కూర్చుని స్వేచ్ఛగా మాట్లాడుకున్నామంటే తెరిపిలేదండి! ఎట్లాగో ఇప్పటికి తీరికచేసుకుని పరుగెత్తుకు వచ్చాను.

ఉదయ—(అశ్రద్ధగా) ఏమిటి వసూ అంటావు?

వసం—(విసుగ్గా) నే నింతసేపు వాగింది వ్యర్థమేనా? సరే...పోనివ్వండి. నే నొక్కటి అడుగుతాను. చెబుతారా? చెప్పరా?

ఉదయ—(గంభీరంగా నవ్వుతూ) ఒకటేమిటి? నీ నోటికి తోచినన్ని...వంద.

వసం—పరిహాసానికి కాదు. నిజంగా అడుగుతున్నాను.

ఉద—కానీ. నాదగ్గర నీకు సంకోచమేమిటి?

వసంత—అయితే, పద్మావతి మీకు నచ్చారా? లేదా?

ఉదయ—(కలవరపడి నవ్వి) ఎప్పుడడిగినా బాణంతో కొట్టినట్టే అడుగుతావోయ్ ప్రశ్న—ఏమీ చాటూ మాటూ ఉండదు.

వసంత—మీ మనస్సుకు విశ్రాంతిస్థానమంటి నాదగ్గర చాటెందుకు మహారాజా!

ఉదయ—(సెమ్మదిగా) ప్రౌఢం చిగుర్చుతుం దంటావా? వసూ!.........

వసంత—అది ప్రౌఢుకాదు మహారాజా! శిశిరకాలమూర్ఛితమైన సరసరసాలం—వసంతలక్ష్మి అమృతహాసం సోకగానే చివ్వున చిగురులెత్తుతుంది.

ఉదయ—(నిస్పృహగా) ఏమో, ఇది రసాలం అవునో కాదో తెలియదుగాని...పద్మాదేవి మాత్రం నువ్వన్నట్టు మధుశ్రీయేసుమా—

వసంత—సందేహమా ప్రభూ! వాసవదేవి సౌందర్యరీతి, సౌజన్యరేఖా శ్రీ పద్మాదేవిముఖంలో తొలినాడే చూచాను. సతీదేవి పార్వతీదేవిగా వచ్చి ఈ రాజశేఖరపాణిగ్రహణం చేసిందనే మా అందరి సంతోషమూను.

ఉదయ—(బరువుగా నిట్టూర్పువిడిచి) అయ్యో ...వాసవదేవి......

వసూ! వాసవ సౌందర్య స్వభావరేఖలు ఇంకా మీ హృదయాలమీదనుంచి తుడుచుకుపోలేదూ.... మరచిపోండి...మీరంతా మరచిపోండి. ఆమె క్రూరమైన జ్ఞాపకాల బాధతో కుమిలిపొమ్మని నా కొక్కడికే వరమిచ్చి వెళ్ళిపోయింది.

ఏదో యాత్రాక్రమంలో ఆమె ఈ పుడమికి పొరపాటున దిగివచ్చిన సౌందర్యాధిదేవత. మళ్ళా... హఠాత్తుగా తా నెవరో జ్ఞాపకంవచ్చి లావణ్యకాగ్ని ద్వారా తన స్వర్గవీథి చేరుకుంది.

ఇంకెక్కడి వాసవదేవి మిత్రమా!
నా డవంతికలో స్వజనమును విడచి
ప్రణయభరమున నావెంట వచ్చునపుడు
బంధువుల సెంచి నాగుండెపైని వ్రాలి
తరుణి రాల్చిన కన్నీరు మరువలేను.

వసంత—(నొచ్చుకుంటూ) వద్దు ప్రభూ, కంట నీరు పెట్టకండి. ప్రసంగవశంలో మీ మనస్సుమీది గాయం కదిపాను, క్షమించండి.

ఉదయ—దానికేమి గాని...పద్మాదేవి శీతల కరపల్లవస్పర్శతో నా మనస్సు కొంచెం ఊరటచెందిన మాట మాత్రం సత్యం సుమా వసూ!

వసంత—అన్నట్టు చెప్ప మరచాను. ఇందాకా కుంజరిక వచ్చి చెప్పింది.

శ్రీ పద్మాదేవి కొంచెం అనారోగ్యంగా ఉండి సముద్రగృహంలో విశ్రమిస్తున్నారట. ఒకసారి తమ దర్శనం కోరినారని...

ఉదయ—అయ్యో! పద్మాదేవికి అస్వస్థతా?

వసంత—ఏమీ పెద్దదై ఉండదు. ఈ కల్యాణ కోలాహలంలో చెలులు ఆమెను సరిగా విశ్రమించ నిచ్చారా! అందుచేత కొంచెం బడలిక అయిఉంటుంది.

అదిగో...ఆ దక్షిణంగా కనబడేదే సముద్రగృహం...మిక్కిలి చల్లగా ఉండడంవల్ల దాని నట్లా అంటారట. ఒకసారి మనం...

ఉదయ—ఓ......అవశ్యం, పద. పద్మాదేవిని చూచి వద్దాము.

* * *

(ఇద్దరూ సముద్రగృహంఎదుట...చీకటి పడుతున్నది)

వసంత—మహారాజా! ఇదే సముద్రగృహం... ఇంకా ఇక్కడ దీపం పెట్టలేదు గాబోలు...ఏమిది పరిజనుల అశ్రద్ధ...బహుశః శ్రీ పద్మాదేవి తలపోటువల్ల దీపదర్శనం పరిహరించి ఉంటారు.

అదిగో తెల్లగా వెన్నెలపొరలాగు పరచిన పాన్పు కనబడుతున్నది.

(ఉదయనుడు లోనికి ప్రవేశించి...)

ఏమిది? వసూ, ఈ పాన్పుపై ఎవరూ లేరే!

వసంత—ఎటో వెళ్ళి ఉంటారు. అలసినట్టున్నారు. దయచేసి కొంతసేపు ఇక్కడ విశ్రమించండి. రెండుగడియలలో వచ్చి కలుసుకుంటాను.

ఉదయ—మంచిది. చప్పున రా!

వసంత—చిత్తం. (నిష్క్రమణం)

(సముద్ర గృహానికి ఇంకొక ప్రక్క. అవంతి, కుంజరిక)

కుంజరి—అమ్మా, అవంతీ! మీ కోసమే... రాజకుమారి కొంచెం నలతగా ఉన్నారు. మీరు దగ్గర

ఉంటే ఉత్సాహంగా ఉంటుందని మహారాణిగారు మీకోసం వెళ్ళమన్నారు.

అవంతి—అహా, అట్లనా? అయితే పద్మమ్మ గారు ఎక్కడ ఉన్నారు?

కుంజరి—సముద్రగృహంలో.

అవంతి—సరే. నువ్వు వెళ్ళు. (కొంచెం ముందుకువెళ్ళి) సముద్రగృహంలో దీపం లేదేమి! బాగుంది పరిజనుల బద్ధకం—(పాన్పు దగ్గరకు వచ్చి) అమ్మా, రాజకుమారీ...వంట్లో ఎట్లా ఉందీ! నిద్రా? దూరంగా కూర్చుంటే కోపం వస్తుంది. పోనీ, దగ్గరగా పాన్పుమీదే కూర్చుంటాను. (పాన్పుపై పండుకున్న ఉదయనుని శరీరం నిమురుతుంది.)

ఉదయ—(గాఢనిద్రలో కలవరింతగా కదిలి) హా ప్రియా! వాసవా! వెళ్ళకు, వెళ్ళకు...

అవంతి—(హడలిపడి పాన్పునుంచి దూకి) ఏమిది! ప్రాణేశ్వరులు...ఉదయన ప్రభువు!! ఏమిటీ సంఘటనం? నేను నిద్రపోవటం లేదుగదా...చిరకాలానికి నా పెన్నిధి నాకు కనపడ్డదనే తన్మయత... ఎవరైనా చూచి దుశ్శీల అని నిందపరుస్తారనే భయం. యౌగంధరాయణమంత్రి పన్నిన వ్యూహమంతా తలకిందులౌతుందనే కలవరం. ఇట్లాంటి భావపరంపరలతో...నా హృదయం బద్దలౌతున్నది. అబ్బ! ఈ వియోగవిధురమూర్తిని చూస్తూ...ఎట్లా భరించను?

ఉదయ—(నిద్రలో) హా ప్రియా! అవంతి రాజపుత్రీ!

అవంతి—ఓహో! ప్రభువు నిద్రలో ఉన్నారు. భయంలేదు. కన్నులున్నందుకు ఫలంగా ఈ ప్రేమమూర్తిని ఇంకొక్కసారి చూచిపోదునా?

ఉదయ—ప్రియా!...ఈ విరహవిపన్నునిమీద కోపగించావా?

అవంతి—ఎంత అపచారం ప్రాణపతీ! నిద్రలోగూడా ఈ అభాగ్యరాశిని మరువలేని మీ ఉన్నత ప్రేమకు నమస్కరిస్తూ దుఃఖపడుతున్నాను.

ఉదయ—నామీద...నీకు......కోపమే లేకపోతే నీ సుందరదేహవల్లిని అలంకరించుకోలేదేమి... ప్రియతమా!

అవంతి—మీ అనురాగానికి ఇంతగా పాత్రమైన నా కింకా అలంకారాలు కావలెనా ప్రభూ?

ఉదయ—ప్రణయదేవీ!...మాటలురాని సువర్ణవిగ్రహంలా నీవు ఊరుకుంటే నేను భరించలేను. అవంతీనగరరాజసౌధంలోవలె...నవ్వుతూ నాట్యం చేస్తూ...పాడుతూ...పరుగులెత్తుతూ...నీవే నీవై... నేనే నాకై రావా, ఇక రానే రావా...వాసవా... (చేతులు చాపి ఉద్వృత్తగా లేవబోతాడు)

అవంతి—(పొంగే కన్నీటితో) లోకంలో ఆదర్శకథలుగా చెప్పుకున్న మా ప్రేమను తుదకు కలలో కలవరింత చేశావా హతవిధీ! (తిరిగిచూడకుండా వెళ్లిపోతుంది)

ఉదయ—(మేలుకొని) వాసవా...వాసవా! ఇంతలోనే కనుదాటిపోయావా?

(చట్టున వసంతకుడు ప్రవేశించి)

వసంత—ఏమిటి మహారాజా!

ఉదయ—వసూ, వచ్చావా? ఎంత దురదృష్టవంతుడవోయ్—సమయం దాటివచ్చావు. శుభవార్త...వింటావా?

వసంత—ఏమో! అంతా నాకు అయోమయంగా ఉంది ప్రభూ!

ఉదయ—చూడలేదూ? ఇప్పుడే ఇట్లాగే వెళ్లింది. వాసవదత్త...నా ప్రాణప్రియ...

వసంత—ఇంకెక్కడి దేవి మహారాజా! లావాణకాగ్నికి ఆహుతియై చిరకాలమయింది. నిరంతరధ్యాస వల్ల స్వప్నంలో చూచి ఉంటారు—

ఉదయ—మూర్ఖుడా! ఎంతలో నా భావసౌధాన్ని కూల్చావోయ్!...స్వప్నం అంటావా? నా బ్రతుకంతా ఆమెతో నిండిన ఒక దీర్ఘస్వప్నమై పోతే ఎంత బాగుండును!

ఇంత తియ్యని కథ కలయేని—నాకు
బ్రతుకులో తెలివి యింక రావలదు వలదు—
ఇదియు మానసవిభ్రమమ్మేని నాకు
వదలకుండుత అమృతవిభ్రాంతి సతము.

(ప్రవేశం : ఒక కంచుకి)

కంచుకి—ఉదయనమహారాజా! శ్రీ మగధ ప్రభువులు కొందరు మిత్రులతో చంద్రభవనంలో కూర్చుండి తమ సన్నిధానం కోరుతున్నారు.

ఉదయ—మంచిది...వస్తున్నామని చెప్పు.

కంచుకి—చిత్తం (నిష్క్రమణం)

(వసంతకునితో ఉదయనుడు వెడలాడు)

3 దృశ్యం

(ఉదయం నాలుగుగడియల ప్రొద్దు. మగధ రాజ అంతఃపురంలో సూర్యముఖప్రాసాదం. ఉదయనరాజు ఒక పట్టుదిండ్ల పీఠంమీద కూర్చుని ఆలోచనలో ఉండగా...వసంతకుడు ఒక వీణతో ప్రవేశించి)

వసంత—ప్రభూ! ఈ చిత్రం విన్నారా? మగధరాజభృత్యులు కొందరు వేటకు వెళ్ళగా... నర్మదాతీరంలో ఒక పొదరింటిలో ఈ వీణ దొరికిందట. పదిలంగా రాజభృత్యులు దీన్ని మహారాజులుంగారికీయగా వారు నన్ను పిలిచి వీణాప్రియులైన మీ కిది ఇవ్వమన్నారు. ఎక్కడో చూచినట్టుగనే ఉన్నది...ఈ వీణ (ఎదుట ఉంచుతాడు.)

ఉదయ—(ఆత్రంగా అందుకుని కళ్ళ కద్దుకుని) ఏమి ఆశ్చర్యం! నా మాతృమూర్తి...ఘోషవతి. (వీణతో) అమ్మా! వాసవదేవివలె నువ్వు సైతం నాకు దూరమై నన్ను నిర్జీవమైన మ్రోడును చేశావా? ఆనాడు ఉజ్జయినిలో జగదేకసుందరి వాసవదా, నాకూ నీ దివ్యసాన్నిధ్యంలో చేతులు కలిపి... ఈ వేళ ఆమె నెక్కడో విడచి ఒక్కతెవూ...నన్ను చూడడానికి వచ్చావా? (నమస్కరించి వక్షానికి చేర్చుకొని)

శ్రవణసుఖదాయినీ! మున్ను రాజపుత్రి
ఘనజఘనవక్షోజములను సుఖప్రసుప్త
వై, యిపుడు పక్షిధూళిలో నణగిమణగి
ఎట్లు కాననవసతి వరించినావు?

తల్లీ! ఏదీ నీ అమృతకంఠం?
(శ్రుతిచేసి వాయిస్తూ)

(గీతం)

వాసవ లేని ప్రపంచము మన కేటికి వీణా!
ఆశ లేని ప్రాణికి ఆశాలత నిలిచేతీరో॥ వా॥

నీ హృదిలో...నా మదిలో
నిండిన తీయని ఒక కలగా
కలికి పలికి రొదకలించి
వెడలిపోయె నెచ్చటికో॥ వా॥

(ప్రవేశం : కంచుకి)

కంచుకి—ఉదయన మహారాజా! ఉజ్జయిని నుంచి శ్రీప్రద్యోతనులు పంపినారని రైభ్యుడను కంచుకి తమకోసం ద్వారం దగ్గర వేచివున్నాడు.

ఉదయ—(వీణను ప్రక్కనుంచి ఉలికిపడి) ఉజ్జయిని నుంచా! రైభ్యుడా! ఇంకా వారికి తమ కుమార్తెను అగ్నికి ఆహుతిచేసిన అపరాధిమీద వాత్సల్యం పోలేదన్న మాట—సరే...రమ్మను. శీఘ్రంగా...

అఁ...ఒక్క పనికూడా చెయ్యి. పద్మావతిని ఒకసారి ఇక్కడికి...

కంచుకి—చిత్తం, చిత్తం. (నిష్క్రమణ)

(ప్రవేశం : పద్మావతి)

పద్మా—ప్రభూ! ఉజ్జయినీరాజపరిజనాన్ని చూడడానికి నే నెందుకో తెలియకోలేకుండా ఉన్నాను. వారిని చూడడమంటే నాకేమో సంకోచంగా ఉంటుంది. ఉజ్జయినివారిని ఎవరిని చూచినా వాసవదేవి అక్కగారికి అపచారం చేసినట్టు భావిస్తాను.

ఉదయ—ఆ సంకోచం వద్దు. దేవీ! నీవంటి సుగుణనిధి తిరిగి నాకు లభించినందుకు...ఏ లోకంలో ఉన్నా వాసవ ఆత్మ సంతోషిస్తుందని నా నమ్మకం.

(రైభ్యుడు ప్రవేశించి)
"జయం. మహారాజా!"

ఉదయ—రైభ్యా! వచ్చా ఎన్నాళ్ళకు!... ప్రద్యోతన మహారాజుగారూ, మహారాణికి కుశలమా? ఈ దుర్వార్తకు ఆ వృద్ధదంపతుల హృదయాలు ఎంత దుఃఖిల్లిపోయాయో.. తిరిగి మీ రాజకుమారిని మీరు చూచే...(గొంతుక గద్గదిక...మాటలాడలేడు

రైభ్య—ఉదయన ప్రభూ! విచారించకండి. దుర్విధిసంఘటనకు ఆ రాజదంపతులు మాత్రం ఏమి చెయ్యగలరు? వారు నన్ను పిలిచి ఇట్లా చెప్పారు—"వాసవదత్తకుమారీవత్సరాజు ప్రేమ అసాధారణం. దురదృష్టవశాన అది విఫలమైంది. వెనక వారు కౌశాంబికి వెళ్లినప్పుడు వారి రూపప్రతిమలు ఈ చిత్రపటంలో వ్రాయించి పరిణయోత్సవం జరిపాము. ఈ విప్రయోగదశలో ఈ చిత్రం వత్సరాజుకు కొంత ఊరట కల్పించవచ్చు. నువ్వు దీనిని వెంటనే మగధలో ఉన్న వత్సరాజుకు సమర్పించి రా" అని నన్ను పంపారు. ఇదిగో ఆ చిత్రం.

ఉదయ—(ఆత్రంగా...అందుకొని) ఓహో! ఎన్నాళ్ళకు ఆ వాసవదేవిముఖదర్శనం జరిగింది! (కన్నీరు) ఇంతటి కోమలసుందరముఖాన్ని దుర్మార్గుడు అగ్నిహోత్రుడు ఎట్లా కాల్చి మసిచేశాడో గదా.

పద్మా—మహారాజా! ఏదీ చిత్రం? ఏమిది! ఈమెయేనా వాసవదేవి! సరిగా ఇట్లాంటి ఆమె మాయింట్లో ఉన్నది.

ఉదయ—(వింతగా చూచి) ఏమీ వాసవదత్త కంటిదా? అసంభవం...ఆ లావణ్యనిధికి సాటి ఏ ప్రపంచంలోనూ ఉండదు.

పద్మా—మహారాజా! నామాట నమ్మండి. అక్షరాలా ఈచిత్రంలోని మూర్తి...

ఉదయ—ఒకసారి...పిలిపిస్తే ఇట్లా రప్పించగలవా?

పద్మా—అదే గొప్ప చిక్కు. ఆమె పరపురుషుల కంటపడదు.

(ప్రవేశం: ద్వారపాలకుడు)

ద్వార—రాజకుమారీ! తమవద్ద ఉంచిన తన చెల్లెలిని తీసుకునివెళ్ళడానికట ఒక బ్రాహ్మణుడు వచ్చి ద్వారంవద్ద ఉన్నాడు.

పద్మా—మంచిది. వెంటనే రమ్మను.

(ప్రవేశం: బ్రాహ్మణవేషధారి యౌగంధరాయణుడు)

యౌగంధ—అమ్మా రాజపుత్రీ! మీ మహోపకారానికి కృతజ్ఞుణ్ణి. చాలాకాలమైంది. ఇక మాచెల్లెలిని పంపండి.

పద్మా—ఎవరక్కడ? అన్నగారు వచ్చినారని అవంతితో చెప్పి ఆమెను తెరతో తీసుకొనిరండి.

పరిచారిక—తమ మాట ప్రకారం మన అవంతి వచ్చి ఈ ప్రక్క ఉన్నది.

పద్మా—సరే, బ్రాహ్మణోత్తమా, అదిగో మీ చెల్లెలు...తీసుక వెళ్ళవచ్చు. నేను కూడా వచ్చి వీడ్కోలు పలుకుతాను.

ఉదయ—పద్మావతీ! న్యాసాన్ని తిరిగియిచ్చేటప్పుడు ఒక మధ్యవర్తి ఉండటం యుక్తం. ఈ రైభ్యుని సమక్షంలో ఆమెను అన్నకు సమర్పించు.

పద్మా—మీమాట యుక్తమే. రైభ్యా, తెర తప్పుకపద.

(రైభ్యుడు తెరలోని వాసవదత్తను చూచి)

రైభ్య—ఏమిది! నాకేది కల కాదు కదా.... ఏమి అదృష్టం! ఈమె మా రాజకుమారి వాసవదేవి... బ్రాహ్మణసోదరి కాదు.

యౌగంధ—ఏమిటయ్యా! ఈమె మాచెల్లెలు.. నీకేమైనా ఉన్మాదమా!

ఉదయ—(అలజడిగా) ఏమిటీ వాసవా? ఏదీ ఏదీ! మరణించలేదూ? బ్రతికే ఉన్నదా?

యౌగంధ—ఉదయన ప్రభూ, అన్యాయం తగదు. ఈమె మా చెల్లెలు.

ఉదయ—ఇది వివాదగ్రస్తవిషయమైనది. చూచి మేము నిర్ణయించవలె. తెర తొలగించండి.

(తెరనుంచి బయటికి వస్తూ)

వాసవదత్త—జయం జయం ఆర్యపుత్రునకు. ఈ అవినయం మన్నించండి.

యౌగంధ—(వేషం తీసివేస్తూ) జయం మహారాజులకు. ఈ యౌగంధరాయణుని సాహసం క్షమించండి.

ఉదయ—(ఆశ్చర్యముగా) ఏమిటి మహామంత్రీ ఈ మాయానాటకం ?

యౌగంధ—శ్రీశైలసిద్ధు డొకడు పద్మాదేవి పాణిగ్రహించినవారు చక్రవర్తి అవుతారని చెప్పగా విని, వాసవదేవి జీవించి ఉండగా వేరొక వివాహానికి ఒప్పుకోరని ఎరిగి, మీరు వేటకు వెళ్ళినపుడు ఆమె లావాణకాగ్నిలో మరణించిందని కింవదంతి పుట్టించి, ఈ పద్మాదేవితో మీకు పాణిగ్రహణము నెరవేర్చినాము. ఫలితంగా మగధప్రభువుసాహాయ్యంతో శత్రువు ఆరుణిని హతమార్చి వత్సరాజ్యం సామ్రాజ్యంగా మార్చివేసినాము. తమరు రాణులిద్దరితో... పట్టాభిషిక్తులు కావడానికి ప్రజ ఎదురుచూస్తున్నారు.

ఉదయ—మహామంత్రీ ! మీ గాఢరాజభక్తికి ఎట్లా కృతజ్ఞుణ్ణి కావాలో నాకు తెలియడంలేదు.

పద్మా—అక్కా, వాసవదేవీ ! ఇన్నాళ్ళూ చేసిన అపచారానికి మన్నించమని కోరుతున్నాను.

వాసవ—ఎంత గడుసుదానవమ్మా, పద్మాదేవీ ! నన్ను మహారాణినీ, ప్రాణేశ్వరుని సార్వభౌమునీ చేసిన భాగ్యదేవతవు...మా క్షమ కోరుతున్నావా ? మన కథ ఎంత సుఖస్వప్నంగా పరిణమించిందీ !

మహామంత్రి—శ్రీ ఉదయన సార్వభౌమునకూ జే. జే.

(శ్రీభాసమహాకవికి కృతజ్ఞతావందనములతో)



# ఉపకారం చేయబోతే...

[కథానిక]

— శ్రీ ఈరంకి వెంకటరావు —

విశ్వాసమ్మ రాజేశ్వరితో అంత మరీ ఇదిగా— ఇద్దరూ ఏకమై పోయినట్టుగా తిరుగుతూ ఉంటుందంటే ఎవరో కొత్తవాళ్ళకు ఆశ్చర్యంగా ఉంటుంది గాని, వాళ్ళిద్దరినీ గురించి బాగా తెలిసిన వాళ్ళకు ఏమీ ఆశ్చర్యం ఉండదు. రాజేశ్వరి ఎంత చీదరించుకున్నా, అసహ్యించుకున్నా, ఆమెను వదలి పెట్టకుండా తనను కాదన్నట్లుగా తిరుగుతూ వుండటమే విశ్వాసమ్మ గొప్పదనం. ప్రపంచంలో అనేకరకాల మనుషులుంటారు గాని, విశ్వాసమ్మలాటిది ఉండటం చాలా అరుదు.

విశ్వాసమ్మకు రాజేశ్వరితో స్నేహం—స్నేహమనటానికి నాకు ప్రాణం ఒప్పటం లేదు...పరిచయం—యీ నాలుగేళ్ళల్లోనూ యింతగా వృద్ధి అయిపోయి యీనాడు రాజేశ్వరి విశ్వాసమ్మ చేతిలో ఒక పనిముట్టుగా అయిపోయిందంటే కలిగే ఆశ్చర్యం కన్నా, అసలు మొదట్లో రాజేశ్వరిని విశ్వాసమ్మ లోబరచుకొని యీ నాటికి యీ వరకు ఎట్లా తేగలిగిందా అనేది మరీ ఆశ్చర్యంగా వుంటుంది.

నాలుగేళ్ళ క్రితం రాజేశ్వరి ఏలూరునుంచి మద్రాసు వెళ్ళింది ఇంటర్మీడియేటు తరగతిలో చదవటానికి. మద్రాసులోనే వుంటున్న విశ్వాసమ్మ కూడా అదే కాలేజీలో, అదే క్లాసులో చదువుతూ వుండటం మూలాన్ని మొట్టమొదటిసారి ఇద్దరికీ ముఖపరిచయం ఐంది. రానురాను ఆ పరిచయమే దృఢపడింది. ఒకసారి రాజేశ్వరికి టైఫాయిడ్ జ్వరం వస్తే విశ్వాసమ్మ మద్రాసులో హాస్టలులోనే ఒక వారంరోజులు చాలా జాగ్రత్తగా, ఆదరణతో ఆత్మబంధువులకు చేసినట్టుగా చాకిరి చేసింది. ఆతరువాత రాజేశ్వరితండ్రి వచ్చి ఆమెను ఏలూరు తీసుకెళ్ళిపోయాడు.

విశ్వాసమ్మ క్రైస్తవకులస్థురాలు. క్రైస్తవ మతస్థురాలు అని చెప్పలేం. ఆమెకు క్రైస్తవ మతముకంటే హిందూమతమంటేనే ఆదరణాభిమానాలు చాలా హెచ్చు. లోలోపల ఆమె రాముణ్ణీ, కృష్ణుణ్ణే ధ్యానిస్తూ వుండేది. అసలు విశ్వాసమ్మకుటుంబంవారు రెండు తరాల క్రిందట బ్రాహ్మలేనట. విశ్వాసమ్మకు తల్లీ, తండ్రీ ఎవరూ లేరు. చిన్నప్పుడే పెళ్ళి అయిన భర్తకూడా పోయాడు. బాగా చదువుకుని స్వతంత్రంగా జీవిద్దామనే ఉద్దేశంతో చదువుతోంది.

మద్రాసులో విశ్వాసమ్మకు వాళ్ళన్నయ్య, వదినాతప్ప మరెవరూ లేరు. వాళ్ళన్నయ్య తెచ్చే నూరు రూపాయల జీతంతోనే ముగ్గురూ జీవయాత్ర చేస్తున్నారు. విశ్వాసమ్మకు స్కాలరుషిప్పు లున్నాయి గాబట్టి ఆమెపోషణభారం తప్ప, విద్యాభారం ఏమీ ఎక్కువగా పడదు వాళ్ళన్నయ్యమీద. విశ్వాసమ్మ వదినగారైన సుభద్రాదేవికి ఆమె చదువుకోటం గాని, వాళ్ళయింట్లో వుండటంగాని ఇష్టం లేదు. ఎప్పుడూ ఏదో కాకిమాటా, కిల్లిమాటా పెట్టి విశ్వాసమ్మను తిడుతూనే వుండేది. అయినా విశ్వాసమ్మ అభిమానం చంపుకుని, వేరు గతిలేక ఆతిట్లు తింటూ, ఆ యింట్లో అవస్థలు పడుతూ అలాగే వుండేది. వాళ్ళ

న్నయ్య చెల్లెలిబాధలు చూసి తనూ బాధ పడేవాడే గాని భార్య నేమీ అనలేక పోయేవాడు.

రాజేశ్వరి టైఫాయిడ్ జ్వరం తగ్గిన తర్వాత మరో మూడువారాలు ఏలూరులోనే వుండిపోయింది విశ్రాంతి తీసుకుంటూ. ఈలోగా మైకల్‌మస్ శెలవలు రావటంవల్ల ఆమె అట్టే రోజులు శెలవు పెట్టవలసవసరం లేకపోయింది. రాజేశ్వరి ఏలూరులో వున్నన్నాళ్ళూ విశ్వాసానికి ఉత్తరాలు వ్రాస్తూనే వుండేది. రాజేశ్వరికి తనకు జబ్బుచేసిన ఆ వారంరోజులలోనూ ఎడం చెయ్యి, కుడి చెయ్యి అనుకోకుండా విశ్వాసమ్మ చేసిన సపర్యలవల్ల ఆమె అంటే మంచి విశ్వాసం ఏర్పడింది.

రాజేశ్వరితండ్రి కామేశ్వరశర్మ ఏలూరులో ఉన్న గొప్ప డాక్టరులలో ఒకడు. ఆయనకు మంచి పలుకుబడీ, పేరూ వున్నాయి. ఆయన చాలా డబ్బు నిలవకూడా చేశాడు. మంచి అధునికాభిప్రాయాలు గల వ్యక్తి. అతనికి రాజేశ్వరినీ, మరో ఇద్దరు మగ పిల్లలూ మాత్రమే సంతానం. రాజేశ్వరి పుట్టకముందు ఒక మగపిల్లవాడూ, ఆడపిల్లా పుట్టి పోయారు. అందువల్ల కామేశ్వరశర్మకు పెద్దపిల్లయిన రాజేశ్వరి అంటే పంచప్రాణాలు.

శెలవలు అయిపోయిన తర్వాత రాజేశ్వరి పూర్ణారోగ్యంతో మద్రాసు వెళ్ళిపోయింది. ఈసారి రాజేశ్వరికీ, విశ్వాసమ్మకూ సఖ్యతా, సన్నిహితత్వమూ చాలా హెచ్చాయి. రాజేశ్వరి తనకు మద్రాసులో దగ్గిరవాళ్ళని ఎవరినైనా చెప్పవలసివస్తే విశ్వాసమ్మనే చెప్పాలి. విశ్వాసమ్మకు కూడా ఆమెకు ఎవరూ ఇవ్వని గౌరవమర్యాద లిచ్చి మాట్లాడే వ్యక్తి రాజేశ్వరి తప్ప మరెవ్వరూ లేరు.

విశ్వాసమ్మ యింటి పరిస్థితులూ, ఆమెకష్టాలూ అన్నీ తెలుసుకుంది రాజేశ్వరి. అందులోనూ పందొమ్మిది సంవత్సరాల వయస్సునాటికే ఆమెకు తల్లీ, తండ్రీ, భర్తా అందరూ పోయారు. రాజేశ్వరి ఆమెపరిస్థితికి చాలా జాలిపడింది. తనకు తోచిన సహాయం చేసి ఆమెకష్టాల్ని తగ్గించా లని ప్రయత్నం చేసేది. ఆమెకు పుస్తకాలూ, డబ్బూ, బట్టలూ—ఏవి కావలసినా ఇస్తూవుండేది.

మెల్లిమెల్లిగా వారి సఖ్యత, రాజేశ్వరిని అడుగకుండానే విశ్వాసమ్మ తనకు కావలసినవన్నీ తాను స్వతంత్రించి తీసుకొనేవరకూ వచ్చింది. ఒక్కొక్కప్పుడు విశ్వాసం రోజుల తరబడి హాస్టల్లో వుంటూవుండి పోయేవరకూ వచ్చింది. రాజేశ్వరిఆసరా చూసుకుని విశ్వాసమ్మ యింటిదగ్గర వదినగారితో దెబ్బలాడి పంతం కోసం వాళ్ళన్నయ్య వచ్చి బతిమలాడి తీసుకెళ్ళేవరకూ హాస్టల్లోనే వుండిపోయేది. రాజేశ్వరికూడా ఇంటిదగ్గర నుంచి తనకు కావలసినదానికంటే ఎక్కువ డబ్బును తెప్పించి విశ్వాసమ్మ అవసరాలను సర్దుతూ వుండేది. రోజులు గడిచిన కొద్దీ వారిద్దరూ ఒక సంసారంలోని మనుష్యుల్లాగ; ఒక తండ్రిపిల్లలలాగ మెలగజొచ్చారు.

క్రిష్టమసు శెలవలకు రాజేశ్వరీ, విశ్వాసమ్మా ఇద్దరూ విడిపోయి ఉండటానికి చాలా కష్టపడ్డారు. కాని విడిపోయిఉండక తప్పిందిగాదు. రాజేశ్వరి ఇంటికి వెళ్ళినపుడు తన తలిదండ్రులతో విశ్వాసమ్మను గురించి పూర్తిగా చెప్పింది. రాజేశ్వరితండ్రి ఇదివరకొకసారి విశ్వాసమ్మను చూసి ఉండడంవల్లా, ఆమె తనకూతురికి జబ్బులో సహాయం చేసిఉండడంవల్లా ఆమెపరిస్థితులు తెలుసుకుని చాలా జాలిపడ్డాడు. రాజేశ్వరితలిదండ్రులు ఆమెస్నేహితురాల్ని ఒకసారి వేసంగి శెలవలకు ఇంటికి తీసుకురావటానికి అనుమతించారు.

అన్నట్లుగానే రాజేశ్వరి విశ్వాసాన్ని వేసంగి శెలవలకు ఏలూరు తీసుకెళ్ళింది. విశ్వాసమ్మ వాళ్ళింట్లో ఏమీ అరమరిక లేకుండానే మసలుతోంది. అలాగ వుండమనే వాళ్ళింట్లోఅందరూ ఆమెకు చెప్పారు. రాజేశ్వరికి ఆయింట్లో ఎన్ని మర్యాదలు జరుగుతున్నాయో, విశ్వాసమ్మకు కూడా అన్ని మర్యాదలు జరుగుతూండేవి. రాజేశ్వరితోపాటు షికారులకూ, సినీమాలకూ విధిగా వెడుతూండేది. రాజేశ్వరియింట్లో అడుగుపెట్టినదగ్గర్నుంచీ విశ్వాసమ్మ తను మళ్ళీ బ్రాహ్మణ కులంలోకి మారిపోయినట్టు భావించింది. ఆమెను మరోకులస్థురాలుగా వాళ్ళు ఎంచటమూ లేదు.

విశ్వాసమ్మ ఒక నెల్లాళ్ళుండదలచి వచ్చి వేసవి కాలం శెలవలు మూడునెలలూ రాజేశ్వరిఇంటిలోనే వుండిపోయింది. ఆమూడునెలల్లోనూ ఆమె తన భావి జీవితం సాఫీగా నడిచిపోయే గట్టి పునాదులెన్నో వేసుకుంది. తనకు మాటలాడే సావకాశం దొరికినప్పుడల్లా రాజేశ్వరి తల్లితోనూ, తండ్రితోనూ తన కష్టాలనుగురించి చెప్పుకునేది. తన కష్టాలను విని అవతలివాళ్ళు ఏ భావంలో చెపితే జాలిపడతారో, ఏ భావంలో చెబితే కరిగిపోతారో ఆభావంలో చెప్పేది. తనను కూడా రాజేశ్వరితోపాటు ఒకకూతురుగా ఎంచి ఒక్క ఆరు సంవత్సరాలు ఆమెను చదివిస్తే తన కష్టాలు తీరిపోతా యనీ, ఆతర్వాత తనూ ఒక డాక్టరమ్మయి వాళ్ళ సొమ్ము వాళ్ళకు ఎప్పటికయినా సంపాదించి ఇచ్చేస్తా ననీ, అలా చెయ్యలేకపోతే తన చర్మం చెప్పులు కుట్టించైనా ఆ దంపతుల కిస్తా ననీ చెప్పింది.

రాజేశ్వరితలిదండ్రులు విశ్వాసానికి సహాయం చెయ్యటానికి అంగీకరించారు. ఆమె మళ్లీ తమ డబ్బు ఇస్తుందనిగాని, ఇవ్వాలని గాని వాళ్ళకు కోరికగాని, ఆశగాని లేదు. తమ కూతురుస్నేహితురాలికి సహాయం చేసి ఆవిధంగా తమ కూతురికి సంతృప్తి కలిగించడమూ, ఒక అనాథబాలికవిద్యకోసం సహాయం చెయ్యటమే వాళ్ళు ఆలోచించారు.

ఈసారి రాజేశ్వరీ, విశ్వాసమూ అక్కాచెల్లెళ్లులాగా కాలేజీకి వెళ్ళారు. ఇద్దరూ హాస్టల్లో ఒకగదిలోనే వుంటున్నారు. విశ్వాసమ్మ వాళ్ళన్నగారింటికి వెళ్ళి సామాను తెచ్చేసుకుంది. తనకు తన స్నేహితురాలు ఆధారం చూపించి అనాదరించకుండా వున్నన్నాళ్లూ అన్నగారికిగాని, వదినగారికిగాని తనేమీ భారం కలగజెయ్యదలచుకోలే దనీ, ఎప్పుడయితే తనకు పై వాళ్ళ సహాయం దొరకదో అప్పుడు మళ్లీ తను అన్నగారి పంచను చేరతా ననీ చెప్పింది. కొంత కాలమైనా వాళ్ళకు శ్రమ తగ్గించినందుకు వాళ్ళు సంతోషించారు.

విశ్వాసమ్మకు స్థానచలనం ఏనాడైతే కలిగిందో ఆనాడే ఆమెబుద్ధులు మారిపోయా యని చెప్పాలి. పూర్వపు విశ్వాసానికీ ఇప్పటిఆమెకూ ఏమీ పోలిక లేదు. ఆమె ఉన్నతస్థానానికి వెళ్ళే అవకాశాలు వచ్చిన కొద్దీ ఆమెలో నీచపు తలపులు ఎక్కువయాయి. ఆ నీచపు తలపులే ఆమెకు మార్గావరోధాన్ని కలిగించి అధఃపతితను చేశాయి.

రాజేశ్వరితండ్రి రాజేశ్వరికి ఎంత డబ్బు పంపిస్తున్నాడో విశ్వాసానికి కూడా అంత డబ్బు పంపించేవాడు. ఇద్దరికీ ఒకే రోజున పుష్కలంగా డబ్బు వచ్చేది. విశ్వాసమ్మ రాజేశ్వరినీ, వాళ్ళ తలిదండ్రులనూ ఆమె దగ్గరా, మరి యితరుల దగ్గరాకూడా నిరంతరం పొగుడుతూవుండేది. ఆమె ఆ పొగడ్తలతోనే, ఆ మంచి మాటలతోనే రాజేశ్వరిని పూర్తిగా లోబరుచుకోవాలని చూసింది.

ఆమె రాజేశ్వరిని పూర్తిగా లోబరుచుకోవాలనీ, తన చేతుల్లో కీలుబొమ్మగా చేసుకోవాలనీ నిశ్చయించుకోవటానికి తగినంత బలమైన కారణం లేకపోలేదు. రాజేశ్వరికి పెండ్లికానంతకాలం తనతో వుంటుంది. తనంటే పంచప్రాణాలూ అర్పిస్తుంది. కాని, తీరా ఆమెకు పెళ్ళయితే ఆమె తన ప్రేమనంతనూ కొత్తగా వచ్చిన భర్తపై చూపిస్తుంది. అప్పుడు విశ్వాసమ్మంటే రాజేశ్వరి ఇదివర కున్నంతటి అభిమానం చూపకపోవచ్చు. ఆమె కాపురానికి వెళ్ళిపోతే తను విడిపోవలసివస్తుంది. ఎప్పుడైతే తను రాజేశ్వరికి దూరమైపోతుందో అప్పుడు రాజేశ్వరితండ్రి తనకు ధనసహాయం చేసి చదివిస్తా డని నమ్మకం లేదు. అప్పుడు యిలాగ మనియార్డర్లు క్రమప్రకారము కోరినట్టుగా రావు. తనపని అధోగతి అయిపోతుంది. కాబట్టి రాజేశ్వరిని తన పిడికిలిపట్టులోనుంచి దాటనివ్వకూడ దని నిశ్చయించింది.

రోజులు గడుస్తున్నాయి. ఇద్దరు స్నేహితురాళ్ళూ కులాసాగానే రోజులు గడుపుతున్నారు. పరీక్షలకు కలిసి పట్టుదలగానే చదువుతున్నారు. ఇద్దరూ శెలవులకు ఏలూరు వెడుతున్నారు; వస్తున్నారు. కాని, రోజురోజుకూ రాజేశ్వరికి తన వ్యక్తిత్వంలో అనుకోని మార్పులు వస్తున్నాయి. మద్రాసుకు మొట్టమొదట వచ్చిన రోజులలో తనకున్న ధైర్యాన్ని, స్వాతంత్ర్యాన్నీ యిప్పటిరోజులలో వున్న వ్యక్తిత్వంతో పోల్చి చూసుకుంటే తను రోజురోజుకూ చిన్నకిల్ల

అయిపోతున్నట్టుగా అనిపించింది. రాజేశ్వరిభోజనం, చదువు, షికార్లు—చివరకి ఏ బట్ట కట్టుకోవాలో అది కూడా విశ్వాసమ్మ సలహాప్రకారం, అభిరుచిప్రకారం జరుగుతున్నాయి. ఇప్పుడు రాజేశ్వరి తన తండ్రికికూడా తనుగా ఉత్తరం రాయటంలేదు. అపనీ విశ్వాసమే చేస్తోంది.

ఆమెను అడక్కుండాగాని, ఆమె అభిప్రాయానికి భిన్నంగాగాని రాజేశ్వరి ఏమైనా చేస్తే విశ్వాసమ్మ మూతిముడిచేసుకుంటుంది. భోజనం చెయ్యదు. ఇంకా అక్కసు తీరకపోతే రాజేశ్వరి ప్రతిమాలే వరకూ గట్టిగా ఏడిచేది. ఆ ఏడుపుతోడు నిష్ఠూరాలుకూడా జతచేసేది. ఈ మూడు ఆయుధాలతోను విశ్వాసం రాజేశ్వరిని పూర్తిగా లోబరుచుకొంది. రాజేశ్వరి తనకు ఇష్టం లేకపోయినా సరే, ఏ పనైనా విశ్వాసమ్మ విడిచిపోతుందేమో నన్న భయం కొద్దీ చేసేది. సంవత్సరన్నర అయేటప్పటికల్లా రాజేశ్వరి పూర్తిగా తన వ్యక్తిత్వాన్ని కోలుపోయింది.

ఇంటరు పరీక్ష లయిపోయాయి. శెలవల్లో రాజేశ్వరీ, విశ్వాసమూ ఏలూరులో వుండగా రిజల్ట్సు వచ్చాయి. రాజేశ్వరి ప్యాసయింది; విశ్వాసం తప్పిపోయింది. విశ్వాసం రాజేశ్వరిని కౌగిలించుకుని గట్టిగా ఏడ్చింది. ఆ ఏడ్పులో రెండర్థా లున్నాయి: ఒకటి తన పరీక్ష తప్పిపోవడం; రెండోది రాజేశ్వరి ప్యాసవటం. విశ్వాసమ్మ రాజేశ్వరి ఒక్కర్తి దగ్గరే ఏడవలేదు. మనిషి మనిషిదగ్గరా ఏడ్చింది—తన పరీక్ష పోవలసింది కాదనీ, అదృష్టం చాలక పోయిందనీ, ఇక తన జీవితం మరీ దుర్భరమై పోతుం దనీని.

కామేశ్వరశర్మకు యీసారి మనస్సు మరీ ఎక్కువగా కరిగింది. విశ్వాసమ్మజీవితభారం తన మీద వేసుకోదలిచాడు. ఆమెకు ఏ నర్సుఉద్యోగమో తన ఆసుపత్రిలోనే ఇచ్చి ప్రైవేటుగా పరీక్షలకు వెళ్లే సదుపాయం చేదా మని నిశ్చయించుకున్నాడు. తన అభిప్రాయం రాజేశ్వరిద్వారా విశ్వాసమ్మకు తెలియపరిచాడు. విశ్వాసమ్మ వెంటనే ఒప్పుకుంది.

రాజేశ్వరి యం. బి. బి. యస్. చదవటానికి ఏర్పాట్లన్నీ చేసుకుని మద్రాసు బయలుదేరింది. విశ్వాసమ్మ ఆమెతో స్టేషనుకుకూడా వెళ్ళి గట్టిగా ఏడ్చింది. రాజేశ్వరిచదువు మానిపించాలని ఎన్నో ప్రయత్నాలు చేసిందిగాని సాగలేదు. వాళ్ళమ్మతో రాజేశ్వరి చదువు మానిపించేసి లక్షణంగా పెళ్ళిచెయ్యమని చెప్పింది. కాని, కామేశ్వరశర్మ ఆ అభిప్రాయాని కెక్కడా తా వివ్వలేదు. విశ్వాసంపాచిక పారలేదు.

రాజేశ్వరికి మద్రాసులో జీవితం హాయిగా వుంది. ఆమె మళ్ళీ ఎప్పటి వ్యక్తి కాగలిగింది. ఆమెకు విశ్వాసందగ్గరవుంటే బందిఖానాలో వున్నట్లుండేది. ఆమెకు ఇష్టమొచ్చినట్లుగా తను చెయ్యాలి. తన కిష్టమొచ్చినట్లు ఆమె చెయ్యదు. ఆమె చెప్పినట్లు తను చెయ్యకపోతే తనదగ్గర వున్న అహింసాత్మకమైన ఆ మూడు ఆయుధాల్లోనూ ఏదో ఒకటి ప్రయోగించి తన కిష్టమైనట్లుగా చేయించుకుంటుంది. నిజానికి రాజేశ్వరికి హింసాత్మకమైన ఆయుధాలకంటే విశ్వాసం ప్రయోగించే యీ అహింసాత్మక ఆయుధాలే చాలా వాడిగా వున్నట్టనిపించింది.

ఏలూరులో కామేశ్వరశర్మదగ్గర నర్సుగా పనిచేస్తూ ఇంటరు పరీక్షకు చదువుతోంది విశ్వాసం. ఆమె జీతం జీతంలాగ ఖచ్చితంగా పుచ్చుకున్నా రాజేశ్వరిఇంట్లోనే ఆమె బసా, భోజనం. రాజేశ్వరి తల్లిదండ్రులు ఆమెను వేరే బయటికి పొమ్మని చెప్పటానికి జంకారు. వారు చెప్పలేదుగదా అని విశ్వాసం ఆ చిటారు కొమ్మమీద అలాగే కూర్చుంది. కామేశ్వరశర్మకు ఆమె పెంపుడు కూతు రయింది. వాళ్ళింట్లో నౌకర్లను, చాకర్లను మెల్లి మెల్లిగా తనే అదుపాజ్ఞల్లో పెట్టటం చేస్తుంది. ఇంట్లో తను ఏపనీ ముట్టుకునేది కాదు. ఆమెమాటకు ఎవరన్నా ఎదురుతిరిగితే భోజనం మానేసి, ఏడుస్తూ కూర్చునేది. చివరకు అట్లానే సాధిస్తోంది అన్నీ.

విశ్వాసం మరో రెండుసార్లు పరీక్షకు వెళ్ళటమూ, ప్యాసవలేకపోవటమూ జరిగింది. ఆమె ఇక చదువుకు స్వస్తి చెప్పింది. మరో రెండు సంవత్సరాలు కూడా గడిచిపోయాయి. ఈ రెండు సంవత్సరాల్లోనూ ఆమె మహారాణీభోగ మనుభవించింది. ఇంట్లో అన్నీ సక్రమంగా తన ఇష్టానుసారం జరుగుతూవుంటే ఆమె కేంలోటు? అప్పటికీ విశ్వాసం తన కే లోటు జరిగినా ఉత్తరాలద్వారా రాజేశ్వరికి వెంటనే తెలియబరిచేది.

యం. బి. బి. యస్. మూడో సంవత్సరం చదువుతోంది రాజేశ్వరి. శెలవలకు ఇంటికి వెళ్లినప్పుడు తప్ప విశ్వాసాన్ని ఆమె కలుసుకోవటం లేదు. ఇంటికి వెళ్లినప్పుడు మళ్లీ ఆమె తన వ్యక్తిత్వమూ, స్వాతంత్ర్యమూ,

అభిరుచులూ అన్నీ కోల్పోయి విశ్వాసానికి లొంగి పోయేది. ఆ కలతలు కొన్నిన్నిరోజులూ హాయిగా విశ్రాంతి తీసుకుందామంటే, విశ్వాసం ఏమిటో అవీ, ఇవీ, అన్నీ చెప్పి తన మనస్సు పాడుచేసేది. తన తల్లి దండ్రులమీదే తనతో నేరాలు చెప్పేది.

ఈ నాలుగేళ్ళల్లోనూ రాజేశ్వరికి ఎన్నో పెళ్ళి సంబంధాలు వచ్చాయి. అన్నీ, ఆమె ఇంకా చదువు కుందుకుగాని, వైద్యవృత్తిచేసుకుందుకుగాని అభ్యంతరపెట్టని సంబంధాలే. కామేశ్వరశర్మపలుకుబడికీ, ఆస్తికీ, రాజేశ్వరి తెలివితేటలకూ తగిన సంబంధాలు వచ్చాయి. కాని, ఒక్క సంబంధమూ కుదర నిచ్చేదిగాదు విశ్వాసం. ప్రతిదానికీ ఏవో వంకలు పెట్టేది. ఆ సంబంధాలు తప్పుతుంటే మధ్యన తను నూతిలో పడతా ననేది రాజేశ్వరితో. ఎట్లాగైనా ఆమె తన పిడికిలిపట్టులోనుంచి దాటివెళ్ళకుండా చెయ్యాలనే ఆమె ప్రయత్నం.

విశ్వాసమ్మ అధోగతిపాలయే రోజులు వచ్చాయి. లేకపోతే నాలుగేళ్ళలో వేళ్ళు పాతుకు పోయిన ఆమెను నిరంకుశంగా, నిర్దాక్షిణ్యంగా పొమ్మనటం ఎవరితరం? లోకంలో మంచివాళ్ళకు అట్లా చెయ్యటం మరీ కష్టం. మంచివాళ్ళు తాము కష్టపడుతూనైనా ఒకరికి కష్టం కలగకుండా చూస్తారు. పెద్దవాళ్ళు తాము ఎంత బాగా ఇతరులను అణగద్రొక్కగలరో అంతగా అటు కొక్కి తమ స్వలాభాన్ని బాగా చూచుకుంటారు. తమ స్వలాభంకోసం సంసారాల్ని నాశనం చెయ్యటానికైనా వెనుదీయరు.

ఒకనాడు కామేశ్వరశర్మ విశ్వాసమ్మను పిలిచి ఒక ఉత్తరం చూపించాడు. అది విశ్వాసం రాజేశ్వరికి ఆమె తల్లిదండ్రులను గురించీ, తనకు ఇంకా అధికంగా జరగని మర్యాదలను గురించీ విమర్శిస్తూ వ్రాసిన ఉత్తరం. ఇంకా అందులో, రాజేశ్వరిని పెళ్ళి చేసుకోవద్దనీ, చేసుకుంటే స్వాతంత్ర్యం నశిస్తుందనీ, పురుషుడికి బానిసగా వుండాలనీ, సంతానం కనే యంత్రంగా మారాలనీ, పెళ్ళి చేసుకోకుండా వుంటే ఆమె డాక్టరుగానూ, తను నర్సుగానూ తామిద్దరూ బ్రతికున్నంతకాలం వుండవచ్చుననీ, ఒకరి ఆజ్ఞలకు లోబడి వుండనక్కరలేదనీ — ఇంకా చాలా చాలా వ్రాసింది. విశ్వాసం వ్రాసినదంతా వాళ్ళ కుటుంబాన్ని విమర్శిస్తూనూ, తన భావిసౌఖ్యంకోసం రాజేశ్వరిభావిని శాశ్వతంగా అరికట్టే సూత్రాల నుద్బోధిస్తూనూ వుంది.

కామేశ్వరశర్మ ఇంకొక ఉత్తరా న్నందించాడు విశ్వాసానికి. అది రాజేశ్వరి విశ్వాసాన్ని గురించి తండ్రికి వ్రాసినది. అందులో ఇట్లా వుంది:

"నాన్నా,

దైవనిర్ణీతంగానో, నా కర్మబలంవల్లనో విశ్వాసానికీ, నాకూ స్నేహం ఏర్పడింది. ఈ నాలుగేళ్ళూ కష్టమో నష్టమో, సుఖమో దుఃఖమో గడిచిపోయాయి. విశ్వాసం మనింట్లోకి పరాయివానిలాగ వచ్చి తన హద్దు మీరి మనకు లేని హక్కులకోసంకూడా ప్రాకులాడుతోంది. ఆమె అభిప్రాయాలూ, ఎత్తుగడలూ నే నిదివరకే కనిపెట్టాను. ఆమెసౌఖ్యంకోసం మన సౌఖ్యాన్నికూడా త్రుంచివేయడానికి ఆమె జంకటంలేదు. ఇది ఆమెకు తగని పని. ఇన్నాళ్ళూ ఆమె యీ ఉత్తరంలో వ్రాసిన సంగతులే నా చెవుల్లో నూరి పోస్తూ వుండేది. కాని, ఆనాడు అవి మీతో చెప్పితే మీరు నమ్మరేమో నని నేను చెప్పలేదు. ఈనాటికి విశ్వాసం లిఖితపూర్వకంగా తన అభిప్రాయాలన్నీ నాముందు పెట్టింది. ఆమె నామీద యింకా సర్వహక్కులూ సంపాదించాలని చూస్తోంది. మీరు నా బాగు కోరేటట్లయితే ఆమెను మన యింట్లోనుంచి పంపెయ్యండి. ఇక నాకు విశ్వాసంమూలం కనపడవలసిన అవసరం లేదు. ఆమె నాకు వ్రాసిన ఉత్తరంకూడా మీకు పంపుతున్నాను. నేను క్షేమంగా వున్నాను.

ఇట్లు, మీ కుమార్తె
రా జే శ్వ రి"

ఆ వుత్తరం చదవటం అవుతూనే విశ్వాసం మళ్ళీ తన ఆయుధాన్ని ప్రయోగించింది. పెద్దపెట్టున ఏడ్పు మొదలెట్టింది. ఆమె రాగాలు ఆయన వినిపించుకో కుండా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

సాయంత్రం నాలుగు గంటలకు జట్కా వచ్చి గుమ్మంలో ఆగింది. విశ్వాసంసామానులన్నీ అందులో చేర్చబడ్డాయి. రాజేశ్వరితండ్రి ఆమె జీతంగాక మరో రెండువందలు ఖర్చుకు ఇచ్చాడు. విశ్వాసం వద్దనకుండా ఆ సొమ్ము తీసుకుంది. ఆమె బండి ఎక్కింది. బండి కదులుతూంటే వీధిలోవాళ్ళంతా వినటానికి గాబోలు, "ఎప్పటికైనా నాజీవితంలో మీ ఋణం వడ్డీతోసహా తీర్చేస్తా" నంది. బండి కనుచూపు దాటి వెళ్ళిపోయింది. రాజేశ్వరితల్లిదండ్రులు స్వేచ్ఛగా, చల్లగా నిట్టూర్చారు.

# జగజ్జనక నిర్యాణము

శ్రీ జి. జాషువ

భగ్గున మండు నీమనరపాలురతోడ నెదిర్చి వెన్క-కున్
దగ్గక, రక్తపుంజినుకు నష్టముగాని స్వరాజ్యయుద్ధమున్
నెగ్గిచినట్టి భారతమునిప్రవరుండు, క్షమాప్రవాసి, యా
ముగ్గిన పండు, బోనమయిపోయెనె నేడు తుపాకిగుండుకున్!

ఇదియే పోవడమా? జగజ్జనక! రానేరావుగా! నూట ము
ప్పదియేడుల్ మనువాడ నన్న నుడికిన్ భంగంబు వాటిల్లెనే
ముదితాతా! ప్రతిరక్తబిందువును మా పూర్ణస్వరాజ్యార్థమై
కొదలేకిచ్చిన నీ విషాదమరణాగ్నుల్ గాల్చె ముల్లోకమున్.

ఏ లేనవ్వులు లోకలోకముల మోహింపించి, నిర్జించి, స్వే
చ్ఛాలావణ్యవతీకరగ్రహణపూజల్ గాంచి పుష్పించెనో,
ఆ లేనవ్వుల రాశి, ఆ యపరవిద్యావార్ధి, ఆ పండుటా
కీ లోకంబును వాసెనే! భరతరాజ్ఞీ! యెంత దౌర్భాగ్యమో!

కలికాలమ్మున కేసుక్రీస్తు వని వర్ణించె దిగ్దేశముల్;
తులువల్ నల్పిన గాయముల్ మరల నీలో దోచి యేసుప్రభున్
దలపించెన్; ఋజువయ్యె నీదగు మహాత్వశ్రీ; భవత్త్యాగశ
క్తులలో నెన్ని స్వరాజ్యముల్ భువనవైకుంఠంబు లింపారునో!
అవతారమ్ములు దాల్చినాడు పదిమార్లబ్జాక్షుడంచుచ్చారకే
చవు లూరించు సమస్తశాస్త్రములు; సాక్షాదబ్జనాభుండవై
యవతారించిన నిన్నెఱుంగుదుము, బ్రహ్మాండంబెఱుంగున్ జగ
ద్భవమున్, చెండిలి పీవు కొండొక మరందప్రేమపానంబునన్.

అలిగి కూర్చుండు చిన్నబిడ్డలవిధాన-నుపవసింతువు భువన మొఱ్ఱాలలూగ
విశ్వములకెల్ల గారాలబిడ్డ వకట!-చంపుకొన్నది భారతక్ష్మాతలంబు.

---

# నివాపాంజలి

●

శ్రీ విశ్వనాథ వెంకటేశ్వర్లు

ఆయన కేమి మహారాజు ముక్తుఁడై పరమవైష్ణవు లేగు పదము నొంది
సాక్షాత్పరంజ్యోతిసారూప్యముం బొందు నవతారము సమాప్తి నంది వెడలె
కాలిబొట్టనవ్రేలు గాడింపఁడే బోయ కృష్ణదేవుని మిత్తికిని నిమిత్త
మఱి బలవన్మృతి యాయన బాధింపఁ డా రక్తబిందువు లవని బడియె
నద్దై కంకుని నెత్తురు లవని బడక-క్షామ మగునంచు సైరంధ్రి సాధ్వియగుట;
బాపుజీ నెత్తురులు పడ్డ భరతధాత్రి-కెన్ని క్షామము ల్వచ్చునో యేమి యెఱుక?

'మా హింస్యా' త్తని విశ్వశాంతిఘటనామ్లానప్రియంభావుక
వ్యాహారమ్ముల సర్వకాలము జగద్భద్రత్వమే కోరు నా
యీహామూరు విదేహు సత్యధరు నాహింసించి భ్రమించె దు
ర్మోహక్లిష్ట డెవండొ భారతమహాంభోరాశి కౌర్వాగ్నియై.

సత్యాహింసలు చట్టుబండలయి, విశ్వక్షేమమ్ముఁ బుగ్గియై,
ప్రత్యఙ్మూర్తి జగత్ప్రియంకరుఁడు దేవస్తుత్యశీలుండు భా
రత్యంతర్ముకురాయమాణహృదయుం డాహా దివం బేగ దా
ర్గత్యాధీనులు భారతీయులు దివారాత్రమ్ము లేడ్వంగనై.

ఈ తోడేళ్లకు నిట్టి క్రోల్పులకుఁ 'హింసాచ మా'యంచు స్వ
ర్గాతిథ్యమ్ము వహించునంతవఱకుఁ బ్రాల్మాలకే చెప్పెఁబో
నా తీర్థంకరు; డేమి లాభము? మనుష్యస్థూలచిత్తస్థహిం
సాలోకంబు గ్రసించెఁ బుద్ధిగతప్రజ్ఞారూపగోవత్సముఁ.

చాణక్యంబగు నీతికిఁ బ్రతిగఁ దా సత్యాగ్రహాఖ్యఁ మహా
శ్రీనీతిఁ వెలయించి, త్యాగమహితప్రేమఁ జితద్వేషుఁడై
పూనెంగాదె యజాతశత్రుబిరుదంబుఁ; వానికింగూడ స్వా
మీ! నైర్ఘృణ్యపరుల్ విరోధు లన, భూమిఁ మంచివా రెవ్వరో!

ఇది యాత్మార్పణసిద్ధియే యగును గాదే హంతరూపమ్మునన్
గదలంబాఱిన దుర్మతగ్రహము రాకాచంద్రు విశ్వైక్యశా
రదచాంద్రీమయు నాహరించె, నికపై రంజిల్లు నేతద్ద్యుతుల్
కదుపుల్ గట్టి భువర్ముఖంబులగు లోకాలన్ మహఃపుంజముల్.

చంపలేడు హంత; చంపి రెవ్వరు మఱి?-గురువు గుఱు వటంచు మురిసిపోయి
గురువువెనుక పెద్ద గోతులు త్రవ్విన-జరభిశిష్యు లతని జంపికొనిరి.

ఈ మనుష్యజాతి యింతే యుగాలకు-క్రొత్తక్రొత్త నొక్కు లొత్తికొనును;
ఒక్కసారి పట్టి యువ్వెత్తుగా మార్చు-శివము నెత్తువాడు సేగినొందు.

సోక్రటీసు జినుడు శుద్ధముక్తామణి-బుద్ధదేవు డేసు బోద్ధలెల్ల
స్వస్వరూపసిద్ధిఁ బడయు దర్పణమైన-ధన్యమూర్తి కశ్రుతర్పణంబు.

రఘుపతి రాఘవ రాజారాం
పతితపావన సీతారాం.

---



హంతకుని పైశాచికకృత్యఫలితంగా ఢిల్లీ-బిర్లాభవనావరణంలో గాంధీజీ రక్త స్రవంతిచే పునీతమైన ప్రదేశానికి చుట్టూ వెదురుగడలు పాతి, ఎవరూ అక్కడికి రాకుండా శ్రద్ధతీసుకుంటున్నారు.

# ధర్మచ్యుతి

"ప్రో. శా."

కాలగర్భంలో కలిసిపోయిన కమనీయ చరిత్రలను ఒక్క తోశారు. పెరవాళ్ళు తలవంచే ఔన్నత్యాన్ని తనవాళ్ళే నిరసించే నైచ్యానికి దించే కాలపురుషుడికి కళకళలు, వెకవెకలు. మధ్యాహ్న తైక్ష్ణ్యంతో సూర్యుడు ఎప్పుడూ వెలుగుతాడా? ఆ బంగారుకాంతికి కాలమేఘాలు అడ్డుపడుతాయి. అమరావతీవిద్యాపీఠపరిసరాల్లో సాయంకాలం అవుతోంది. సంతోషంవిదకాల ధీకరఅగాధం ప్రతిధ్వనిస్తోంది. కృష్ణానది చల్లగా, మెల్లగా సాగిపోతోంది.

* * *

‘చైత్యాన్ని విడిచిపెట్టి మనకీ ఏకాంతవిహారాలేమిటి?’

‘మన పిపాసకక్కడ స్థానం లేదు ధమ్మాంకిత!’

‘ఈ కాషాయవస్త్రాలేమిటి, యీ పిపాసార్తి ఏమిటి! విరుద్ధంగా ఉన్నాయి’

‘జగత్తులో పెరిగేవి విరుద్ధప్రకృతులే కాదూ!’

‘సమానసౌశీల్యాల కిక మన బౌద్ధంలో స్థానభ్రష్టత్వమేనా ధర్మిల!’

‘హుం! హుం! తథాగతుడు నీలో మూర్తీభవించాడు! హృదయంలో ఆరని ఆపాఖ్యరుచి మండుతూంటే ఏం సమానసౌశీల్యాలు? ధర్మాల పేరుతో జీవితాలు నాశనంకావాలా? జీవితానికి సౌఖ్యమిచ్చేది కాదూ ధర్మమంటే!’

‘ధర్మిల! ధర్మచ్యుతులంగా పరిగణించబడుతాం’

‘ధర్మం, ధర్మం, ధర్మం! నీకోసం నే వేచి చేస్తున్న క్షణాల్లో ఒక్క క్షణాన్నైనా నువ్వర్థంచేసుకున్నట్లయితే జీవితపూర్ణిమాసౌఖ్యాల్ని రాచి అంపాన పెట్టే యీ ధర్మాలను త్యజించేవాడివే. ఇంతకూ ధర్మం పేరుతో మానవత్వాన్నే నాశనం చేసుకున్నావా?’

‘లేదు ధర్మిల! లేదు. నీకోసం నా హృదయమూ తహతహలాడుతోంది.’

‘మరి, ఆరామసూత్రాలు చెవుల్లో గింగుర్లెత్తుతున్నాయా? ప్రేమను అనుభవించిన పిమ్మట సన్యసించాడు గౌతముడు. బ్రహ్మచర్యదీక్ష విధించాడు. ఆ దీక్షలో ఉండే రోదన ఆయన కేం అర్థంచేసుకున్నాడు...’

‘ధర్మిల! మహాత్ముణ్ణి ఆడిపోసుకోవద్దు. మన శరీరాల్లో ఉడుకునెత్తురు పొంగిపోతోందని మహాత్ముల దూషణ పనికిరాదు. బుద్ధం శరణం గచ్ఛామి.’

‘అదుగో. శ్రీవీథిలో విహరిస్తున్నవాళ్ళను చూడు. మనమేనా యీ ఉత్కంఠతో, కాంక్షతో కొట్టుకుపోతున్నది? ఆ దూరసైకతాల్లో మనలాగే ఓ జంట కనబడుతోందా? యౌవనహృదయాలు కలిసిన చోట యీమాత్రం ఉద్రేకం లెక్కలోదా ధమ్మాంకిత!’

‘సంఘారామంలో ప్రేమోదంతాలు విచ్ఛిత్తికి మూల మౌతయ్యేమో! ధర్మిల! నీ వేమని ప్రణిధానం చేశావు?’

'మాటలతో వారించదలుచుకున్నావా ధమ్మాంకిత! నా నిండుయౌవనంలో నీ పౌరుషం కలిసిపోనీ. వాంఛను ఎన్నాళ్లని చంపుకుంటాం? మనవీ మానవ శరీరాలే కాదూ! కనపడని మనుష్యులు కల్పించిన ప్రణిధానాలమీద గౌరవం కనపడుతూ కాంక్షతో కాలిపోతూన్న నా హృదయం మాట్లాడే ఉడుకు నెత్తురుతరంగాల ఘోషమీద లేదా? మానవహృదయాల్ని అర్థంచేసుకొనే శక్తి లేదా యీ బౌద్ధపరివ్రాజకశిఖామణులకు?'

'తీవ్రపడకు ధర్మిల!'

'కాను ధమ్మాంకిత! నీకోసం, నీ ప్రేమకోసం, నీ ఆలింగనంకోసం వేచాను. నా హృదయవీణ పలికే ప్రేమస్వరాలను వినే శ్రోతవు నీవే ననుకున్నాను. మానవసౌభాగ్యాన్ని ఆకాంక్షించే భిక్షుకసంఘం అమాయిక యౌవనకాంక్షను త్రోసిరాజంటోంది. విద్యాపీఠంలో సన్యాసినుల్ని ఎందుకు చేర్చుకున్నారు? స్త్రీ పురుష విభ్రమవిన్యాసాలకు విద్యాపీఠంలో స్థానం ఉందిగాని, దాని ఫలితంగా వచ్చే బ్రహ్మచర్య చ్యుతికిమాత్రం స్థానం లేదా ధమ్మాంకిత? ప్రపంచ వ్యుత్పత్తికే ఎదురుబాట ఐన బ్రహ్మచర్యాన్ని ప్రోత్సహించే భిక్షుకసంఘం సర్వమానవకల్యాణపదాన్ని ఎట్లా తొక్కుతుంది? సమాధానం చెప్పవేం? నిన్ను అధర్మానికి లాగుతున్నా ననుకోకు. నీ మనస్సులో ఉన్న వేదననుకూడా యీ ధర్మిల అర్థంచేసుకోగలిగింది. ఆత్మను నాశనంచేసుకొనేందుకు పనికివచ్చే యీ ధర్మాచరణలో కుమిలిపోవడానికా యీ చైత్యవిహార నిర్మాణం జరిగింది? ధర్మం కర్కశత్వానికి దారితీస్తోందా? ధమ్మా! ఛేదించు నీ ప్రణిధానభిత్తికను. ఆడది ఉద్రేకించాల్సిన నైచ్యంలో తోసిందా యీ బౌద్ధం మనల్ని? నే నర్థిస్తున్న ప్రణయభిక్ష కాదనకు. కాదన్నావా, కృష్ణానది చల్లగా నన్నెప్పుడూ ఆహ్వానించుతూనే ఉంది...'

'బుద్ధ, బుద్ధ! ధర్మిల! నేనూ నీతోవాడినే... రా పోదాం...'

పల్చగా వెన్నెల ప్రసారమవుతోంది. కృష్ణానదిసైకతాల్లో అం మభిక్షుకశ్రేణి విహరిస్తోంది. ఏకాంతవిహారాలకనువైన స్థావాలన్నీ నిండిపోయాయి. అక్కడక్కడ ఆరామగీతాలు వినబడుతున్నాయి. పవనాలు కాముకులకు చక్కలిగింతలు పెడుతున్నాయి. అమరావతీవిద్యాపీఠపరిసరాల్లో సంజె పోయి రాత్రిభాగం ప్రవేశించింది.

* * *

నిలువునా బుద్ధవిగ్రహం శాంతిజ్యోతిః కాంతులు వెదజిమ్ముతోంది. ఉచ్ఛ్వాస నిశ్వాసాల చప్పుడుతప్ప—భీకరంగా, నిశ్శబ్దంగా అకత్య ఆలోచిస్తోంది. వెదురుపేళ్ల కిటికీలోంచి దూరాన్న స్తూపం కర్తవ్యదీక్షను పునఃపునః జ్ఞాపకం తెస్తోంది. బుద్ధవిగ్రహంపాదాలు చిన్నచిన్న రకరకాల పూలతో కప్పబడ్డాయి. ఇక నిశ్శబ్దానికి చోటులేదు.

'అయితే నాశనం కావాలిసిందేనా పవిత్ర ఆరామమంతా!'

'ధర్మాంతరం ఆలోచించాలి. గుడ్లెర్రజేసి లాభంలేదు. మానవజీవితాల్ని మహోత్కృష్టంగా తయారుచేసే మన బ్రహ్మచర్యాన్ని మంత్రాంగంతోనైనా నిలబెట్టాలి.'

'కాదు. ఆ మంత్రతంత్రాలే మనల్నిందాకా తెచ్చాయి. బౌద్ధంమీద గౌరవం పోయి, ప్రజలు బ్రాహ్మణానికి ఎగబడుతున్నారు.'

'యజ్ఞయాగాదికర్మల్లో జరిగే హింసాకాండకు వ్యతిరేకంగా మనం ప్రచారం చేస్తూనే ఉన్నాం. చెప్పింది ఆచరణలో చూపిస్తూనే ఉన్నాం. ఇంకా ఎందుకు మనలో అవిశ్వాసం?'

'నీ అహింసమీద కాదు ప్రజలకు అవిశ్వాసం, నీ ఆశయాల మార్పుల్లో. నాస్తికసిద్ధాంతాల్ని అపాదించే నువ్వు ఒక్కసారిగా విగ్రహారాధనలోకి ఎందుకు దిగావని ప్రశ్నిస్తున్నారు ప్రజలు. తథాగతుని శుద్ధదీక్షను విడిచిపెట్టి నువ్వు మంత్రతంత్రాల మహాయానానికి ఎందుకు దిగావని ప్రశ్నిస్తున్నారు ప్రజలు. పవిత్రమైన ఆరామంలో తుచ్ఛకామానికి తావెందుకిస్తున్నావని ప్రశ్నిస్తున్నారు ప్రజలు. ఏం చెబుతావు!'

'అధర్మం ఎక్కడున్నా ఖండించాల్సిందే.'

'ఈ ధర్మప్రశ్నలతో తృప్తిపడటం లేదు నేటి లోకం! నీ బోధనలు లోకంలో అవిశ్వాసం రేప డానికి కారణ మవుతున్నాయి. చేతనవుతుందా— ఆవు ఆరామంలో బౌద్ధసన్యాసులు, సన్యాసినులుకలిసి జరిపే ఏకాంతవిహారాలు. అదే బౌద్ధాన్ని యీ గతికి తెస్తోంది. ప్రథమంగా పరిగ్రహించిన బ్రహ్మచర్యాన్ని పట్టుదలతో అవలంబించలేకపోతే యీమధ్య తెచ్చుకున్న చిన్నచిన్న దీక్షలు అవలంబించి చూపినా, నమ్మే అజ్ఞానంలో లేదు ప్రపంచం.'

'బౌద్ధం క్షీణించితే చూస్తూ ఊరుకోవాలా ఇహ?'

'బ్రాహ్మణమతానికి ప్రోత్సాహ మిస్తూ పల్లవులు, చాళుక్యులు రాజ్యాలుకూడా స్థాపించారు. రాజ ప్రాపకం ఉంటేనే మతం అనాయాసంగా పెరిగిపోతుంది.'

'రాజకీయాల్లో దూరుతున్నావేం?'

'కాదు. రాజకీయాల్లో మతంకూడా ఒక శాఖ. ప్రభుత్వమతం ఒకటై, ప్రజలమతం ఒకటైతే, ఫలితం బూడిద. ఇదంతా తెలియకనా శ్రమణక, ఆ ఆకర్షణకు లోబడకుండానే సన్యాసులకు ముండనం ధర్మంగా నిక్షేపించారు! దానికి గూడా లోబడని శరీరాకర్షణలు ఆరామంలోనే కుప్పతిప్పలుగా పెరుగుతున్నాయంటే నమ్మ. ధర్మిల మొన్న ధమ్మాంకితుడితో ముండనాన్ని కూడా 'మండనం ముండనం పుంసః' అని కొనియాడింది. ఇంత ఘోరశరీరాకర్షణ ఆరామంలో ఉద్భవిల్లడానికి కారణ మాలోచించు. పెరుగుట విరుగుట కొరకే. ఒక్కసారిగా విజృంభించిన బౌద్ధమతం ఒక్కసారిగా అధఃపతనాన్ని ఆకాంక్షిస్తోంది. విన్నావా?'

'ఇవ్వాళ రాత్రి ఆరామానికి తథాగతసూత్రాలు వివరిద్దాం'

'ఇదొక పిచ్చి. సూత్రాలు యీ ధర్మచ్యుతు లయేవాళ్ళకు తెలియవనా నీ అభిప్రాయం? ఆ ఆకర్షణలను దూరం చేసే మార్గం ఆలోచించాలి. మతంకోసం వచ్చిన సన్యాసినులు చివరకు ప్రేమకోసం పాకులాడుతున్నారు. సంఘారామంలో భిక్షుకీసముదాయం తెచ్చిన విచిత్రభయానకపరిణామం యీనాడైనా తెలుసుకో. బుద్ధభగవానుని కాలంలోని సౌభ్రాతృత్వం యీనాడు కాముకత్వంలో దూరింది. ఆనాడు ఆ భగవానుని తేజఃపుంజాలు ధర్మాన్ని కాపాడాయి. ఈనాడు నీ ముఖం, నా ముఖం చూస్తే ఆ తేజస్సు వాళ్ళకు గోచరించడం లేదు. వాళ్ళ ఆకర్షణలు వాళ్ళవి.'

'కఠినశిక్షలు విధిస్తే ధర్మచ్యుతులకి?'

'నీ బౌద్ధం నా కక్కర లేదు పొమ్మని కలువ. ప్రపంచంలో కాపరాలు కడతారు.'

'మార్గాంతరం నువ్వే చెప్పాలి మరి. కొన్నాళ్ళు పోతే యీ ఆకర్షణకు మనం కూడా ఆహుతి అవుతామేమో!'

'ఆ ఆత్మవిశ్వాసం లేకనే వాళ్లు ధర్మచ్యుతు లయ్యారు. పిచ్చి ఆలోచనలు కట్టిపెట్టు శ్రమణకా! మనమయినా ధర్మాన్ని ఆచరించాలంటే యీ మృషా సన్యాసుల్ని వదిలిపెట్టాలి. వాళ్ళ కర్మాన వాళ్ళు పోతారు. ఈ రాత్రే ఆరామంలో ధర్మంకోసం జీవించే మన సన్యాసులందరికీ రహస్యంగా యీఉపాయం చెప్పు. బట్టబయలు చేశావా, ఆ కళంకం కూడా మంచి వేషంతో మనలో చేరుతుంది. మనంకూడా కలుషితుల మవుతాం. జాగ్రత్త! తిచెత్తు పోదాం. ఈ ఆరామాన్ని పరిత్యజించుదాం. అక్కడినుండి హుయాన్ త్సాంగ్ కూడా యీ ఆరామాల్ని దర్శించడానికి బయలుదేరాడట. ఆయనేగనక యిక్కడికి వస్తే మనల్ని కూడా యీ ధర్మచ్యుతులకిందనే పరిగణించుతాడు. వేగిరం కానీ కర్తవ్యం!'

ఆ కక్ష్యలో చీకటి ప్రవేశించింది. అర్ధరాత్రాన ఒక కొరివి పట్టుకొని ఒక భిక్షుకవ్యక్తి ఆరామమంతా తిరుగుతున్నాడు. కొరవి గిలగిలా తన్నుకుంటోంది. ఏకాంతవిహారాలకు ఆరామం విడిచిపెట్టిన భిక్షుక సంఘం తిరిగి ఏ తెల్లవారుజాముకో స్వస్థలం చేరుకుంటుంది. అందాకా యీ కొఱవి ఆరామంలో తిరుగులాడుతూనే ఉంది.

ఒక మహాతేజోగోళం పటాపంచలై పోయింది. నిర్గుణప్రకృతిలో అహంకారస్వభావం తలఎత్తింది. ఒక విశుద్ధమధురజలప్రవాహం పోయిపోయి తిక్త సముద్రంలో కలిసిపోయింది. యుగధర్మం మారే విన్యాసం ప్రకృతిలో ప్రతిక్షణం గోచరిస్తోంది. నైతికంగా, ఆధ్యాత్మికంగా ధర్మదేవత ఘాతపడ్డట్లు జగత్తంతా విస్తుపోతోంది. స్తూపాలంకారాలన్నీ ప్రతిదినపోషణ లేకపోవడంవల్ల శిథిలావస్థను చెప్పలేక చెప్పలేక చెబుతున్నాయి. అమరావతీపీఠవిద్యాపరిసరాల్లో కరుణదేవత అస్ఫుటంగా తాండవిస్తోంది.

ఒకరోజున—

చిరుఎండలో స్తూపం చిత్రాతిచిత్రంగా మెరుస్తోంది. శిల్పిచేతుల్లో నున్నగా అయిన చెక్కడాలు సూర్యకిరణాల్ని అట్టే జారుస్తున్నాయి. ఆ వేళ మాత్రమే స్తూపంచుట్టుపక్కల కొత్త ముండితశిరస్కులు కనబడుతున్నారు. సన్యాసినులు ముదురు కాషాయరంగుతో ముతకబారిన వస్త్రాలనుకూడా లెక్కచెయ్యని యౌవనాన్ని నడకలో కుదించి పూజాద్రవ్యాలు ఆరామానికి చేరుస్తున్నారు. విహారంలో కొంత శూన్యత్వం గోచరించినా కొంత నిండుదనం ఆనాడు లేకపోలేదు.

విహారంలో ఒక పంచలో కూర్చున్నాడు హుయాన్‌త్సాంగు. ఆ పరిసరాలకు ఎవరూ రాకూడదని కట్టడి. ప్రక్కన భూర్జపత్రాలు బొత్తిపెట్టి ఉన్నాయి. గంటం చేతిలో ఆడుతూనే ఉంది. స్వీయపర్యటనావిశేషాలు లిఖిస్తున్నాడు. ఫాలంలో చెమ్మటలు క్రమ్మాయి. ఉత్సాహమూర్తి విగ్రహంలో గోచరించడం లేదు. అతని హస్తం అతని అనుభవాలను అక్షరాల్లో పెడుతోంది.

"కారుమబ్బు వేస్తే కేకిసలు కొట్టగలదు కాని కేకి, జోరున వర్షం కురిస్తే ఆనందిస్తుందా? సుతారంగా వాయిస్తే మధురగీతాలు పలుకగలదు గాని వీణ, బండగా గీస్తే ఓర్చుకోగలదా? హృదయపరివర్తన ఉంటేనే ధర్మాన్ని అర్థంచేసుకోవచ్చు గాని మాధాకర్షణలతోనా? నిరుత్సాహం నన్ను నిష్ఫలంగా చుట్టేసింది. మాత్రపఠనాలతో మారుమోగే ఆరామంలో నిశ్శబ్దం భరింపరానిది. ధర్మతేజస్సుతో వెలిగే భిక్షుకుల ముఖాలు సన్యాసినులకోసం, వాళ్ళ కటాక్షాలకోసం ఎదురుచూపులు వెలికక్కుతా యనుకోలేదు. బోసిపోతోంది ఆరామ మంతా. ముముక్షువులు ప్రణయక్షుకులయ్యారు. ఎక్కడ చూచినా దేవాలయాలూ, పూజాపురస్కారాలూ పెచ్చురేగిపోయిన బ్రాహ్మణమతపురోభివృద్ధినీ, ధర్మచ్యుతమైన బౌద్ధమతపు అధోగతినీ స్పష్టం చేస్తున్నాయి. కూడదని తెలిసికూడా అధర్మంలో కాలుపెట్టినవాళ్లకు దారిచూపడం ఒక్క ప్రళయంతోనే. బౌద్ధగ్రంథాలు బూజుపట్టి పోయాయని నాకలం ఎట్లా వ్రాస్తోంది! తథాగతుని పాదపూజకు నిర్మలపుష్పాలుకూడా కరవయ్యాయని ఎట్లా వ్రాసేది! చివరకు ఆరామంలో నివసించే భిక్షుకవ్యక్తుల్ని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చునన్న సంగతి భగవానుని ఆత్మకు తెలిసిందా?..."

ఆరామానికి కట్టిన మామిడిమండలూ, పూలహారాలూ ఒక కుప్పలో చేరాయి. వాటిల్లోనే బుద్ధపదస్పర్శ తగిలిన పుష్పాలుకూడా ఉన్నాయి. ఆ వాడిపోయిన పూలకుప్పలోనే హుయాన్‌త్సాంగు తన ఆవేదనంతా యిమిడ్చిపోయాడు. మళ్లీ ఆరామంలో నిశ్శబ్దం, నిర్మానుష్యం తీవ్రరూపం తాల్చాయి. బుద్ధ, ధర్మ, సంఘాల్ని శరణుపొందాల్సిన పరివ్రాజకలోకం జగత్తును శరణుపొందింది..

అమరావతీవిద్యాపీఠ పరిసరాల్లో అర్ధరాత్రి అట్లా సాగిపోతోంది.

'ధర్మో రక్షతి రక్షితః'



# ముందేమగునో?

= శ్రీ మద్దులపల్లి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి =

వశపడి చిక్కియుండుట కుపాయము లెన్నియొ యున్ని బుద్ధికిన్
గుశలత యున్నయంతవఱకున్ గనిపెట్టుదు; రవ్వి యెల్ల దు
ర్దశవలనన్ బ్రయోజనకరంబులుగాఁ గనిపించు; నందుచే
నశన జలాగ్ని వాయువసనాదుల కయ్యెడు చిక్కు లెంచఁడా!

గాలికి కట్టుబాటు వెదకంబడు కాలము వచ్చుఁ జూడుఁ "డి
న్నాళులు వోలె వాడుకొనినన్ సరిపోవదు; దాని శక్తి యి
క్కాలమునందు మిక్కిలిగఁ గావలె, నెక్కువ పీల్చుకొన్నచోఁ
జాలదు రేషియోల" కని చాటి, విధింతురు శిక్ష లంతటన్.

ముకురంధ్రంబుల కొక్కయాభరణమా పొంకంబుగా వాయుమా
పకముల్ సిద్ధముఁ జేసి, పెట్టుకొన నిర్బంధింతు; రిట్లైనచో
నొకవ్యాపారము! తన్నిమిత్తముగ నుద్యోగాలు! ! స్వార్థంబు! లెం
తకుఁ జాలమ్యెనొ చూడరయ్య! ప్రజలన్ బంధించు విజ్ఞానముల్!

"ప్రాణాయామము మోక్షసాధనము యోగాభ్యాసమం" దన్న వి
జ్ఞానం బింతకు నచ్చకున్నను, భవిష్యత్కాలము దద్ది యె
ల్లెన్నిన్ దప్పదు చూడుఁ! డొక్కొకరి కింతే గాలి పొమ్మన్నచోఁ
బ్రాణాయామముఁ బట్ట కేమగుదు? రారా! యేమి విజ్ఞానమో!

దినములు మాఱిపోవుకొలఁదిన్ గలికాలమొ యేమొ! బుద్ధులన్
దినమున కొక్కచందముగఁ దేజరిలెన్ విపరీతధోరణిన్,
గనుక విరుద్ధభావము, లనర్థపరంపర, లడ్డవాదముల్,
కని విననట్టి ఘోరములు కల్గుటకున్ మఱి యంతు గల్గునే?

---



# నిష్కృతి



[కథానిక]



## శ్రీ పినిశెట్టి శ్రీరామమూర్తి

వాస్తుశాస్త్రప్రకారం కట్టబడి, పూర్వపద్ధతిని స్ఫురింపజేస్తోన్న ఆ మండువాయిల్లు బాపిరాజు పిత్రార్జిత మనే సంగతి ఆ పేటలో వాళ్ళ కందరికీ తెలుసు.

వెనకట్లో భారీగా చేసిన పొగాకువర్తకం రాను రాను బాపిరాజు చేసే దానధర్మాలకు తాళలేక సన్నగిలిపోయింది. దాని చిహ్నంగామాత్రం తనింటెదురుగా చిన్న పందిరి వేసి, పందిరక్రింద రెండు బల్లలు పరచి, పొగాకు చదరపెట్టి, రోజూ కాస్తో కూస్తో అమ్మి పొట్ట పోషించుకొంటూ, ఈ లోకాన్ని వీడేపర్యంతం ఒకళ్లకు చేయి చాచకుండానే జీవించగలిగాడు బాపిరాజు.

బాపిరాజు బాగావున్న రోజుల్లోనే, ద్వితీయ కళత్రంగా మంగమ్మను చేసుకొన్నాడు. మంగమ్మ మనఃప్రవృత్తి చాలా విచిత్రమైందిగా ఆమెనడతను గమనిస్తోన్న ప్రతిఒక్కరూ అనుకునేవారు.

స్త్రీలోకంలో మంగమ్మలాంటి స్వేచ్ఛాజీవులు అరుదుగా అక్కడక్కడా కనపించేమాట వాస్తవమే; కాని ఆ స్వేచ్ఛను ఆమె కేవలం కష్టాల్లో ఉండే మానవులకోసం వ్యయిస్తుందంటే ఎవరు ఆశ్చర్యపోరు?

ద్వితీయకళత్రమైనా తనకు తగిన అర్ధాంగి దొరికినందుగ్గాను బాపిరాజు మనస్సులో యెంత మురిసేవాడో అతని అంతర్యాన్నెరిగిన మంగమ్మకే తెలుసు.

ప్రథమవివాహఫలితంగా పుట్టిన సత్యం పసో రేడులగాయితు మంగమ్మచేతుల్లోనే పెరిగి పెద్దవాడయ్యాడు.

ఆమె తనజీవితంలో ఏమీ పక్షపాతం చూపలేదని తెలుసున్నా కూడా, తండ్రిపోయినతర్వాత తల్లి అలా కష్టాల్లో మానవులను కాపాడ్డంకోసం తిరగడ మనేది సత్యంమనస్సుకు చాలా అసంతృప్తిగానే వుంది. పైగా మానవజాతి చాలా విశ్వాసఘాతుక మైందని, ఏఅనుభవాన్ని పురస్కరించుకొని మానసికంగా జీర్ణించుకున్నాడో, పాటిమానవజాతిపై సత్యానికున్న ద్వేషం మరింకెవ్వరికీ ఉండదేమో నని అనుమానపడ్డంమాత్రం అసత్య మైంది కాదు.

సత్యానికి తనచేతుల మీదుగానే, జగన్నాథపురంలో ఉన్న ఒక గౌరవకుటుంబీకుల పిల్లను పెళ్లి చేసి, ఆత నొకయింటివా డయ్యా డనే నమ్మకం కలిగిన మీదటే బాపిరాజు భగవత్సాన్నిధ్యం చేరుకున్నాడు.

బాపిరాజు పోయేటప్పటికి మంగమ్మకు నలభయ్యోపడి దాటింది. అంతవరకూ తన కడుపున ఏ కాయా కాయలేదు. మంగమ్మకు తాను గొడ్రాలినన్నే చింత లేకపోవడం సరికదా, భర్త చూపిన ఆదర్శాన్ని తాను ఏ ఆటంకమూ లేకుండా పాటించగలనా, లేదా అనే ఊహామాత్రం ఎక్కువగా బాధిస్తోంది.

శాపిరాజు పెద్దకార్యానికి రావడమే కోడలు సుబ్బాయమ్మ మొదటి రాక.

భర్త పోయినందుకు రోదన స్వరంగాని, అథవా బెంగగా ఉన్నట్లుగాని ఉండక నిశ్చింతగా మంగమ్మ కూర్చోడం కొత్త కోడలికి చాలా విడ్డూరంగానే కనుపించింది.

ఆమె ధైర్యంగా కూర్చొని కొడుక్కి సలహాలివ్వడం, తల్లి చెప్పినట్లు తు, చ, తప్పకుండా సత్యం ఆచరించడం చూస్తూన్న సుబ్బాయమ్మకు కొంత కష్టంగానే కనుపించింది.

పేటలో ఉన్న ఆడా, మగా అనే విచక్షణ లేకుండా అందరూ పలకరించిపోవడం, మొగడల మగాళ్లముందుకూడా మంగమ్మ కొంత కనుమరుగు చూపకపోవడం ఆ కోడలి పవిత్రపు యోచనలకు కొంత నైచ్యంగానే తోచింది.

కార్యమైన అయిదోరోజునే మంగమ్మ బందీ విడిచిన ఖైదీలా, ఉత్సాహ్హృదయంతో వీధిలోకి రావడం చూసిన కోడలు చాటుకు వెళ్లి రెండు చెక్కిళ్లా నొక్కుకుంది.

ఆ పేటలో యెవరికో జబ్బుగా వుం దని కబురు అందినమీదట ఆ రాత్రి మంగమ్మ ఇల్లు విడిచి పేటలోకి వెళ్లింది.

వాలుకుర్చీలో కూర్చొని ఏదో ఆలోచిస్తున్న సత్యందగ్గరకు వచ్చి సుబ్బాయమ్మ "మీ యమ్మ ఎక్కడికి వెళ్లింది?" అని రహస్యభంగిమలో మొగం పెట్టి అడిగింది.

"ఏమో—"అని తన్ను కానట్లుగా ఊరుకున్నాడు.

"ఆమె యెక్కడ కెళ్లేదీ మీ కవసరం లేదా?"

ఈ మాటకు సత్యం త్రుళ్లిపడి లేచి కూర్చొని "నా కవసరం యెంతవరకో నాకు తెలుసు. నీ కవసరం లేని ఈ విషయంలో శృతిమించి ప్రశ్నలు వేయడం పొరపాటని గ్రహించు" అని భర్త యిచ్చిన సమాధానానికి, కాస్సేపు స్తబ్దగా నిలబడి, ఇలా అంది: "ఏ అధికారమూ లేని ఈ యింట్లో నేనుండడంకూడా అనవసరమేగా?"

ఈ మాటకు సత్యం దృఢస్వరంతో "నీ కీ యింటివిషయాల్లో పరిపూర్తియైన అధికారం ఉందని గ్రహించినా ఆమెమీద అధికారం చలాయించడానికి మాత్రం నీ కేమీ అధికారం లే దనే సంగతి మరిచిపోవద్దు" అని సమాధాన మిచ్చాడు.

కాస్సేపు నిశ్శబ్దంగా వుండి, సుబ్బాయమ్మ స్ఫుటం తప్పిన హీనస్వరంతో "అయితే రేపు మా యింటికి పంపించండి" అని అడిగింది.

"సరే" అని సమాధాన మిచ్చి నెమ్మదిగా అక్కడనుంచి లేచి వెలుపలకు వెళ్లాడు సత్యం.

సుబ్బాయమ్మ అతడు వెళ్లిన దారిని పరికిస్తూ, పమిటకొంగుతో కళ్లు తుడుచుకుంటూ గదిలోకి వెళ్లిపోయింది.

మఱునాడు సుబ్బాయమ్మ ప్రయాణసన్నాహం కనిపెట్టిన మంగమ్మ కోడలిదగ్గరగా వెళ్లి "ఎక్కడ కమ్మా ప్రయాణం?" అని మృదుస్వరంతో అడిగింది.

"మా యింటికి"

"ఎవరన్నా తీసుకవెళ్లడానికి వచ్చారా?"

"లేదు"

ఈ సమాధానానికి కొంత ఆశ్చర్యపడింది మంగమ్మ. కోడలి అశ్రుకలుషితమైన మొగాన్ని క్షణం వరకూ నిదానించి "ఈ యింట్లో ఉండడానికి నీ కేమన్నా బాధగా వుందా" అని అడిగింది.

దానికి తిరిగి జబాబు సుబ్బాయమ్మనోటినుండి రాలేదు.

తాను తీసుకవచ్చిన బండిని వీధిలో నిలిపి, ఇంట్లోకి వచ్చిన సత్యం "ప్రయాణసన్నాహం పూర్తయిందా?" అని భార్యకేసి క్రోధంగా చూస్తూ అడిగాడు.

దించిన తల పైకెత్తకుండా "పూర్తయింది" అని అస్పష్టంగా సమాధాన మిచ్చింది సుబ్బాయమ్మ. బండిలో సామానులన్నీ సర్దించాడు సత్యం. సుబ్బాయమ్మ అత్తగారి పాదాలకు నమస్కరించి "వెళ్లొస్తానండి" అని చెప్పి పైకి లేచింది.

మంగమ్మ కోడలిశిరాన్ని స్పృశిస్తూ "ఇంత హఠాత్తుగా వెళ్లే కారణం ఏమిటో నా కర్థం కాలేదు

తల్లీ!" అని ఆమె మొగాన్ని, సమాధానం ఆశించి చూసింది. కాని సుబ్బాయమ్మ ఏవిధమైన సమాధానమూ ఇవ్వకుండానే వెళ్లి బండెక్కింది.

మంగమ్మ బండివెనకాల నిలబడి సంక్షోభిస్తున్న హృదయంతో "ఈ దిక్కుమాలినదానివల్ల ఏవన్నా లోపా లుంటే, అవి మీ మామగారివిగా, ఆ నేరం వారిపై మోపి, ఎవరితో చెప్పొద్దు తల్లీ! వారు నీకూ, నాకూ అందరికీ పూజ్యులే" అంది.

బండి కదిలింది. బాగా వెనక కూర్చున్న సత్యం "మళ్లీ వెంటనే తిరిగొస్తానమ్మా!" "నేను రానని వంటమాత్రం మానొద్దు" అన్నాడు. బండి రయంగా ధూళిని రేపుకుంటూ సాగిపోవడం చూపుమేఱవరకూ మంగమ్మ చూస్తూనే నిలుచుంది.

సత్యానికి కమీషను వ్యాపారంలో మంచి పలుకుబడీ, అనుభవమూ కూడా వుంది. అందుకే అతను అప్పుడప్పుడూ కలకత్తాప్రాంతానికి ప్రయాణమౌతూ వుంటాడు.

భార్యను పుట్టింటిదగ్గర విడిచి, తిరిగి యింటికి వచ్చినవెంటనే, కలకత్తానుంచి తంతి రావడం వల్ల కలకత్తా వెళ్లి, తిరిగీ పదిహేనురోజులకు ఇంటికి చేరుకున్నాడు.

సుబ్బాయమ్మను తిరిగీ కాపురానికి తీసుకవచ్చే విషయంలో, చాలా రోజులు కింకర్తవ్యతామూఢుడై ఏమీ నిర్ణయించుకోలేక ఊరుకున్నాడు.

ఒక రోజున మంగమ్మే మాటలసందర్భంలో కొడుకుతో ఇలా అంది: "ఏలాగైనా కొత్త వున్న వాళ్ల బిడ్డ. కొంచెం బెట్టు ఉండడం ఆశ్చర్యం కాదు. నువ్వన్నా వెళ్లి ఆ సంగ తేమిటో కనుక్కురారాదూ?"

ఈ మాటలు పేరుపెట్టి 'ఫలానా' అని చెప్పకపోయినా తల్లి ఎవరినిగురించి ఆ మాట లంటోంకో అర్థంచేసుకోవడంలో సత్యానికి అట్టేకాలం వృథా కాలేదు.

వ్యథితహృదయంతో తల్లిని ప్రాధేయతగా చూస్తూ "దానిగురించి ఏ మాటా నాదగ్గ తనొద్దమ్మా" అన్నాడు. ఒక నిమిషం మంగమ్మ విస్తుపోయి చూసింది.

"ఏమీ!" అని కళ్లు పెద్దవిగా చేసి అడిగింది.

ఆ మాటకు సమాధానం ఏమీ యివ్వకుండా వెలుపలకు వెళ్లిపోయాడు.

ఆ దంపతుల అంతర్యంలో ఏలాంటి గాయం గూడు కట్టుకొని, చిట్టి బాధపెడుతోందో మంగమ్మకు తెలీదుకాని, కొడుకు ఉదాసీనవదనంతో, సమాధానమివ్వకుండా వెళ్లిపోవడంవల్ల మంగమ్మకు గాయం లేకుండానే బాధపెట్టడం ప్రారంభమైంది.

మళ్లీ సత్యం కోస్తాకు ప్రయాణమై వారం రోజులు మకాం వేయడంవల్ల, తన కోడలి సంగతి తెలుసుకోడానికి మంగమ్మకు కొద్ది సావకాశ మేర్పడింది. వియ్యంకుడైన రాఘవయ్యకు ఒక పెద్దమనిషి ద్వారా ఈ విధంగా కబురుచేసింది:

"అబ్బాయివిషయంలో నా కేమీ పాలుపోవడం లేదు. కోడలిని మీ రిక్కడకు పంపించే ఏర్పాట్లు ఆలస్యంగా చేస్తే, అనంతరం జరిగే ఏలాంటి గొడవలకుగాని నేను బాధ్యురాలుగా మీరు ఊహించడం తప్పుత్రోవను పట్టిన ట్లవుతుంది. అబ్బాయి కుత్తరం రాసి, ఆలస్యానికి కారణ మేమిటో తెలుసుకోండి".

ఈ విషయాలు విన్న రాఘవయ్య ఆ వచ్చిన పెద్దమనిషితోనే తిరిగీ మంగమ్మకు యిలా సమాధానం పంపించాడు:

"మాది సత్సంప్రదాయంతో కూడుకున్న కుటుంబం. సిగ్గుమాలినవాళ్లతో సంబంధం అందుకున్నందుకు నేను చాలా విచారిస్తున్నాను. ఇంతవరకే నా తల కొద్దిగా వంగింది. అల్లుడు కూతుర్ని విడిచాడనే అపవాదు వస్తే, నా తల భూమిని తాకడం నిజం. సలహా యిచ్చిన నా చెల్లెలిమాట శిరసావహిస్తున్నా నని చెప్పండి."

ఈ సమాధానం అందుకున్నాక, ఎవరు సిగ్గుమాలినవాళ్లో, మానవులు రెండుకు, ఏ పరిస్థితుల్లో సిగ్గుమాలినవాళ్లు కావలసివస్తుందో ఆమె కర్థం కాలేదు. ఆమెప్రయత్నం కొంతవరకూ ఫలించినమనే అనం

దంలో తన వంశంపై వేసిన అపవాదు అతి తేలిక పదార్థంలా మాయ మవడంవల్ల, దానినిగురించి అట్టే చింతన చేయలేదు.

కలకత్తానుంచి సత్యం వచ్చిన మరునాడే, తన పేరను మామగారు వ్రాసిన ఉత్తరం ఒకటందింది. ఆ వుత్తరం తల్లికి చూపకుండా జేబులో గుప్తపరిచాడు. తల్లికి చాటుగా ఉంచాలనే ప్రయత్నం అతనిలో లేక పోయినా, ఒక నిర్ణయానికి వస్తేనే గాని తల్లితో చెప్ప దలుచుకో లేదు.

మరునాడు మధ్యాహ్నం భోంచేస్తూ తల్లిని చూస్తూ "నేను సాయంత్రం వెళ్లుతున్నాను" అన్నాడు సత్యం.

ఆత్రంగా "ఎక్కడకూ" అని ప్రశ్నించింది మంగమ్మ.

"ను వ్వెళ్లమన్న దగ్గరకు"

ఆమె నవ్వింది. ఆ నవ్వు బిగ్గరగానే ధ్వనించింది. ఆ నవ్వు ఏనాటినుంచో అంతర్గతంగా అణగి ఉంది. తన తండ్రి ఉండగా తన పెళ్లిసంబంధం ఖాయపడి న్నాడు తల్లినోటినుంచి ఈలాంటి నిర్మలమై, నిష్కాపట్యాన్ని తెలియబరిచే నవ్వు విన్నాడు. ఆ నవ్వు అప్పట్లో ఆనందం, ప్రస్తుతం బాధా కలిగించింది సత్యానికి. తల్లిని తీవ్రంగా చూస్తూ "ఎందుకూ నవ్వుతున్నావ్?" అని అడిగాడు.

ఆమె ఎందుకు నవ్విందో ఆ కారణం ఆమెకు తెలుసు. ఆ కారణాన్ని చెప్పినట్లయితే, తిరిగి ప్రతి ఫలం ఏరూపంలో వస్తుందో నదే సంగతికూడా తెలుసు. అందుచేత ప్రసన్నంగా చూస్తూ "ఎందుకు నవ్వు రాదూ! ఆ వెళ్లేది నేను చెప్పినప్పుడు వెడితే..." ఇంకా ఏదో చెప్పబోతోండగానే, సత్యం ఎడమ చేత్తో విసరిన ఉత్తరం ఆమెపాదాలచెంత పడింది. వెంటనే ఇలా అన్నాడు: "ఇప్పుడు నాకు నేనై వెళ్లడానికి అంత పౌరుషహీనుణ్ని కాదు. వాళ్లు కోరి వ్రాసినమీదటే, రేపు తీసుకరావడానికి మంచిరోజని వెళుతున్నాను".

ఆ సాయంత్రం ఏడుగంటలకు సైకిలుమీద అత్తవారింటికి చేరుకున్న సత్యాన్ని చూసిన సుబ్బా యమ్మమొగం ఆనందంతో వికసితమైంది.

ఆ సంతోషవార్తను దొడ్డిఅరుగుపై నున్న తండ్రికి అందజేయడానికి వెళ్లింది. వెళ్లినంత త్వరగా చెప్పడానికి, మొదట్లో కాస్త సిగ్గుపడింది. "ఏం అంత తొందరగా వచ్చావ్"అనే ప్రశ్నార్థకాన్ని సూచిస్తోన్న తండ్రిమొగాన్ని చూసి, నెమ్మదిగా "వా రొచ్చారు" అని చెప్పింది.

"ఎవరూ?"

ఈ మాటకు ఏమి సమాధానం చెప్పాలో ఆమె కవగాహన కాలేదు. సుబ్బాయమ్మచిన్న చెల్లెలు లక్ష్మి పెద్ద అట్టహాసం చేసుకుంటూ "బావొచ్చారు" అనే వరకూ రాఘవయ్యకు అల్లు డొచ్చినట్లుగా అర్థం కానేలేదు.

తిన్నగా వీథిలోకి వచ్చాడు రాఘవయ్య. సైకిలు అరుగునకు చేరి, మెట్లెక్కి వస్తోన్న అల్లుణ్ని చూసి "ఇంటిదగ్గర్నుంచేనా రాక?" అని సమర్యాదస్వరంతోనే పలకరించాడు. ఔనన్నట్లు సంజ్ఞాపూర్వకంగా సమాధాన మిచ్చాడు సత్యం.

కాళ్ళూ చేతులూ శుభ్రపరచుకున్న అనంతరం బల్లపై కూర్చొన్న అల్లుడిదగ్గరగా వచ్చిన రాఘ వయ్య "మీ అమ్మగారు క్షేమమేనా?"అని కాస్త హేళనకోణాన్ని ధ్వనిస్తూ అడిగాడు.

"క్షేమమే"అని సహజంగా సమాధాన మిచ్చాడు సత్యం. బల్లఎదురుగా ఉన్న కుర్చీని సత్యందగ్గరగా లాక్కుంటూ, "ఘోషాచేయడం ఆమెకు అలవాటు లేకపోయినా భర్తపోయిన స్త్రీ ఎలా వుండాలో, ఆమెకు గుర్తుకు లేవడం నీ ధర్మంకదూ?"అంటూ అతని మొగంలోకి చూసి కూర్చున్నాడు.

సత్యం తిరిగీ ఏమీ సమాధాన మీయకపోవడం వల్ల రాఘవయ్య స్నేహార్ద్రశాంతస్వరంతో "ఆమె చేసే పని సత్యదృష్టిలో తప్పు కాకపోవచ్చు. ఏస్త్రీగాని చూపని ఆదర్శాన్ని ఆమె చాటిచూపడంలో వచ్చే ప్రత్యేకత ఏముందంటావ్?" ప్రశ్నార్థంగా అల్లుడుకేసి

చూసి, ఒక్కసారి చిరునవ్వును వ్యక్తపరిచి "ఎన్నడూ, ఎవరిచేతా వేలుమడచి చూపుకోని మీ వంశం నేటికి అందుకు పాలుగావలసివస్తున్నది. ఔనంటావా, కాదంటావా?" అనేట్లుగా అల్లుడి మొగంలోకి చూశాడు.

రాఘవయ్యమాటలకు సత్యం మొగంపై ఒక సంశయతెర తొలగిపోయినట్లుగా శ్రద్ధను ద్విగుణీకృతం చేసి వింటున్నాడు.

మళ్ళీ రాఘవయ్య ఉత్సాహపూరితంగా ప్రారంభించాడు: "నీకు ఆమె సవతితల్లి; ఇది యెవరూ మభ్యపరచలేని నగ్నసత్యం. కాని ఆమెస్వేచ్ఛాజీవనం భవితవ్యంలో ఎవరి శిరస్సు ఛేదిస్తుందో ఆ సంగతి ఆమెకు తెలుసు. అక్కడే భేదం ఉంది. కన్న కొడుకైతే, అతని కయిష్టమైన పని ఆమె ఎన్నడూ చేయలేదు."

సత్యం తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. మామగారి మాటలు సత్యదూరంగా లేవు. ఇంకా వింటున్నాడు:

"మీ రిద్దరూ కన్నవాళ్లకంటే సన్నిహితంగా ఉన్నారంటే నాకు చాలా ఆనందంగానే వుంది. కాని, ఆమెకు నిజమైన మాతృహృదయ ముంటే నీకోసం, నీ పరువుప్రతిష్ఠలకోసం ఆమె స్వల్పమైన తన స్వేచ్ఛను త్యాగం చేయలేదా?"

నిజమే, ఈ మాటల్లో ఉత్ప్రేక్షగాని, ఉదాసీనతగాని లేనట్లుగా సత్యం గుర్తించాడు. నెమ్మదిగా లేచాడు. రాఘవయ్యమొగంలో ఆశ్చర్యం ప్రకటితమైంది.

"ఏం లేచావ్?"

"రేపు మూడుగంటలకు చాలా మంచిది. మీ అమ్మాయిని ప్రయాణంచేసి ఉంచండి"

అంతవరకూ తండ్రిచాకచక్యాన్ని మానసికంగా అభినందిస్తూ తలుపుమాటుగా ఉన్న సుబ్బాయమ్మకు భర్తమాటలు చాలా అసందర్భంగా కనిపించాయి. గుమ్మంవెలుపలకు తల వంచి, రాఘవయ్యకేసి చూస్తూ "నాన్నగారూ! నన్ను పంపించడానికి మీ రేమీ ఆలోచించవద్దు. ఆ తల్లి ఉండగా ఆ యింట్లో నేను కాపురం చేయలే ననేమాట వారి దృష్టిలో ఉంటే అంతే చాలు"అని వెంటనే తలుపు చాటుకు వెళ్ళింది.

హఠాత్బద్ధుడుగా కాస్సేపు ఆ తలుపుకేసి చూసి, బరువుగా పాదాలు వేసుకుంటూ గుమ్మం దిగి పైకి లేచ్చాడు. ఏదో గుర్తువచ్చినవాడులా గుమ్మంకేసి చూసి "ఆయిల్లు కాకపోతే మరో యిల్లు. కాని ఈ యింట్లోనే నువ్వు స్థిరంగా ఉంటా వనే మాట అబద్ధం" అని అనడంలో, రాఘవయ్య కాస్త చలించి "ఎంత మాట సత్యం! పరువుమర్యాదలు తెలిసున్న మాకు నువ్వు పరాకుచెప్పడం ఆశ్చర్యంగానే ఉంది" అన్నాడు.

ఈ సునిశితమైన అవహేళనకు సత్యం హృదయం బాధపడింది. తిరిగి సమాధాన మీయలేదు. చీడీకి ఎడమకాలు మోపి, సైకిలును ఎదరకు తోయడానికి సిద్ధంగా ఉన్న సత్యం సైకిలు వెనక కారియర్ పట్టుకొని, రాఘవయ్య ఆసక్తిగా అతని మొగంలోకి చూస్తూ "నే నన్న మాటలు ఏమన్నా బాధగా తోచాయా?" అని అడిగాడు.

ఈ మాట మరీ సిగ్గు కలిగించింది. వంచిన తల పైకెత్తి "లేదు" అని సమాధాన మిచ్చాడు.

వెంటనే తృప్తిగా చూస్తూ "అయితేసరే-రేపు అమ్మాయిని పంపడానికి నా అభ్యంతరం ఏమీ లేదు" అని కాస్సేపు ఆలోచించి "ఈ రాత్రి ఉండి, రేపు ఇద్దరూ కలిసివెళ్ళడానికి వీల్లేదూ?" అని అడిగాడు.

"వీల్లేదు; ఈలోపుగా చేయవలసిన పనులు చాలా ఉన్నాయి"

రాఘవయ్య సైకిలు విడిచాడు. సత్యం ఎదరకు వంగి సైకిలును ఒక్కసారి విసురుగా త్రొక్కి, ఆ చీకట్లో ప్రయాణం సాగించాడు.

సత్యం యింటి కొచ్చేసరికి, మంగమ్మ తలుపు తాళంవేసి, పేటలోకి వెళ్లింది. తాళాన్నిపట్టి రెండు సార్లు ఎదరకు లాగి, నిస్పృహగా పెదిమె విరచి "అబ్బే!......ఇక లాభం లేదు" అని నెమ్మదిగా గొణుక్కున్నాడు.

అరగంట గతించింది. సత్యం శరీరాన్ని గోడకు జారవేసి, అరుగుమీద చతికిలబడ్డాడు. లైటు చేత బట్టుకొని, తిన్నగా మెట్లెక్కి, తాళం తీయ బోతూన్న మంగమ్మకు ఒక అస్పష్టమైన ఉచ్ఛ్వాస ధ్వని వినిపించింది. అరుగుమీద ఎవరో కూర్చున్నట్లుగా కనిపించి "ఎవరూ ?" అని ప్రశ్నించింది. సత్యం సమాధాన మీయలేదు.

నెమ్మదిగా లైటు తీసుకవెళ్లి, అతని మొగాన్ని చూచి విస్మయకంఠస్వరంతో "మీ యత్తారింటికి వెళ్ళ లేదూ !" అని అడిగింది.

సత్యం తీవ్రంగా చూశాడు. అతని మొగంలో విభ్రమణమాత్రోన్న భయంకర ఊహాచిత్రాలను ఆ గుడ్డికాంతిలో ఆమె గమనించలేదు.

"కాస్సేపు కూర్చో; స్నానం చేసివచ్చి వడ్డన చేస్తా" అని మంగమ్మ కొంతవరకూ వెళ్లి, తిరిగివచ్చి "రామాయమ్మకు ఆడపిల్ల. ఇంతక్రితమే ప్రసవించింది. పాపం వాళ్ళకు ఎవరూ లేరుగా! కాస్త సాయంచేసి చక్కా వచ్చాను." అంది.

ఈ మాట విన్నమీదట మనస్సులో ఎంత అక్కసుందో అంతా వెళ్లడిచేదామని, ఉన్నచోటి నుంచి పైకి లేచాడు. మంగమ్మ నిస్వార్థ ప్రశాంత వదనం కాస్సేపు చూసినమీదట సత్యం అవదల్చుకున్న మాటలు అనలేకపోయాడు. కాని, "మంత్రసాని రాలేదా?" అని మాత్రం కష్టంగా అనగలిగాడు.

"రాలేదు, వచ్చింది"—అమాయకంగానే సమాధాన మిచ్చింది.

"ఒకవేళ నువ్వే మంత్రసానిబాధ్యత తీసుకున్నావేమోనని అడిగాను" అన్నాడు సత్యం. ఆ మాటల్లో ఉండే అంతర్యాన్నికూడా ఆమె గుర్తించలేదు. నిష్కపటంగా నెమ్మదిగా నవ్వి "అది మాత్రం ఏమంత తప్పపనీ—చేయాల్సిన అవసరం వస్తే తప్పకుండా చేయాల్సిందే" అని సమాధాన మిచ్చింది.

అంతటితో ఆగలేదు సత్యం. కఠినస్వరంతో "పురిటికట్నంకోసం మంత్రసానిపనికూడా తీసుకున్నావా ?" అన్నాడు.

మంగమ్మ విస్తుపోయి సత్యంమొగంకేసి చూసింది. అతను మళ్ళీ ఏమీ మాట్లాడలేదు. ఆమె భారంగా నవ్వి "డబ్బుకోసం పనిచేయడం మీనాన్నగారు నాకు నేర్పలేదనే సంగతి నీకు తెలీదూ ?" ఏమన్నా సమాధానం యిస్తాడేమోనని కాస్సే పాగి "ఆకలిమీ దన్నట్లున్నావ్" అని సమాధాన మిచ్చి, త్వరగా తలుపు తెరచి, మరో చీర కత్రలో అందుకొని, స్నానం చేయడానికి వెళ్ళింది.

వడ్డన అయినతరువాత సత్యంకేసి చూస్తూ "లే నాయనా, వడ్డనయింది" అని మంగమ్మ పిలవగానే సత్యం వెళ్ళి భోజనందగ్గర కూర్చున్నాడు.

అన్నం తింటూనే సత్యం పరధ్యానంగా ఉండడం గుర్తించిన మంగమ్మ "కోడలి ఆరోగ్యం బాగుందా ?" అని అడిగింది.

"రాయిలా వుంది" అని సమాధాన మిచ్చాడు.

ఆ మాటకు నవ్వవలసినది బదులుగా మంగమ్మ మొగం కాస్త మలినమైంది. అన్నం కలుపుతూ కలుపుతూ చేతిని అలాగే వుంచి, దీపంకేసి అర్థశూన్యంగా చూస్తున్న సత్యందగ్గరగా వెళ్ళి "వంట్లో నీరసంగావుందా ?" అని అడిగింది.

"లేదు" అని ముక్తసరిగా సమాధానం చెప్పాడు. మరచిన పని గుర్తుకు వచ్చినవాడులా అన్నాన్ని కలుపుతున్నాడు.

మంగమ్మ ఇంకా ప్రశ్నలు వేయా లనుకున్నా, సత్యం ఉదాసీనతను గుర్తించిన ఆమె మనస్సు ప్రశ్నలు వేయగల ఉత్సాహాన్ని కోల్పోయింది.

అన్నం కలుపుతూ కలుపుతూ సత్యం హఠాత్తుగా తల పైకెత్తి తల్లి కేసి చూశాడు. క్రిందికి చూస్తూ ఆలోచనానిమగ్నయైన మంగమ్మ సత్యం చూపును గమనించలేదు.

"నువ్వు రోజూ అలా అందరిళ్లకూ తిరగడం యెందుకమ్మా ?"

మంగమ్మ తల పైకెత్తి చూసింది. తల్లిచూపు చూసి సత్యం ఏదో నేరం చేసినవాడిలా తల దించాడు. ఆమె నెమ్మదిగా నవ్వినట్లు సత్యానికి వినిపించింది.

"కష్టాల్లో ఉన్నవాళ్ళను సాధ్యమైనంతవరకూ కాపాడ్డమే మంచిదిగా పోయిన మీ నాన్నగారి హితోపదేశ మనే సంగతి మరిచావా ?"అని ప్రశ్నించింది మంగమ్మ.

ఈ సంగతి సత్యానికి తెలుసు. మందులు స్వయంగా చేసి, రోగుల బాధానివారణకోసం ఉచితంగా యివ్వడమూ దగ్గరుండి వాళ్ళకు బాపిరాజు చికిత్సచేయడమూ, సత్యానికి బాగా గుర్తుంది. కాని మగవాడైన తన తండ్రి చేసిన ఆ పనినే ఆడదైన తన తల్లి చేస్తే సమాజంలో ఎంత అవమానం పొందాల్సి వుంటుందో, ఈ రోజున మామగారి నోటంట మొదటిసారిగా విన్నాడు. అప్పటినుంచీ సత్యంమనస్సు ప్రతిఘాతపరాభవానికి తీవ్రంగా చలిస్తోంది.

సత్యం మెల్లిగా తల్లికేసి చూస్తూ "నాన్న చేసిన ఆ పనే నువ్వు చేయాలనే సిద్ధాంతమేమిటి ?" అని అడిగాడు.

మంగమ్మకు ఈ మాట బాధగానే కనిపించింది.

"పరలోకంలో ఉండే భర్తను భార్య ఏనాటికైనా చేరుకోవాలనే సంకల్పమే ఉంటే అతనికి ప్రీతికరమైన పనులు చేయడమే ఆమెవిధి"అని సమాధానమిచ్చింది.

మారు వడ్డన కూడా చేయకుండానే అన్నం దిగవిడిచి లేచాడు సత్యం. మంగమ్మ విస్మయవదనంతో అలా చూస్తూనే ఉండిపోయింది.

అలవాటుప్రకారం ఆ రాత్రి సత్యానికి అరుగుపైన మడతమంచం వేసి, మంగమ్మ యింట్లో పడుకుంది.

కొడుకుప్రవర్తన ఆమెకు ఏమీ అర్థంగాక, చాలావరకూ ఆలోచనలతో కాలాన్ని వ్యయం చేసింది. ఆమెకు నిద్దర పట్టలేదు.

"అమ్మా".—మంచంమీద పడుకునే పిలిచాడు సత్యం. తలుపు తెరచుకొని మంగమ్మ వెలుపలకు వచ్చింది. సత్యం మంచంమీద లేచి కూర్చున్నాడు.

"నే నీ యింట్లో వుండలేనమ్మా !"—అతని మాటలు దుఃఖపూరితంగా వెలువడ్డాయి.

మంగమ్మ హీనస్వరంతో "కారణ మేమిటి ?" అని అడిగింది.

"కారణం తర్వాత నీకర్థ మౌతుంది. రేపు నేను మరో యిల్లు చూసుకుంటున్నాను"అని సమాధానమిచ్చాడు.

ఆమె ఒక నిమిషంవరకూ చైతన్యరహితంగా నిలబడింది. కాస్త తేరుకున్నమీదట ఇలా అంది: "ఈ సంగతి చెప్పడానికేనా నన్ను పిలిచింది ?"

"అవును"అని చెప్పి, మంగమ్మసమాధానం కోసం చూస్తున్నాడు. ఆమెనుంచి సమాధానం వచ్చే ముందు మ్లానమందస్మితధ్వని మధురంగా వినిపించింది సత్యానికి. తలెత్తి పైకి చూశాడు.

"మంచిది నాన్నా ! నువ్వెక్కడున్నా సుఖంగా వుండడమే కావాలి"అని ఆమె నెమ్మదిగా లోపలకు వెళ్ళి, తలుపురెక్కలు రెండూ వేసుకుంది.

ఆ తటస్థభావానికి సత్యంమనస్సు చాలా మథన పడింది. తను చెప్పిన మాటకు వచ్చే సమాధానం అదిగా భావించలేదు అతను..."నువ్విలా అంటే నాకాధారం ఎవ్వరు బాబూ" అని ప్రాధేయపడుతుందని, వ్యథిత హృదయంతో... చెప్పలేక చెప్పాడు. కాని కనీసం ఎందుకు వెళుతున్నా వనికూడా ఆమె అడగలేదు.

తెల్లవారుఝామున వాకిలి ఊడుస్తోన్న చీపురు ధ్వని సత్యానికి మెలుకువ తెచ్చింది. నెమ్మదిగా మంచంమీదనుంచి లేచి "అమ్మా"అని పిలిచాడు. మంగమ్మ చీపురు పంచెరరాటుకు నిలిపి, కొడుకుదగ్గరగా వచ్చింది.

అతని మొగం ప్రసన్నంగా లేదు. కల్పిత ఊహాచిత్రాలతో అతని మొగం మాలిన్యభూయిష్ఠంగా కనిపిస్తోంది. కాస్సేపు తల వంచి ఏదో ఆలోచిస్తూనే, హఠాత్తుగా తల పైకెత్తి, తల్లికేసి చూస్తూ కఠోరస్వరంతో—"ఈ యిల్లు నేను లాక్కుంటానేమో నని భయపడుతున్న ట్లున్నావ్...అందుకే నేను తొందరగా వెలుపలకు వెళ్ళడం ఒకందుకు మంచిదిగా ఊహించావ్. కాని నాకీ యింటిపై ఎప్పుడూ ఆశ లేదు. ఇది నీది. ఇక నీ యిష్టం. పీఠులన్నీ తిరిగి,

రోగు లందర్నీ తీసుకవచ్చి, తృప్తి తీరా మానవసేవ చేస్తువుగాని..." అంటూ నవ్వాడు. ఆ నవ్వు స్ఫుటంగా లేదు. ఎర్రబడ్డ మొగంలోంచి వెలువడ్డ ఆ నవ్వు మంగమ్మ బాధాపూరితహృదయానికి మరో బాణంగా తగిలింది. కాని ఆమె ఏమీ మాట్లాడలేదు. సహనమూర్తి అయిన పృథివిలా స్తబ్ధతతో అలాగే నిలబడింది.

"ఏమంటా వమ్మా"—హెచ్చరిస్తూ, బిగ్గరగా సత్యం అడిగిన ఆ మాటకు, హీనస్వరంతో "నీ యిష్టం" అని సమాధానం చెప్పింది మంగమ్మ.

ముందునవ్వులాంటిదే మరో సారి నవ్వాడు సత్యం, హుషారుగా మంచంమీదినుంచి. లేచి "నా యిష్టం గాకపోతే, మరొకళ్ళ యిష్టాయిష్టాలతో నాకు పనిలే దని నీకు తెలీదూ" అని చెప్పి, తొందరగా యింట్లోకి వెళ్ళాడు.

ఒక ట్రంకుపెట్టెను పట్టుకొని తిరిగి వెలుపలకు వచ్చాడు. మంగమ్మ ఆశ్చర్యంగా చూస్తూ "ఇప్పుడేనా వెళ్ళడం!" అంది.

"వెళ్లడానికి యెప్పుడైతేనేం!" అని సమాధానమిచ్చి, తల్లిమొగంలోకి చూస్తూ మెల్లిగా "నేను వెళ్ళడం నీకు సంతోషంగా వుంది కదూ!" అని అడిగాడు.

ఆమెమొగం క్షణంలో మార్పు చెందింది. సంక్షోభిస్తూన్న ఆమెహృదయగంభీరత కాస్తా సన్నగిలింది. మంగమ్మకళ్లలో నీళ్లు పరికించడం ఇది రెండవ మారు. తండ్రి అంత్యకాలంలో ఒకసారి, ఇప్పుడొక సారి. సత్యం ఆశ్చర్యచకితు డయ్యాడు.

మంగమ్మ దుఃఖాన్ని దిగమ్రింగుతూ "ఏ తల్లి అయినాసరే, కొడుకు యిల్లువిడిచి వెళుతోంటే సంతోషంగా వుంటుం దనే మాట కల్పితం బాబూ! నన్ను మాటలతో బాధపెట్టేదానికన్నా, నీ బాధకు నేను కారకురాలు కాకుండా చేసుకోవడం నీ కవసరం. ఒక అవసరాన్ని గుర్తించి ఇల్లు విడుస్తున్న నువ్వు రెండో అవసరాన్ని గుర్తించక పోవడం నాకు బాధ కలిగిస్తోంది నాన్నా!..." ఇంకా చెబుదామనే ప్రయత్నములో ఉండగానే, ఆమెకంఠం గద్గదికమైంది. ఇక చెప్పడానికి ఆమె ప్రయత్నం చేయలేదు.

సత్యం కొంతవరకూ యెదరకు వెళ్లాడు. కాస్సేపు స్తబ్ధతగా నిలబడి ఆలోచించాడు. వెనక్కి తిరిగి ట్రంకు ప్రక్కన పెట్టి, తల్లిపాదాలకు సాష్టాంగ పడి లేచాడు. అతని కళ్లుకూడా నీటితో చెమ్మగిల్లాయి. బాధామిళిత కంఠస్వరంతో "ఆడవాళ్లను అల్ప జీవులుగా యెంచిన ఈ సమాజం నీ స్వేచ్ఛను అపార్థం చేసుకునే మాట అబద్ధం కాదు. ఆ అపార్థాన్ని తృణంగా తీసివేయగల శక్తి నీ కున్నంతగా నాకు లేని మాట నిజం. అందుకే నేను నీకు దూరంగా ఉండాలని నిర్ణయించుకున్నాను." అని పైకండువాతో కళ్ళు తుడుచుకొని "నేను యెక్కడున్నా నీకు ఒక కొడుకున్నాడనే మాట మరచిపోవద్దు. అందరి కష్టాలకూ నువ్వడ్డుపడుతున్నప్పటికీ, నీ కష్టాల్లో కాపాడే వాడత డొక్కడే అనే మాట నీ దృష్టిలో ఉంచుకో. అవసరం వస్తే గాని, ఆపదలోగాని కబురు చేయి. నా కంతే చాలు." అని నెమ్మదిగా పెట్టె తీసుకొని, ప్రయాణం సాగించాడు.

మంగమ్మ వెళుతోన్న సత్యాన్ని చూస్తూ, ఉన్మత్త ఊర్ధ్వ శ్వాసను విడిచి "నీలాంటి కొడుకును గన్న అమ్మ చాలా అదృష్టవంతురాలు సత్యం" అని నెమ్మదిగా అనుకుంది.

మరునాడు మంగమ్మ బడ్డీ సరిది ఒక తీసె పొగాకు, ఒక అరటిపళ్ల గెలా కొని, అమ్మకం మొదలుపెట్టింది. 'మంచి పొగాకు కావాలంటే బాపిరాజు దగ్గరే కొనాలి' అనే పూర్వప్రతీతి మంగమ్మ యొక్క ఆ చిన్ని వర్తకానికి చాలా దోహదం చేసింది.

ఆమె కొన్న సరుకులన్నీ ప్రతిరోజూ సాయంత్రానికల్లా అమ్ముడుపోవడం మంగమ్మకు చాలా ఆశ్చర్యంగానే తోచేది. కొట్టు సరిదిన వెంటనే, భర్త ఛాయాచిత్రంయెదురుగా నిలిచి, చేతులు మోడ్చి, కృతజ్ఞతతో కూడుకున్న స్నేహార్ద్రప్రశాంతస్వరంతో "మీ రెక్కడున్నా, ఈ దీనురాలికేసి మీ నిర్మల దృష్టిని ప్రసారిస్తున్నా రని నాకు తెలుసు. అందుచే నాకు బాహ్య ఆధారం లేకపోయినా, అంతర్హితమైన

మీ సహాయసంపత్తికో నిలిచాను. ఎప్పుడూ మరొకరి ఆర్జనపై ఆధారపడి బ్రతికేట్లు చేయొద్దని నా ప్రార్థన" అనేది. ఇది ప్రతిరోజూ ఆమె జరిపే భర్తృ పూజా విధానంలో ఒక భాగం.

తనకు వచ్చిన ఆదాయంతోనే పొట్ట పోషించుకుంటూ, అవకాశం కల్గినప్పుడల్లా ఇరుగుపొరుగు వారికి సహాయపడుతూ, జీవితాన్ని నెట్టుకుంటూ వుంది మంగమ్మ.

మూడు మాసాలు గడిచిపోయినై.

ఒక రోజు మంగమ్మ పొరుగునవున్న భవానీ గారింటికి వెళ్ళి కూర్చున్నప్పుడు, మాటలసందర్భంలో సత్యం ప్రస్తావన తెచ్చి భవాని ఇలా అంది: "అందుకే సవతిబిడ్డంటారు. ఆమాత్రం జ్ఞానముండక్కర్లేదూ? కన్న తల్లే అయితే ఇలా విడిచి చక్కా పోతాడూ? మూర్ఖుడు"

ఈ మాటకు మంగమ్మ ఆనందపడలేదు. పైగా ఆమె శరీరంపై పెద్ద చరుపు చరిచినట్లుగా చలించి "సత్యం చాలా మంచివాడు భవానీ! అబ్బాయిని దూషించడమనేది పాపమని నా అభిప్రాయం" అని కాస్సేపాగి విస్ఫారితంగా ఆమెకేసి చూస్తూ "సత్యం నా ఇష్టంమీదే ఏదో నౌకరీకి వెళ్ళినప్పుడు, అబ్బాయి నన్ను చూడ్డంలేదనే నేరం మోపడం తెలివితక్కువకదూ భవానీ?" అని అడిగింది.

భవాని విహ్వలురాలైంది. మంగమ్మ అడిగిన దానికి సమాధానం చెప్పకుండా, తెరచిన నోటిని అలాగే వుంచి చూస్తుండగనే మంగమ్మ అక్కడనుంచి వెళ్ళిపోయింది.

పోగాకోసం వచ్చేవాళ్ళూ, మందులూ, శుశ్రూషలూ ప్రతిఫలశూన్యంగా మంగమ్మదగ్గరనుండి పొందేవాళ్ళూకూడా, మంగమ్మనిర్మలస్ఫటికహృదయంపై సత్యంచేసిన పని చాలా ద్రోహమనే మరకను స్పృశింపబోయారు. కాని, తాను ఇచ్చే తిరుగుసమాధానంతో ఉభయత్రా ఉండే మకిలిని మాయం చేసేది.

ఒక రోజున ఇంటికి తాళంవేసి, మంగమ్మ పేటలోకి వెళ్లేముందు, ఆ రాత్రిసమయాన పందిరలోకి ఎవరో వచ్చినట్లుగా గుర్తించి "ఎవరు వారు?" అని అడిగింది.

"మీరేనా, మంగమ్మగారంటే?"

"ఔను; ఏమిటీ పని?"

"సత్యంగారు, మీ రేలా ఉన్నారో మీ యోగక్షేమాలు తెలుసుక రమ్మన్నారు" అన్న ఆ అపరిచిత యువకుని మాటకు మంగమ్మ ఆనందానికి మేర లేదు.

వెంటనే తాళం తీసి, చిన్న తుంగచాప అరుగు మీద పరిచి "ఇలా కూర్చో నాయనా" అంది.

అతడు చాపపై కూర్చున్నతర్వాత, వికాసాన్ని వెల్లడిపరిచే మొగంతో చూస్తూ "అబ్బాయి రావడానికి వీలే లేకపోయిందా బాబూ?" అని అడిగింది.

"ఆయన రావడానికి ఎక్కడా తీరిక లేదండీ. నిన్ననే కలకత్తానుంచి వచ్చారు. నేను వారికొట్లో గుమాస్తాగా ఉంటున్నానండి...ఇది మీ కిమ్మని..." ఒక కాగితంపొట్లం ఆమెముందుగా పెట్టి "ఇచ్చారు" అన్నాడు.

ఆమె పొట్లం విప్పి చూసేలోగా, రెండు పది రూపాయలనోట్లు కూడా సత్యం ఇచ్చినట్లుగా చెప్పి మంగమ్మ కిచ్చాడు.

ఆమె వెంటనే ఏమీ సమాధానం చెప్పలేక పోయింది. ఆమె కళ్ళల్లో ఆనందబాష్పాలు నిలిచాయి. వచ్చిన గుమాస్తా మెల్లిగా లేచి అరుగు దిగాడు.

ఆమె భర్తఛాయాచిత్రంకేసి చూసింది. ఎందుకో ఆమెఅంతరాన సంకోచిక కదిలింది. వెళుతోన్న ఆ అబ్బాయిని తిరిగి పిలిచింది.

"అమ్మపై సత్యానికి వున్న అభిమానం నాకు తెలుసు. ప్రస్తుతం ఇది అనవసరం. అంతగా అవసరమొస్తే, అబ్బాయికన్నా నా కెవరున్నారూ? ఈ సంగతి సత్యానికి చెప్పు" అంటూ అవి తిరిగి గుమాస్తా చేతుల్లో పెట్టింది.

ఆడవాళ్లలో ఇలాంటి వ్యక్తు లుంటా రనే నూతనానుభవం పొందినట్లుగా మననం చేసుకుంటూ తిరిగి వెళ్ళిపోయాడు గుమాస్తా.

మఱునాడు మధ్యాహ్నం మంగమ్మ అన్నం తింటూండగా తలుపు తోసుకొని సత్యం యింట్లో ప్రవేశించాడు. అతని మొగం చూసిన మంగమ్మ ఆనందించవలసినది బదులుగా ఆశ్చర్యపడ్డది.

సత్యం కసీపూరితంగా నవ్వి "నీకడుపులో ఇంత కుళ్ళుందని తెలిస్తే, నువ్వు మంచి తల్లి వని అందరితోనూ చెప్పుకునేవాణ్ణే కాదమ్మా" అన్నాడు.

ఈ మాటలు వింటూనే, చేతులు కడుక్కోడానికి వెళ్ళి తిరిగివచ్చి "ఇప్పు డేమొచ్చిందీ?" అని అడిగింది.

"నేను పంపించినవి తిరిగి పంపివేయడానికి కారణం?"

"అవసరం గాని, ఆపదగాని వస్తే కబురుచేయు మని నువ్వేగా చెప్పింది. అలాంటి ఇబ్బంది పడకుండా, నిన్ను శ్రమపెట్టడం నా కిష్టం లేక తిరిగి పంపించాను."

ఈ మాటలకు సత్యం కొంత ఆలోచనలో పడ్డాడు. ఒక క్షణం ఊరుకొని, వ్యథితకల్పిత మందస్మితాన్ని ఒక్కసారి వెల్లడిచేసి "అలాంటి అవసరమొస్తే మాత్రం కబురు చేస్తా వని నమ్మక మేమిటీ?" అని అడిగాడు.

"ఏ జీవికీ అలాంటి అవసరం రాకూడ దని కోరడమే మంచిది బాబూ! మీ నాన్నగారు పెట్టిన ఆధ్యాత్మికశిక్షవల్ల నా కలాంటి అవసరం ఎప్పుడూ రా దనే నా నమ్మకం."

అతని అంతర్యంలో ఉన్న అహంకారానికి మంగమ్మమాటలు ఆజ్యపుబొట్టుల్లా పనిచేసినాయి.

"సరే! నా అవసరం లేకుండా నీవు జీవించ దలుచుకుంటే, నాకు చెందే ఈ యింట్లో వుండడం కూడా అనవసరమేగా—" అని రెండడుగులు ముందుకేసి, ఆగి, వెనక్కి తిరిగి "ఈ యింటిని నాన్న నీ పేర వ్రాసిపోలే దని గ్రహించు" అని గుమ్మం దగ్గరగా వచ్చాడు.

మంగమ్మ మొదట దిగ్భ్రాంతురాలుగా నిలబడి, అనంతరం సత్యంవెనకాలనే నడుస్తూ "నువ్వెల్లా కోరితే అలానే జరుగుతుంది. కాని, అన్నం తినకుండా పోవడ మేమిటీ?" అని అడిగింది.

సత్యం వెనక్కి తిరిగి ఓసారి చూశాడు. అతని కళ్లల్లో క్రోధం జ్వాలాయమానంగా పరిభ్రమించడం మంగమ్మ గమనించింది.

తల వంకిస్తూ కటుస్వరంతో—"నే - ను - తి - న్నా - ను" అని సమాధాన మిచ్చి వెళ్లిపోయాడు.

నాలుగు రోజులు గతించిన తర్వాత మంగమ్మ కబు రందుకొని సత్యం తిరిగి యింటికి వచ్చాడు. ఇల్లు చూచి మొదట చాలా ఆశ్చర్యపోయాడు. మంగమ్మ యింట్లో లేదు. ఇంట్లో ఒక వస్తువు కూడా లేదు. అతని అనుమానం స్థిరపడినట్లుగా నిర్ణయించిన మీదట అతని కళ్లల్లో నీళ్ళుకూడా తిరిగాయి.

వెనకనుంచి వచ్చిన మంగమ్మ రాకను అత నేమీ గుర్తించలేదు. ఆమె సుప్రశాంతవదనంతో సత్యాన్ని చూస్తూ "ఇంటితాళం నీ కిద్దామని కబురు చేశాను" అంది.

అత నేమీ మాట్లాడలేదు. గది మధ్యగా నేల మీద కూచొని, మంగమ్మకేసి అగమ్యంగా చూస్తున్నాడు.

ఆమె యిలా అంది: "అద్దెయిల్లు దొరక్క అవస్థ పడుతున్నట్లు విన్నాను. కోడలు కూడా పట్టి మనిషి కాదటగా! ఇక పరాయిఇంట్లో వుండి బాధపడేదానికన్నా ఈ యింట్లో వుండడమే ఎంతో మంచిది."

చూస్తుండగానే సత్యంకళ్ళు జలపూరిత మయ్యాయి. ఏమి మాట్లాడాలో అతని కర్థం కావడం లేదు. చీకటిలో ఉన్న అతని మొగాన్ని మంగమ్మ గుర్తించలేదు. మళ్ళీ ఆమె ఇలా అంది:

"నేను ఆపేట చివారున సూర్యకాంతంగారి వసారా అద్దెకు తీసుకున్నాను... నెలకు నాలుగురూపాయలు; పెద్ద అద్దెకాదు.... అఁ, ఏమిటదీ!" సత్యం కుదిల్లి ఏడుస్తున్నాడు. ఆ ఏడుపుధ్వని విన్న ఆమె దగ్గరగా వెళ్ళింది. అతని శిరస్సు స్పృశిస్తూ— "చంటిపిల్లాడులా అదేం పనీ? నాన్న జ్ఞాపక మొస్తేమటుకు, ఈ వయస్సులో అలా ఏడ్చేవాళ్లున్నారూ? తప్పు

బాబూ!" అంది. సత్యం, నేలమీదనుంచి లేచి, శైలధార లాగా కారుతోన్న కంటినీటిని తుడుచుకొంటూ "తప్పే నమ్మా! ఇకఎప్పుడూ నిన్నేమీ అనను." ఆమెపాదాలమీద వాలాడు. ఆమె లేవదీసి "దీనిలో నీ తప్పేముందీ?" అని అడిగింది. సత్యం గద్గదికంగా "ముమ్మాటికీ తప్పేనమ్మా! ఆవేళ ఏదో కోపంకొద్దీ అలా అన్నానుగాని, ఈ నీయింట్లో నేను ఒక్క క్షణం ఉండగలనా? అలా కుదరదు. ఆ సామాను తెప్పించుకొని, యథాప్రకారం ఉండు...ఇక పొరపాటుగా,నైనా నిన్నేమీ అననమ్మా" అంటూ ప్రాధేయతగా ఆమెకేసి చూశాడు.

మంగమ్మకళ్ళుకూడా నీటితో చెమ్మగిల్లాయి. "నువ్వన్నందుకు కోపంతో నేనా పనిచేయ లేదు బాబూ! ఈలాగనైనా మనం ఒక్క చోటలో ఉండి, కోడలినీ, నిన్నూ కళ్ళతో చూడగల అవకాశం లభిస్తుందని చేశాను...ఇక, నిర్ణయమైన తరువాత సామాను తీసుకురావడం బాగుంటుందా" అని సంశయంగా అతనికేసి చూసింది.

"నాకు తెలియకుండా ఒక్క పనికూడా చేయనిదానవు నువ్వీనాడు ధైర్యం చేయడానికి మనస్సెలా ఒప్పింది......నీకు చేతగాకపోతే, ఆ సామాను నేను తీసుకువస్తాను" అంటూ అతను తొందరగా వీథిలోకి వెళ్ళిపోయాడు. ఆమె రెండుకళ్లూ తుడుచుకొని ఒక్కసారి తనలో నవ్వుకుంది.

ఒక బండి మాట్లాడి, వసారాలోని సామానులు బండిమీద వేయిస్తున్నాడు సత్యం. ఇంట్లో ఉన్న సూర్యకాంతం వెలుపలకు వచ్చి ఆశ్చర్యంగా చూస్తూ "అదేం పనీ సత్యం?" అని అడిగింది. "ఏముందీ? మాఅమ్మ మీయింట్లో అద్దెకు ఉండవలసిన దుర్గతేమీ రాలేదు......మీరంతా కలిసి, మాఅమ్మను నాకు దూరం చేయాలని ప్రయత్నం చేసినా, ఆమెకు నేను దూరం కావడం కష్టం" అని బండెక్కాడు.

"అయితే నువ్వన్నది సొంతయింట్లోనేనా?" అని ఆమె అడిగింది. ఆ మాటకు ఏం సమాధానం ఇవ్వాలో సత్యానికి తెలియలేదు. ముఖంపై అస్పష్టమైన అంధకారం అలుముకుంది. ఆమెకేసి ఒకసారి ముఖం చిట్లించి చూసి "నువ్వడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పేరోజు రాకపోదు" అని, బండివానితో "బండి పోనియ్యి" అన్నాడు. బండి కదిలింది.

వెళుతున్న బండికేసి చూస్తూ సూర్యకాంతం "అవ్వ!" అని నోరొకసారి నొక్కుకుని "ఇదెక్కడి విడ్డూర మమ్మా!" అనుకుంది.

సామాను యథాప్రకారం ఇంటికి చేర్చి, మంగమ్మదగ్గిర సెలవు తీసుకొని తన కాపురమున్న గాంధీనగరం చేరుకున్నాడు సత్యం.

ఆరాత్రి సత్యం మాటలమధ్యలో భార్యదగ్గిర ఒక విచిత్రమైన సంభాషణ తెచ్చాడు.

"ఈ అద్దెకొంపల్లో ఉండేబదులు ఇల్లు కొస్త బాగుచేసి అక్కడికి పోతేనే బాగుండేటట్లు తోస్తోంది" అన్నాడు.

"మీ యమ్మో?"

"మన దగ్గిరే ఉంటుంది"

"మళ్ళీ ఈ ఆలోచన ఎప్పటినుంచీ?" అని సుబ్బాయమ్మ కొద్ది కోపంతోనే అడిగింది.

"ఇదెప్పుడూ ఉన్న ఆలోచనే" అంటూ పందిరమంచం టాపుకేసి చూస్తూ "ఆడదాని మాట విని అప్రయోజకత్వం వహిస్తేమాత్రం...అది గుర్తించగల లోకు లుండరూ? సరే..." అంటూ మంచంమీద పడుకున్నాడు.

బల్లమీద కూర్చున్న సుబ్బాయమ్మ లేచి, అటు తిరిగి పడుకున్న భర్తశరీరాన్ని తీక్ష్ణంగా చూస్తూ "నాతండ్రిది పరువుగల కుటుంబ మనే సంగతి నే నెప్పుడూ మరిచిపోను. సిగ్గు లేనివాళ్ళ సంబంధం అందుకున్నందుకు మా నాన్న ఇప్పటికే సగం చావడమైంది. అడదై, అందులోనూ విధవైన స్త్రీ సిగ్గూ శరం లేకుండా తిరిగే ఆవిణ్ణి నా అత్తగా రని ఏ నోటితో చెప్పుకోవాలో నా కర్థంకావడం లేదు..." అ మాటని, గర్వసూచకంగా సుబ్బాయమ్మ నవ్వింది.

—సత్యం చటుక్కున మంచంమీదినుంచి లేచాడు. "నీకు ఆడదాన్ననే స్పృహ ఉంటే, నేను

పెళ్ళాన్ని విడచడంకూడా నీ ధర్మమేకదూ?" అని అడిగాడు.

"మీ అరచేతల్లో ప్రాణాలను అర్పిస్తాగాని, ఆమె ఉండగా ఆ యింట్లో కాలు పెట్టను."

తిరిగి అతను పడుకున్నాడు.

ఆడవాళ్ళలో కొందరు పుట్టింటి దగ్గర్నుంచి తీసుకవచ్చే వస్తుసముదాయంలో కనుపించని, కర్కశమైన ఈ స్వాభిమాన మనే వస్తువును కూడా తీసుకువస్తారు....ఆ కనుపించనిదాన్నయినా పరుల కనులకు స్పష్టపరచేందుకు తమ పుట్టింటివారి ప్రతిభను వేనోళ్ళ చాటి, తమ అత్తవారి వ్యక్తిత్వాన్ని దాని ముందు తృణమని వర్ణించక పోయినా, ఆ భావం వచ్చేట్లుగా మాట్లాడ్డం చాలామందికి ఎలా అలవాటో సుబ్బయమ్మకు కూడా అదే అలవాటై ఉరకుంది.

కనుపించని ఆ స్వాభిమాన కఠోరహస్తాల్లో ఎన్ని మానవజీవులు ప్రగ్గి అజ్ఞానాంధకారంలో క్రుంగి పోతున్నాయో, ఈ సత్యాన్ని ఉదాహరణగా తీసుకుంటే చాలననుకుంటాను.

ఆధిక్య మనే ప్రతిదానికి గర్వభంగ మెలా సహజమో, ఈ ఉద్రేకంతో కూడిన స్వాభిమానానికి కూడా శిరం వంచగల స్థితి స్త్రీజాతికికూడా అప్పుడప్పుడు కలగడమున్నా అలా అసహజం కాదనుకొంటాను.

రెండువారాలు గడిచిన తర్వాత సత్యం తల్లిని చూడ్డానికి వచ్చి "దాన్ని పుట్టింటికి పంపేశాను" అని చెప్పాడు.

మంగమ్మ భయభ్రాంతంగా చూస్తూ "ఇప్పుడు పంపవలసినంత అవసర మేం వచ్చిందీ?" అని అడిగింది.

"వాళ్ళ నాన్నకు రెండు రోజులనుంచి జ్వరం కాస్తోందట!"

"ఏం జ్వరం?"

మంగమ్మ ఇలా అడగడంలో అర్థముంది. ఒక వారం రోజులనుంచి, అక్కడక్కడా మశూచి వ్యాధి అంకురిస్తూ, కొందర్ని తనలో ఐక్యం చేసుకోవడం ప్రారంభించింది. కాస్సేపు ఉదాసీనంగా చూసి—

"ఏమో!" అని సమాధానం ఇచ్చాడు.

"అంత అవివేకంగా ఉంటే సంసారాన్ని ఎలా దిద్దుకుంటావ్?...వట్టి మనిషి కాదుగా. ఈ రోజులు ఎలాంటివో తెలుసా?"

సత్యం ఏమీ మాట్లాడలేదు.

"వెంటనే వెళ్ళి, ఆ జ్వరానికి ఎలాంటి సూచన లున్నాయో తెలుసుకొని...కోడల్ని అక్కడనుంచి తీసుకొచ్చేయ్...అంతగా అతనికి శుశ్రూష కావాలంటే నేను చేస్తాను."

సత్యం విభ్రాంతుడై కాస్సేపు నిలిచి, తిరిగి జగన్నాథపురం వెళ్ళాడు.

సత్యం మామగారింటికి వెళ్ళేసరికే అది మశూచి జ్వరంగా నిర్ధారణ అయిపోయింది.

ఆ ప్రక్కింటి ఆడమనిషి మూడురోజులక్రితమే ఆ వ్యాధికి బలిఅవడం ఆ ఇంటిల్లిపాదికీ తెలుసు.

సత్యం మామగారిని చూడ్డానికి వెళ్ళాడు. అప్పటికే అతని శరీరంమీద అక్కడక్కడా బొటిమలు లేచాయి.

అల్లుణ్ణి చూసి కళ్ళ నీళ్ళు తెచ్చుకొని "ఇక నేను బ్రతకటం కష్టం. ఈ కుటుంబాన్ని ఎలా కాపాడుతావో!" అని దుఃఖించాడు.

సత్యానికి అత్తగారేగాక ఇద్దరు మరదళ్లు, ఒక పాలుత్రాగే కుర్రవాడూ ఉన్నారు. "పాపం, నిజమే" అనుకున్నాడు మనస్సులో సత్యం.

గది దాటి వెలుపలకు వచ్చాడు.

సుబ్బాయమ్మ వచ్చి "మిమ్మలను మా అమ్మ పిలుస్తోంది" అని ఆతృతగా అంది.

సత్యం ఆ వైపుగా వెళ్ళాడు. తలుపుచాటు నుండి అత్తగారి కంఠస్వరం దుఃఖపూరితంగా ఇలా వినిపించింది: "అమ్మాయి వట్టిమనిషి కాదు. మేమంతా ఆడవాళ్ళం...ఆయన ముఖం చూసే ధైర్యం కూడా మాలో లేదు. మీ రొక్కడికే వెళ్ళడానికి వీలులేదు."

అత్తగారి మాట సత్యం కాదనలేకపోయాడు. సత్యం వెళ్లిన రెండోరోజున, సుబ్బాయమ్మ భర్తను రహస్యంగా పిలిచి "మీరుమాత్రం ఇక్కడెందుకూ! ఎటు తిరిగి ఎటొస్తుందో! మీ యమ్మదగ్గరకు వెళ్లండి" అని హితోపదేశం చేసింది.

మనస్సులో నవ్వుకొని పైకి నిర్లక్ష్యంగా— "నా కా భయం లేదులే"అన్నాడు.

మరునాడు రాఘవయ్యపరిస్థితి కాస్త క్లిష్టంగానే ఉంది. బొబ్బలు పెద్దవయ్యాయి. ఆడవాళ్లు అతన్ని చూడడానికే భయకంపితులౌతున్నారు. అతనికి తగిన శుశ్రూష చేసే బాధ్యత సత్యమే తీసుకున్నాడు.

సత్యంఅత్తగారు సత్యానికి కబురు చేసింది. సత్యం వచ్చి గుమ్మందగ్గిర నిలబడ్డాడు. తలుపు చాటునుండే ఆమె రోదనస్వరంతో "నాకేం మతి లేదు బాబూ! పిల్లలతో ఈ ఇంట్లో ఉండడమే చాలా భీతిగా ఉంది" అని అంది.

తలుపుకేసి ప్రశ్నార్థకంగా చూస్తూ "ఏం చేదామని ఆలోచించారు" అని అడిగాడు సత్యం.

"నర్సాపురంలో మా మేనత్తగారిల్లుంది. అక్కడకు వెళితే?"

"ఎవరూ ? "

"పిల్లలూ, నేనూ."

రెట్టించిన ఆశ్చర్యంతో చూస్తూ "ఇక్కడెవరుంటారూ ? " అని దృఢంగానే అడిగాడు సత్యం. ఈ మాటకు ఏమి సమాధానం చెప్పాలో అత్తగారికి అవగాహనకాక అడ్డుగా ఉన్న తలుపుకేసి చూస్తోంది. ఈ సంగతంతా విన్న సుబ్బాయమ్మ భర్త ఎదురుగా వచ్చి, ప్రక్కగా తల తిప్పి తల్లికేసి చూస్తూ—

"ఇంత పెద్దదాన వయ్యావండి, ఏ విధంగా మాట్లాడాలో తెలీ దేమిటమ్మా! " అంటూ భర్తకేసి తిరిగి, "అది కాదండీ! నన్నూ, మిమ్ములనూ ఇక్కడుంచి, నర్సాపురం వెళ్ళి పిల్లను వప్పచెప్పి తిరిగి వస్తుందట" అని చెప్పడంలో అసలు తల్లి ఉద్దేశాన్ని ఏ విధంగా మధ్యపెట్టిందో గ్రహించిన సత్యం వెటకారంగా "అదా విషయం! అయితే సరే" అని కాస్త రాగం తీసి, కళ్లు త్రిప్పి లోపలకు వెళ్ళిపోయాడు.

"మీ సత్సంప్రదాయంలో ఉండే బండారం కాస్తా బైటపడింది" అనే భావం వచ్చేటట్లుగా పెట్టిన భర్తముఖభంగిమ గమనించి, మొదట మందాహాభినయం చేసి చాటుగా తల్లిని చివాట్లు పెట్టింది.

నూరమ్మ పిల్లలను చంకను వేసికొని గుమ్మం దిగే సమయంలో మంగమ్మ ఎదురైంది. మొదట ఆశ్చర్యంగా ఒకళ్ల నొకళ్ళు చూసుకున్నారు.

"ఎక్కడికే ప్రయాణం ?"అని అడగా లనుకుంది మంగమ్మ. ఎక్కడికైనా ప్రయాణమటుకు నిజమని నిర్ధారణ చేసుకున్న మీదట—

"అన్నాయి కెలా ఉందీ ?"అనిమాత్రం అడగగలిగింది.

ఆమాటకు నూరమ్మ సమాధానం ఏమీ ఇవ్వలేక పోయింది. బిత్తరి చూపులు చూస్తూ మెట్లు దిగింది. మంగమ్మ మెట్లు ఎక్కుతూ వెనక్కి తిరిగి నూరమ్మ కేసి చూసింది. నూరమ్మముఖంలో దైన్యం వివిధ రూపాలుగా వ్యక్తం కావడంవల్ల మంగమ్మ మాట్లాడ లేక పోయింది.

గుమ్మందగ్గరగా ఉన్న సుబ్బాయమ్మ అత్తగారి రాక గమనించి, తండ్రిదగ్గ రున్న సత్యందగ్గరగా వచ్చి తల్లివచ్చినసంగతిచెప్పడంవల్ల, సత్యం పరాచరి వీథి గుమ్మందగ్గరగా వచ్చి "ఎందు కొచ్చా వమ్మా?" అని కఠినంగా పలకరించాడు.

సుబ్బాయమ్మ తలుపుచాటునుండి తల్లీ కొడుకుల సంభాషణ వింటోంది.

వచ్చిన చుట్టాన్ని సత్కరించే విధానం సత్యానికి ఇంతకన్నా మించి తెలీదనే సంగతి తెలిసిఉన్న మంగమ్మ ఆమాటకు ఏమీ కష్టం కలిగించుకోకపోగా, ప్రశాంతంగా నవ్వి, మార్దవ కంఠస్వరంతో ఇలా అంది: "నే నెందుకొచ్చానో నా కన్న ఎక్కువగా నీకు తెలుసు" అంతటితో ఆగి, నెమ్మదిగా "నేను నీతో ఏమి చెప్పిపంపాను ? నువ్వు చేసిన ప నేమిటి?" అంది.

ఈ మాటకు సత్యం బిగ్గరగా నవ్వి "పిచ్చితల్లీ!" అని లోపల నెమ్మదిగా గొణుక్కొని, "ఆయనకు చాలా ఎక్కువగా ఉందమ్మా! నా అనేవాళ్లే విడిచి పారిపోతోంటే ఆయనకు లేం కాను ?" అన్నాడు. ఈమాట ఎవరినిగురించి భర్త అన్నాడో సుబ్బాయమ్మకు తెలుసు. ఈ మచ్చ జీవితాంతంవరకూ నిలిచి తన్ను ఎంతగా అవమానంతో క్రుంగజేస్తుందో గ్రహించిన సుబ్బాయమ్మ ఏమీ మాట్లాడలేక పోయింది.

మంగమ్మ రాఘవయ్య ఉండే గదిలో ప్రవేశించింది. కిటికీలు బిడాయించి గదంతా చీకటిమయంగా ఉంది. వెగటు గలిగించే గబ్బువాసన కొడుతోంది. ఆమె గదిలో కాస్సేపు నిలిచినమీదట రాఘవయ్య అస్పష్టంగా, అనాకారిగా మంచంమీద కనుపిస్తున్నాడు.

"అన్నాయ్ !" దగ్గరకు వెళ్ళి పలుకరించింది మంగమ్మ. హీనస్వరంతో "ఎవరూ ?" అన్నాడు రాఘవయ్య.

సుబ్బాయమ్మ అభిమానంతో తలవంచుకొని "అత్తగారు" అని సమాధాన మిచ్చింది. బొబ్బలుతేరిన కనురెప్పలు బరువుగా పైకెత్తి "మంగమ్మా!" అన్నాడు.

హఠాత్తుగా ఉద్భవించిన ఆశ్చర్యప్రకటనార్థం అన్న ఆ మాటలు సత్యంఅపార్థానికి కారణం కావడంలో ఆశ్చర్యం లేకపోయింది. కటుస్వరంతో "అపత్కాలంలో అడ్డుపడేవాళ్లకు మీ రిచ్చే అవమానకరమైన బిరుదు అమ్మకు తెలీదు తెండి... తెలిసుంటే ఆమె వచ్చేదే కాదు" అన్నాడు సత్యం.

రాఘవయ్య జాలిగా అల్లుడికేసి చూస్తూ "ఇప్పుడా నన్ను బాధపెట్టడం ?" అన్నాడు.

పనిలేనివాళ్లకు చేతినిండా పని దొరికినప్పుడు చూపే పనితనం, దానితోబాటు వచ్చే ఆనందం, తృప్తీ మంగమ్మ అనుభవిస్తోంది.

'రోగిగది ఎలా ఉండాలి' అనే ప్రాథమిక సూత్రం కూడా సత్యం గ్రహించలేనందుకు మంగమ్మ ఆశ్చర్యపడ్డది.

కిటికీ లన్నీ తెరువబడ్డాయి. సమీరుడు సంతోషంగా గదిలో ప్రవేశించాడు.

రసితో మచ్చలతో నున్న బట్టలు స్వహస్తంతో తీసిన మంగమ్మ, ఆ స్థానే ఉతికిన బట్ట లుంచి, శుభ్రత వ్యక్తంచేసే సూక్ష్మమైన పద్ధతిని దగ్గరున్న కొడుక్కి చూపింది.

గదంతా సాంబ్రాణి, అగరువత్తుల పొగతో నింపింది. భర్త తన కిచ్చిన వరంలా పూజిస్తోన్న కొన్ని వనమూలికల శక్తి పరీక్షించే సమయం ఇదిగానే ఆమె భావించి కొంతగా తగ్గుస్థితికి వచ్చినతర్వాత ఒక చెట్టు ఆకురసాన్ని అతని శరీరానికి తాకించి, విసనకర్రతో విసురుతూ, దిన మెల్ల శుశ్రూష చేసింది.

తల్లి రావడంవల్ల సత్యంహృదయం తేలికపడ్డది. తల్లికి కావలసిన వస్తువులు ఇవ్వడంతప్ప చికిత్సాబాధ్యత నుండి సత్యం తప్పుకున్నాడు. ప్రతినిముషం వచ్చి భర్తను పలకరించే సుబ్బాయమ్మ అతని దృష్టికి కాస్త దూరంగా ఉండటానికి ప్రయత్నం చేస్తోంది. అది గ్రహించిన సత్యం ఆమెను పలుకరించి అంతరంగికమైన ఆమెఅభిమాన తెరను తూట్లుపరచడానికి ప్రయత్నం చేయడం లేదు.

మంగమ్మంటే వింతమనిషిగా భావించిన సుబ్బాయమ్మ 'వింత'అనే పదాన్ని దేవతగా మార్చు చేసుకుంది.

మంగమ్మకు దేవతాత్వాన్ని ఆపాదించడం ఉత్ప్రేక్షగా మాత్రం సుబ్బాయమ్మ భావించలేదు.

మంగమ్మప్రశాంత వదనాన్ని పరిశీలించిన ప్రతి ఒక్కరికీ ఆ భావం తప్పక కలుగుతుందనే నమ్మకం సుబ్బాయమ్మకు స్థిరపడి ఊరుకుంది.

సుబ్బాయమ్మ తండ్రిగదిలోనుంచి రావడం పూర్తిగా నిషేధింపజేసింది మంగమ్మ. తాత్కాలికంగా సుబ్బాయమ్మకు ఆ ఉదాసీనత బాధ కలిగించినా ఆమె ఎందుకు తన్ను నిషేధించిందో తెలిసినమీదట సంతృప్తిగా నిట్టూర్చి ఊరుకుంది.

మంగమ్మ వచ్చి నాలుగురోజులు గడిచింది. నానాటికీ నిద్రమాలిన మంగమ్మ శుశ్రూషచెయ్యడం, రాఘవయ్య తేరుకోవడం జరిగింది. ఉదయాన్నే రాఘవయ్య గదిలోనుంచి వచ్చిన సత్యం భార్యకేసి చూస్తూ "నక్కతోక్కెట్లో బడ్డకొట్టాడు మీనాన్న" అన్నాడు. ఆ వ్యంగ్యానికి అర్థమేమిటో సుబ్బాయమ్మకు అర్థం కాలేదు.

"ఏమిటి మీరనేది ?"—ఆత్రంగా అడిగింది.

"రోగం దిగమారింది."

"నిజం !" నోరు పెద్దది చేసి, కళ్ళు విశాలం చేసి, ఆనందం తీరా ప్రశ్నించింది సుబ్బాయమ్మ.

"నమ్మకం చాలకపోతే వెళ్ళి చూడరాదూ ?" అని నెమ్మదిగా వీధిలోకి వెళ్ళాడు సత్యం.

సుబ్బాయమ్మ గదిలోకి ప్రవేశించేసరికి మంగమ్మ రాఘవయ్యపాదాలచెంత కూర్చొని, వినవక్రతతో విసురుతోంది. ఆమెనేత్రాలు ధ్యానప్రపూర్ణంగా అర్ధనిమీలితంగా రాఘవయ్యశరీరంపై ప్రసారితమైనాయి.

"అత్తాయి !"

ఈ పిలుపు మంగమ్మ కంత వినపడ లేదు. వినగల అర్హత పొందగలననే భ్రాంతికూడా లేదేమో. ఆశ్చర్యంగా తల తిప్పి చూసింది.

"నాన్నకు పొక్కులు దిగమారాయటకదూ ?" అని అడిగింది సుబ్బాయమ్మ.

"ఔనమ్మా" అని మెల్లిగా సమాధానం చెప్పి "నిన్ను ఇక్కడకు రావద్దని చెప్పడం మరిచావా ?" అని అడిగింది మంగమ్మ.

సుబ్బాయమ్మ తిరిగి వెళ్ళిపోయింది.

ఆ మధ్యాహ్నం భర్త భోజనము చేస్తూండగా సుబ్బాయమ్మ "అత్తాయికి రేయింబవళ్లూ నిద్దుర లేదు. ఈ వేళయినా ఆమె విశ్రాంతి తీసుకోకూడదూ ?" అంది.

అత్తగారిపట్ల జనించిన ఈ అసమాన సానుభూతికి కారణం ఏమిటో సత్యానికి గ్రాహ్యమైంది. ఇది తాత్కాలికం కాదని నిర్ధారణ చేసుకున్నమీదట చిరునవ్వే దానికి సమాధానంగా ఇచ్చి ఊరుకున్నాడు.

రాఘవయ్యకు స్నానమైందని తెలిసిన మీదట మారమ్మ బిడ్డలతో తిరిగి జగన్నాధపురంలో స్వగృహానికి చేరుకుంది.

ఆనాడు మంగమ్మ తప్పితే ఎవరూ అంతగా యిష్టంగా ఆమెతో మాట్లాడకపోవడం మారమ్మకు చాలా కష్టంగానే ఉంది. కాని దానికి కారణాన్ని ఊహించిన మీదట తన పిరికితనానికి ఎక్కువగా సిగ్గుపడింది.

మంగమ్మ ప్రయాణమై రాఘవయ్యదగ్గర శెలవు తీసుకోడానికి వచ్చింది.

ఆమెరాక గమనించిన రాఘవయ్య స్నేహపూర్ణకంఠస్వరంతో "నీ ఉపకారాన్ని మరువలేను చెల్లాయి ! నాకు ప్రాణదానం చేసింది ఎవరని ఎప్పుడైనా ఎవరైనా అడిగితే, 'పిరికిపందకాని నా మంగమ్మ చెల్లాయి' అని చెప్పగల ధైర్యం నిచ్చావ్ ! నాకు అంతే చాలు. ఆడవాళ్ళు అబల లనే మాట ఎంతవరకు నిజమో నేను చెప్పలేను. కాని అబలాత్వమే నైచ్యమైన పిరికితనంగా అర్థంచేసుకున్న నా భార్యమాత్రం నీ కాలిగోటికికూడా పోల దనే మాట సత్యం !" ఆఖరిమాటలు అంతరంగికంగా గూడుకట్టుకొన్న అతని కసినంతా వెళ్లడి చేసినట్లుగా పళ్ళసందునుంచి ధ్వనించినై.

మంగమ్మ నవ్వింది. ఆ నవ్వు విని రాఘవయ్య ఆశ్చర్యంగా ఆమెకేసి చూశాడు.

"మానవుల హృదయంలో మా ర్పనేది ఎప్పుడు కలుగుతుందో, ఇప్పుడే గ్రహించాను. కాని నేను చేసిన శుశ్రూష మరొకళ్ళను నీచపరచడానికీ, నేను ప్రత్యేకత పొందడానికీ అనే అపార్థాన్ని మాత్రం తీసుకోవద్దు". కాస్సేపాగి నెమ్మదిగా నవ్వి "బ్రతకాలనేవాళ్ళు భయంకరమైన రోగానికి బెదరడంలో తప్పు లేదు" అని అర్ధనిమీలితంగా ఆకాశంకేసి చూస్తూ "వారితోపాటే చచ్చిన నా శరీరానికి మాత్రం భయం లేదనీ, సారహీనమైనదనీ తెలిసిన మీదటే వారి ఆదేశాన్ని నేను ఆచరిస్తున్నాను." అని చెప్పింది.

రాఘవయ్య మొగాన్ని సిగ్గుదొంకర్లు కప్పి శాయి.

మంగమ్మ నమ్మకం దిగేలోపల సబ్బాయమ్మ దగ్గరగా వచ్చి "అత్తాయి! నేనూ కూడా వస్తున్నాను" అంది.

"ఎక్కడికీ ?"

"మనింటికి"

ఆప్యాయంగా ఆమెశిరస్సును హృదయానికి కద్దుకుంది మంగమ్మ.

స్తంభానికి జేరబడి నిలుచున్న సత్యం తృప్తిగా నిట్టూర్పు విడిచాడు.

ఆ రోజునే సవతి కొడుకుతో స్వగృహానికి చేరుకుంది మంగమ్మ.

---

# హాఫీజ్ గీతికలు

## — శ్రీ కృత్తివాస తీర్థులు —

౧

ఆగలేనే సఖి, ఆసవ మ్మాసవము
అందులకె యీ తపన ఆసవమ్మాసవము!
ఏ నెటుల సహియింతు నీ చిత్రవిరహార్తి
ఎవరు గ్రహియించెదరు హృదయాంతర
వ్యథను! ...ఆసవ

ఆసవము ప్రేయసీ, అంగారుణ నవము
నింపుమా యెదనిండ కెంపుతళతళ మదిర
...ఆసవ

నీ మోవి కెంజాయ నింపార దిశలెల్ల
నీ దరస్మితరుచులు నింగి వెన్నెలకాయ
...ఆసవ

కటిమేఖలా ఘుంఘులశింజితావళుల్
నా జీవన ప్రాంగణమ్మునన్ నింపార...ఆసవ

మూర్ధగుమ్మా, నీదు ముంగురుల వాసనలు
హరియించినవి సుమీ యామినీ పవనములు
...ఆసవ

౨

నీమనసు హాఫీజా, నిజముగా మలినమ్ము!
మలినమ్ము చేయగా వలదు సఖివదనమ్ము.
మాధ్వీకమే లేని మధుపాన మింకేల?
గండస్థలము లేని క్రమానిల మ్మేల?
ఆలింగనము లేని ఆకార మెందులకు?
...నీమనసు...

అమృతమ్ము చిందు నీ యరుణాధరోష్ఠమ్ము
పరభృతము పాడగా ఫలవంత మాజమ్ము
స్వాంతమ్ము మూర్తించు స్వప్నాలు వమ్మ
గను...నీమనసు...

ప్రణయినీ హీనమౌ భావమ్ము వృథ యగును
మధువనం ప్రభవించు మధురిమోద్గారమ్ము
జవ్వనంబును గాంచు జరఠవిపినము లేని
...నీమనసు...

---

# విజయనగర సామ్రాజ్యము - చరమదశ

— శ్రీ నేలటూరి వెంకటరమణయ్య —

'ఫర్దరు సోర్సెస్ ఆఫ్ ది విజయనగర హిస్టరీ' అను గ్రంథమును రచించు సందర్భమున నాకు అందుబాటున లేని చరిత్రాంశములను కొన్నింటిని శ్రీ ఆచార్య కె. ఎ. నీలకంఠశాస్త్రిగారు డచ్చి ఫాక్టరీ దినచరి పుస్తకముల నాధారపఱచుకొని ఎమ్. మెక్లాడు అనునతడు రచించిన 'డి ఓస్ట్-ఇండిషెకంపెనీ అల్స్ జీ మొగెన్డ్ హైడ్ ఇన్ ఆజీ' అను చరిత్రగ్రంథమునుండి నా యుపయోగార్థము విజయనగరచరిత్రకు సంబంధించిన విషయములను సంగ్రహముగ నాంగ్లభాషలోని కనువదించియిచ్చినారు. ఇందు విజయనగరచరిత్రను పరిశోధించువారికి ఉపయుక్తములగు చరిత్రాంశములు పెక్కు కానవచ్చుచున్నందున శ్రీ నీలకంఠశాస్త్రిగారి యనుమతిపై వారు తయారుచేసియిచ్చిన నోట్సును యథామాతృకముగా తెనుగుసేయుచున్నాడను.

సం. ౧. క్రీ. శ. ౧౬౦౨-౩౨.
కోరమండల్ (చోళమండలము):
౧౬౦౮-౧౦ (పు. ౭౯-౯౭)

౩౦. నవంబరు ౧౬౦౮. తేవాంపట్టణమున వర్తకముసేయుటకును, అచట పోర్చుగీసువారిదగు ప్రాత కోటయందు కర్మాగారు (వర్తకస్థానము) స్థాపించుటకును డేవిడ్. డి. కెట్రె జింజిదుర్గాధిపతి కడనుండి యనుమతి గొని కౌలునుపొందెను.

క్రీ. శ. ౧౬౧౦. జింజినాయకుడొసగిన ౧౦౫ × ౭౫ అడుగుల వైశాల్యముగల భూమిపై తిరుపాపులియూరను గ్రామమున ఫాక్టరీస్థాపన. పోర్చుగీసువారి వైరముచే ఫాక్టరీలో నంతఃకలహములు.

౧౫. ఏప్రిలు క్రీ. శ. ౧౬౧౦. జింజినాయకుడును, ఆరెంట్ మెర్రెట్స్, ఫాకైర్ అనువారు సమ్మతించి చేవ్రాలు చేసిన యొడంబడిక. ఈ యొడంబడికను దృఢపఱచుకొని శ్రీగంధముతోటి రాజహస్తముద్రను వేయించుకొని వచ్చుటకు, ఏప్రిలు ౨౦ తేదీ నాడు ఏడ్రిఅన్ మార్సెల్లిస్ ఫాకైరు వేలూరునకు కర్ణాటకచక్రవర్తియైన వెంకటపతి (ఇమ్మడి వెంకటపతిరాయలు. క్రీ. శ. ౧౫౮౬-౧౬౧౪) కడ కంపబడెను.

౨౪. ఏప్రిల్, క్రీ. శ. ౧౬౧౦. కళ్ళికోట సామూద్రికి సందేశము.

౧౬ మే, క్రీ. శ. ౧౬౧౦. వెంకటపతిచే దృఢపఱచబడిన యొడంబడికయు, మార్ట్జ్ అనువాని తన సముఖమున కంపవలయు నను వర్తమానమును వచ్చి చేరుట.

౨౧. మే, క్రీ. శ. ౧౬౧౦ మార్ట్జ్ ఫాంకైరులను వేలూరునకు బంపుట.

౩౦. మే, ౧౬౧౦. వీరు కావేరిపాకలో గొన్ని దినము లాగినపిమ్మట వేలూరిలో రాయల సందర్శనము. వీరి యత్నమును సాగనీయక భంగపఱచుటకు పోర్చుగీసువారు చేసిన యెత్తుగడలన్నియు వ్యర్థములాయెను. నాయకుడు (రాయలు) పులికాటు విషయమై తానిచ్చిన మాటను నిలబెట్టుకొనెను. పులికాటులోని కష్టము లన్నియు డచ్చివారి నచటినుండి తఱిమివేయుటకు పోర్చుగీసులు చేసిన కుట్రలవలననే కలిగినవి. మార్సెల్లిసు ఫాంకైరులు నాయకుని

కొక్కనికి మాత్రమే కాక, పులికాటకని తల్లికి చెందిన దగుటచే నామెకుగూడ కానుకల నంప నిశ్చయించుకొనిరి. ఇంతకు గొన్ని దినములకు ముందు జింజి నాయకున కిచ్చెదమని వీరు చెప్పియుండిన కందిదేశపు ఏనుగులు రెండుగూడ నీ కానుకయందు జేరియుండినవి. ఇవి వేలూరునకు ఆగస్టు ౧౯ వ తేదిన పోయి చేరెను; రాజప్రాల్యులనికిని, సేనాపతికిని గలిగిన పోట్లాటకారణమున వీరి (మార్సెల్లిస ఫాంబైకుల) ప్రవాసము దీర్ఘతరమాయెను. నాయకుని(రాయల)చే ప్రతిపత్తులు సమాధానపఱుచబడిరి. తరువాత సెప్టెంబరు ౧ వ తేదీనాడు పై చేర్కొనబడిన డచ్చివారు అందరేమలతోడను, ముద్రికాదులతోడను విశేషముగ గౌరవింపబడి మరలిపో ననుజ్ఞాతులైరి; మఱియు వారు చెల్లించవలసిన సుంకము నూటికి ౨౪ నుండి ౧౪ కు తగ్గింపబడెను. వేలూరులో ఒబ్బరాజను దళవాయి పులికాటునది కట్టుగొమ్మ సమీపమందుండిన అసె కట్టూరను గ్రామమున నూటికి ౪ సుంకమిచ్చి వర్తకము నడపుకొను హక్కు నిచ్చెను. డచ్చివారిద్దరును వేలూరునుండి సెప్టెంబరు ౨౬ వ తేదీనాడు బయలుదేరిరి. ఇంతలో (ఆగస్టు ౨ తేదీనాడు) జింజి నాయకుడు ముందు తన కిచ్చెదమని డచ్చివారు మాటయిచ్చిన యేనుగులను రెంటినిగాని, లేక వాని వెలకు సరియైన బంగారమునుగాని దన కియ్యవలసినదని పట్టుబట్టెను.

## కోరమండల్ : ౧౬౧౨-౧౯
### (పుటలు. ౧౨౨-౩౯)

౧౬౧౨ జూలై, ౯. శాన్ థోమే నుండి పోర్చుగీసులు సముద్రముమీద వచ్చి పులికాటుపై బడి కొందఱిని చంపి పెక్కండ్రను బందీకృతుల గావించిరి. మచిలీపట్నము మొదలగు గోల్కొండరేవు పట్టణములందలి మహమ్మదీయ కరపట్టణాధికారుల ప్రతిఘటన. లాన్ అబ్దుల్లాకును, నితరులకును కానుకలతో షెర్ ఖెరన్ గోలకొండకు (జూలై ౨౩ తేదీ) రాయబారము వెడలెను. డచ్చివారిని తుదముట్ట నాశము జేయవలయునని పోర్చుగీసులు ప్రయత్నము జేసిరి. గోల్కొండ సర్కారు ఈ తీరవుమీద మచిలీపట్టణ వణిక్కొలయందుండిన పోర్చుగీసులను కొందఱిని ఆర్మీనియులు దమ యోడపై నెక్కించుకొని పోవుచుండు కారణమున డచ్చివారు తమయోడను బట్టుకొని రని వారు ఫిర్యాదు తెచ్చిరి.

౧౬౧౨ ఆగస్టు, ౧౦. సుల్తాను బెర్ఖెన్‌కు దర్శన మొసగెను. గోల్కొండయొడ మైత్రి పాటించు పోర్చుగీసుల నష్టపెట్టుటకు వీలుకాదని మిర్ జుమ్లా నిరాకరించుటయేకాక ఆర్మీనియుల యోడను తిరిగి వారికి స్వాధీనము జేయవలయునని దృఢముగ మందలించెను. మఱియు ౧౬౦౬ లో జేసికొనిన యొప్పందము ప్రకారము డచ్చివారు గోల్కొండకు వర్తకపు సరకులను దేలేదని నేర మొకటి మోపబడెను. భావికాలమున నన్నియు జక్కగ నడవగలవని చెప్పి బెర్ఖెన్ మూడు ఫర్మానాలను బడసెను. పోర్చుగీసులతో డచ్చివారి పోరాటమును సముద్రముమీదనే నడపుకొనవలయుననియు, నుదాసీనుడైన తన భూమియందు నడపుట కెంతమాత్రమును వీలుకాదనియు నతనికి దెలియజెప్పెను. మఱియు ౨౨ వ తేదీనాడు ఇచ్చిన కౌలులో, కరపట్టణాధిపతులతో గోజాచేరమాడక తప్పించుకొనవలయునని యిచ్చియుండిన నతడు ప్రతివర్షమును మచిలీపట్టణములో ౩౦౦౦ వరహాలిచ్చి వర్తకపు హక్కులను కొనవలసియుండుననియు, డచ్చివారు చూఱపట్టిన నర్మీనియులయోడను వారికి మరల నప్పగించవలసియుండుననియు దెలిసికొనియెను. ఈ రీతిగ గలుగు జాగునకును, బాధకును వ్యథపడుచు బెర్ఖెన్ తనకు సహాయుడైయుండిన హెండ్రిక్ డి గ్రూన్ అనువానిని మచిలీపట్టణ అగ్గేలమార్గమున గోలకొండలోని పరిస్థితులను దెలియపఱచుటకు బంట మందుండు డచ్చి గవర్నర్ జనరలుకడ కంపెను. కాని, చివరకు ఆస్థానవిదూషకుడు బెర్ఖెన్‌కు తోడుపడగా నతని సలహా మూలమున సెప్టెంబరు ౧౮ తేదీన అతడు గోలకొండను విడువక బయలుదేరుటకుముందు తమ కనుకూలమైన ఫర్మానాను పొందెను. సెప్టెంబరు ౨౩ తేదీన మచిలీ పట్టణమునకు వచ్చి చేరెను.

౧౬౧౨ డిసంబరు, ౨. ఫాన్ బెర్ఖెన్, ఆన్ డ్రీస్ క్రీక తోడను, మఱి యార్దురితోడను గలసి కర్ణాటక నాయకుని సహాయము సంపాదించుటకొఱకు

మరల మొదట జింజినాయకునికని నిర్ణీతములై యుండిన కానుకలను గొని వేలూరునకు దరలిపోయెను. నాయకుడు (రాయలు) తన బావమఱదియగు నారపరాజును ౧౦౦౦౦ యుద్ధభటులతో గూడ కాపాడ్ దానిని మీదికి బంపెదననియు, జెరెర్ అప్పుడే సముద్రముపై వచ్చి దానికై బడవచ్చుననియు, డచ్చివారు పులికాటులోనొక కోటను నిర్మించవచ్చుననియు, నందు సగము వారికిని, తక్కిన సగము దనకును జెందవలసియుండుననియు జెప్పి తన రాష్ట్రమందలి పోర్చుగీసువారి స్థానములపై యుద్ధము సల్పుట కనుజ్ఞనిచ్చెను. కాశేయపరిధాన చతురంతయానాది సత్కారములను బడసి జెరెర్ వేలూరునుండి బయలువెడలెను.

రాయల మాటయందంతగ నమ్మకము గలుగక పోవుటచే జెరెర్ అప్పుడు మైసూరువారితో యుద్ధము నడపుచు కోలారునందు విడిసియుండిన జగ్గరాజు ప్రసాదమును బడయగోరెను. తనతో వచ్చిన వారిలో గొందఱిని క్రీకతోగూడ పులికాటున కంపి, డిసెంబరు ౨౧ తేదీన అశ్వారూఢుడై బయలుదేరి డిసెంబరు ౨౪ తేదీనాడు కోలారుకు పోయిచేరెను. ఇచటగూడ పోర్చుగీసులను దారకించి వారి యభివ్యాప్తిని క్రిందుపఱచి పులికాటువిషయమై తన యభీష్టమును నెఱవేర్చుకొని, ౧౬౧౩ జనవరి ౬ తేదీన మరలి యచటికి వచ్చి చేరెను. తరువాత పులికాటు ఫాక్టరీ నిర్మాణము ప్రారంభమాయెను; అటువెనుక ఫాక్టరీ కట్టడము సంపూర్ణమై గెల్డిరియాకోట బలపఱచబడెను.

౧౬౧౩ ప్రారంభదశ. పోర్చుగీసులతో వైరము యథాపూర్వము సాగుచుండెను. జగ్గరాజు సోదరుడైన యతిరాజుతో వారు సఖ్యము పడుర్చుకొనిరి. అతడు ఆ యేడు వందలమందితో పులికాటుపై నెత్తివచ్చి పరాభూతుడై యెచటికో పోయెను.

౧౬౧౪ నవంబరు. డచ్చివారి స్థితిగతులను ఈవిచేతను, సంస్కారముల మూలమునను బాగుపఱచుటకు వాన్ బుడిహా జను నధికారి మచిలీపట్టణమునకు వచ్చెను.

(౧౬౧౪. శట ౧౩౪) అక్టోబరులో డివోజా రాకకు ఇంచుకముందు కర్ణాటక నాయకుడు (రాయలు) వెంకటపతి వేలూరులో పరమపదించెను. అతని భార్యలలో నత్యకృష్టులు మువ్వురు అతనితో సహగమనము జేసిరి. కాలగతి నందిన రాజుగారి కుమారుని పక్షమున గొందఱును, వెంకటపతియన్నయగు రామరాజు మనుమని (ఇతడు భోగినీపుత్రుడని జనవాక్యము) పక్షమున మఱికొందఱును రెండు కక్షలుగ జీలి నాయకులు రాజ్యాధిపత్యముకొఱకు పోరాడదొడగిరి. ఇందు వేలూరున కధిపతియగు జగ్గరాజు రెండవ (మొదటి ?) వాని ప్రక్కను, ఏచప్పనాయకుడను నొకడు మఱియొకని ప్రక్కను నాయకత్వము వహించి తమ తమ సైన్యములతో యుద్ధరంగమును బ్రవేశించిరి. మొదటివానికి రాజభాండాగారములోని ధన మశేషము చేజిక్కెను; జింజిమధురనాయకులు వానికి బ్రాపైరి. కాని రెండవవాడు నెఱజోడు. ఇతనికి పోర్చుగీసులును, తంజాపూరునాయకుడును సహాయులు. పులికాటులోని వరుంబడి గతించిన నాయకుని (రాయల) తల్లిదగుటచేతను, నామెపక్షమున జగ్గరాయడు పారుపత్యము సేయుచుండుటచేతను నతనికి జయముగలుగుటయే (డచ్చి) కంపెనీకి లాభకరమని తోచెను; కాని యేచప్పనాయకునికే, జయము గలుగుట దుస్సాధ్యము గాకపోవుటచేత డివోజా ఉభయపక్షములయెడను నౌదాసీన్యమును వహించెను. ౧౬౧౫ జూన్ ౧ తేదీనాడు డచ్చివారు మచిలీపట్టణమునుండి తమ ప్రధానవర్తకస్థానమును పులికాటుకు మార్చుకొనిరి.

## కోరమండల్ : ౧౬౧౫-౧౯

(పుటలు ౨౦౩-౧౪)

౧౬౧౬. దక్షిణకోరమండలమునందు వేలూరు జింజిలకు తంజావూరితో పెద్దతెగక యుద్ధము జరుగుచుండెను. ౧౬౧౬ లో జగ్గరాయ డాఱువేలమందితో గూడ యుద్ధమున నోడి నిహతుడాయెను. తరువాత నతని సోదరుడగు యతిరాజు నాయకత్వము వహించెను. ఏచప్పనాయకుడు ౧౨,౦౦౦ సైనికులతో నెత్తిపోయి జింజిరాజ్యమునకు జెందిన నాలుగు దుర్గములను స్వాధీనము జేసుకొనియెను. ఇక (జింజి) నాయకునికి మిగిలినది బలిష్ఠమైన జింజిదుర్గ మొక్కటానికంటె

శేషించినది చాలలేదు. ఇప్పుడు తిరుపాపులియూరును తంజావూరివారు స్వాధీనము చేసుకొనిరి; కావున ఆ కంటూరును (వర్తకస్థానమును) త్యజించవలసివచ్చెను. అచటి ప్రధానఫాక్టరు (వర్తకమును సాగించునుద్యోగి) పులిచేరికి పోయి యచట మృతినందెను. ద్వితీయుడు పులికాటుకు వెళ్ళెను.

ఏచప్పనాయకుడు పై కంటూరును మరల స్వాధీనపఱచెద నని చెప్పినను డిహోజ దానిని వశపఱచుకొనలేదు; ఏలనగా, రాబోవు సంధిషరతుల ప్రకారము తేనాంపట్టణము మరల జింజిక్రిందికి బహుశః రావచ్చునని యతడు తలచెను.

## కోరమండల్: ౧౬౯౯-౩౭

(పుటలు ౭౫౧-౯౩)

౧౬౯౯. జింజి తంజావూరు మధుర నాయకుల వైమనస్యములవలన కర్ణాటకమున యుద్ధమింకను సాగుచునేయుండెను. సింహాసనమునకై పోరాడు సర్ధ్యర్థులలో నొక్కడగు వెంకటపతిరాయల పుత్రుడు కాలగతినందెను. రెండవవాడు (రామరాజు మనుమడు) విజయనగర సామంతులలో నగ్రగణ్యుడగు యతిరాజు యొక్క కుమార్తెను పెండ్లాడవచ్చును—అనుకొనినట్లే ఆ పెండ్లి ఆగస్టు నెలలో జరిగినది. సెప్టెంబరు, అక్టోబరు నెలలో శాన్‌థోమేలోని పోర్చుగీసులచే పురికొల్పబడి యతిరాజు పులికాటును ముట్టడించెను. కాని యతనికి జయము కలుగకపోవుటచే డచ్చివారికడ ౫,౦౦౦ రీలుల సుంకమును, నటుపిమ్మట వర్షవర్షమును నంతటి సుంకము చెల్లించునట్లు వాగ్దత్తమును గొని ముట్టడి లేపుకొని మరలిపోయెను. మఱియు యతిరాజు పోర్చుగీసులకు ప్రతిరోధముగ డచ్చివారితో సఖ్యము చేసుకొనెను.

౧౭౦౦ లో డేనులు ట్రంకుబారునకు వచ్చిరి.

౧౭౦౧. ఢిల్లీ కాంబరుసనకును, హిందూస్థాన చక్రవర్తికిని మధ్య నడచిన యుద్ధములను బీజాపూరు గోల్కొండరాజ్యముల నడుమ నుండు రాష్ట్రమున కధిపతియైన హిందూ ప్రభువగు గోపాలరాజునకును, బీజాపుర మేలు ఇబ్రాహింఖానును నడచిన యుద్ధములను వర్తకమంత యనుకూలముగ సాగలేదు. గోల్కొండవారు గోపాలరాజుపైన సౌహార్దము గలిగియుండిరి. డిసెంబరులో సంధి కుదిరెను. కర్ణాటకమున వేలూరునందు రాజ్యాధిపతి నెన్నుకొనుటయందు వైమనస్య మేర్పడెను.

౧౭౦౨ లో యుద్ధము లేదు. కారణమేమనగా, రాజ్యాధిపతి నేర్పాటు చేసుకొనుటయందు పొందిక లేకపోవుటవలన యెవరికి వారే స్వతంత్రులై యేలదొడగిరి. ౧౭౦౩ లో మరల వర్తకమునకు నిరోధము కలిగినది. వృద్ధుడైన మధురనాయకుని సోదరునికిని, తంజావూరునాయకునికిని సమరము సంఘటిల్లెను. వర్తకపు సరకులలో బానిసల కెప్పటను విలువ యధికము. ౧౭౦౩ లో కోరమండలమున, పులికాటు తేనాం పట్టణములందేమి, కొచ్చి మలబారులందేమి ౪౦౦ బానిసలు చిక్కిరి.

(సశేషము)



# కామదహనము

(నాటిక)



— శ్రీ కోట సుందరరామశర్మ —

[ఉద్యానవనం. వసంతం అప్పుడే ఆవిర్భవించింది. పార్వతీ, చెలికత్తె నళినీ ప్రవేశం]

నళిని—అమ్మా, ఇటు, ఇటు—కలకలనినాదం వినపడుటలేదమ్మా, అదే సెలయేరు. ఇటుప్రక్కగా రా అమ్మా.

పార్వతి—అవునే, తెలిసినది ఇప్పుడు. ఏమా ఉదయమునుపటికల్లా చెట్లన్నీ ఇలా పుష్పించాయని ఆలోచిస్తూ పరధ్యానంగా వస్తున్నాను. నిన్నేమైనాయే ఈ పువ్వులన్నీను?

నళిని—తపోభూమి మహిమమ్మా ఇది. శివస్వాముల తపఃప్రభావం! లోకాలనే సృష్టించగలరు తపస్వులు—పువ్వులోలెక్కా?

పార్వతి—ఎందుకు సృష్టించవలసి వచ్చిందే ఇన్ని పువ్వులూను?

నళిని—నీవు శివస్వాములకు పరిచర్య చేస్తుంటివి కదా అమ్మా—నీయెడల కరుణ కలిగి, నీవు వనమంతా వెదకనక్కరలేకుండా ఆయనసంకల్పమాత్రంచేతనే ఎక్కడ పడితే అక్కడ ఇన్నిపువ్వులూ వెలిశాయమ్మా.

పార్వతి—నీ వయస్సుతోబాటు తపస్వుల యెడల భక్తీ, జ్ఞానం అన్నీ వృద్ధిఅయినాయి. అందుకనే వృద్ధురాలవను నిన్ను నాకు వప్పగించారు మా నాయన.

నళిని—అమ్మా, ఇటురా; గాలి అటుప్రక్కనుంచి మామిడిపూగుత్తుల సువాసనలో కూడిన పుప్పొడి కళ్ళల్లో విసురుతోంది.

పార్వతి—ఇప్పు డేమి మామిడిపూత! ఏదో భ్రమలో పడి మాట్లాడుతున్నావు.

నళిని—ఏమమ్మా, పరధ్యానంగా ఉండి ఇంద్రియములన్నీ వ్యాపారములు మానివేస్తున్నాయి.

పార్వతి—అదేమిటే అట్లా అంటావు?

నళిని—అవును. ఇందాకా సెలయేటిగానమూ వినబడలేదు; ఇప్పుడు చూతమంజరీరజమున్నా నీవు ఆఘ్రాణించలేదు.

పార్వతి—(వినిపించుకోకుండానే) ఆహా! ఇక్కడ చూడు—ఈ రెండు తుమ్మెదలూ జంటగా ఈ పూలగుత్తిమీదనుంచి ఆ పూలగుత్తిమీదికి ఎగురుతున్నాయి. రెండూ ఒక్కస్వరంలో గానం చేస్తున్నాయేవ్.

నళిని—ఇటురా అమ్మా, చూతరజం అటు ప్రక్క, ఇందాకనే చెప్పితినిగదమ్మా.

పార్వతి—మరచిపోయినానే. అవును, దక్షిణాయనంలో మామిడిచెట్లు పుష్పిస్తాయా?

నళిని—ఏమోనమ్మా ఆశ్చర్యమే; కాని తపస్వులకు సాధ్యంకాని దేముంది?

పార్వతి—రాత్రికిరాత్రి మామిళ్లు పుష్పించాయంటే జగన్నాటకసూత్రధారి చమత్కారమూ, లీలా అన్నమాట.

—అన్నట్లు ఇలా చూడు నళినీ, నిన్న ఆచెట్టుమీదుగా కామా ఉదయించాడు సూర్యుడూ? ఇదేమిటి ఇవ్వేళ పదిబారలు ఇటు జరిగాడు—ఒక్కరోజులోనే!

నళిని—సూర్యచంద్రాదులను మించిన శక్తి అమ్మా శివస్వాములది.

పార్వతి—ఎంత శక్తిమంతులు, ఎంత జ్ఞానవంతులు స్వాములు !

నళిని—మంచుకాలంలో పరమశివుని అనుచరులకు అనుకూలంగా ఉండదేమోనని ప్రకృతి తనంతట తానే మారింది.

పార్వతి—అవునే, నిన్నటున్న చలి ఈ వేళ లేదు చూశావా?

నళిని—చెప్పితిని కాదమ్మా !

పార్వతి—రా, వా హరిణా రా—ఓ! పిల్చినా రావడం లేదే నళినీ? ఎక్కడనుంచో ఆడ లేడిపిల్ల వచ్చిందేవ్. ఎంత అందంగా ఉంది!

నళిని—అమ్మా, ఎరు గుంపకపోయినా, జంతువులకు స్నేహం అల్లా కలిసిపోతుంది.

పార్వతి—చూడు, తన కొమ్ములలో దాని కన్నుదగ్గర మెమ్మదిగా గీరుతోంది.

నళిని—అమ్మా, ఈ పూలు బాగున్నాయి. బుట్టలో వేసుకో రెండు. స్వాములు కరుణిస్తారు మన యెడల.

పార్వతి—ఏమే, ఈ అశోకం నిలువల్లా ఎలా పూచిందో ! ఇప్పు డశోకం పుష్పించడ మేమిటో !

నళిని—ఏం, మామిడే పూయ గా లేంది, అశోకం పుష్పించదూ ?

పార్వతి—ఇది ఏ ఋతు వంటావు ?

నళిని—తపస్వులకు ఋతువులను మార్చే శక్తి లేదూ ?

పార్వతి—నిన్న లేవేవ్, నళినీ. ఇలా చూడు, పలాశవృక్షం మొగ్గలు తొడిగింది.

నళిని—నీ ఈడప్పుడు మాకు వీటి పేర్లే తెలియవు. ఇన్ని పేర్లు ఎలా వచ్చేశాయమ్మా నీకు? నిన్న కూచోపెట్టి ఎవరూ చెప్పలేదే ?

పార్వతి—(వినిపించుకోకుండా) ఈ కర్ణికారం ఎంత చక్కగా ఉందో!

నళిని—అయితే అమ్మా, ఆ కొత్త పు వ్వేమిటే నువ్వు చూస్తోంది ?

పార్వతి—ఆఁ, మరచిపోయావు ? కొండగోగు.

నళిని—సరే, రెండు కోసి చూస్తాను. అబ్బే, ఏం వాసన లేదమ్మా.

పార్వతి—రూపానికి తగిన గుణం ఉండదే బ్రహ్మసృష్టిలో.

నందీశ్వరుడు—(తెరలో)

జాగ్రత్త ! మాటలు వినిపిస్తున్నాయి. ఎవరి పనులు వారు నిశ్శబ్దంగా చెయ్యండి. ప్రభువువారి ధ్యాన సమయం అవస్తోంది.

పార్వతి—చూశావా, నళినీ? ధ్యానసమయం అవస్తోందిట. హోమసమయానికి పూలు తీసుకుపోవద్దూ!

నళిని—ఇది నందీశ్వరుడుగారి మొదటి కేకే నమ్మా—అడవి అంతా ఒక్కమాటు దద్దరిల్లి పోయింది. ఇంకా రెండు హెచ్చరిక లున్నాయిగా.

పార్వతి—ఏమోనమ్మా, పద. అక్కడే ఆశ్రమ ద్వారంలో కనిపెట్టుకొని ఉందాం. అడవిలో వింతలు తిలకిస్తూ కూర్చుంటే నేవాళ్ళంగం కలుగుతుంది.

నళిని—అవునులే అమ్మా, లేపు చూడవచ్చు మిగిలిన వింతలు—ఎక్కడికి పో దీ వనం. సరే పద.

(ఆశ్రమద్వారంవైపు నడుస్తారు)

పార్వతి—ఈ ఆశ్రమలతలన్నీ చిగిర్చినాయేవ్. తపోమహత్తేగదా! ఇవికూడా పుష్పించలే దేమే నళినీ ?

నళిని—మెమ్మదిగా మాట్లాడు. ఇది ఆశ్రమం కదూ ! ప్రకృతిశక్తికూడా పరమశివునిదగ్గర కొంచెంగా జంకిందేమో ! అందరి శక్తులూ భగవజ్జ్యోతిముందర తేలిపోతాయిగదమ్మా !

పార్వతి—ఇంకా ఎంతసేపు కూచోవాలో ?

నళిని—ఇంకో పావుగడియకాలం ఉండను కొంటాను. అయినా రోజూ లేని తొందర ఏఁడు కమ్మా !

పార్వతి—ఏమో, ఈ పూలను ఆయనకు ఇచ్చి వస్తే దినచర్యలో ఒక పని అయిపోతుంది.

నళిని—అయిలే, అదేమిటమ్మా, దండగా గుచ్చుతున్నావేమమ్మా ఆ పువ్వులనూ ?

పార్వతి — మరచిపోయినావేదో మాటల ధోరణిలో దండ గుచ్చుతున్నాననే జ్ఞానమే లేదుసుమా నాకు!

నళిని—సరే, భయం లేదులే. దాని కేంగాని—

(తెరలో నందీశ్వరుడు "ప్రభువుగారి హోమ వేళ సమీపిస్తోంది; అంతా సిద్ధంగా ఉండండి" అంటూ బయటకు వస్తూ)

నందీశ్వరుడు—పార్వతీ, పూలు తెచ్చి సిద్ధముగా ఉన్నావా ?

పార్వతి—అయ్యా, ఇదుగో పూలు తెచ్చి సిద్ధం.

నందీశ్వరుడు—ఉండు. (అని లోపలికి పోవును)

నళిని—అమ్మా, నే నిక్కడనే ఉందును. నీవు లోపలికి పోయి పూలు సమర్పించి రాకూడదూ ?

పార్వతి—స్వామికి ప్రాతర్నమస్కారం చెయ్యవూ ?

నళిని—ఈ ద్వారంలోనుండే చేస్తానులే, అమ్మా.

పార్వతి—ఏమో నా కెందుకో హృదయం కూడా దడదడలాడుతోంది—నువ్వు ఇక్కడే ఉంటే ఎలా ?

నళిని—ఏమీ భయం లేదమ్మా, నేను ఇక్కడేగా ఉంది. క్రొత్తస్వాములు కాదుగదా!

పార్వతి—కాదు, రావాలి నాతో.

నందీశ్వరుడు— (తిరిగివచ్చి) పార్వతీ, నీవు లోనికి పోవచ్చును. నీ చెలికత్తెనుకూడా నీవెంట తీసుకొని పద.

పార్వతి—ఇంకను హోమసమయమునకు రెండు నిముషముల సమయ మున్నది. ఆహా! ఏమి పరమ శివుని ఆకారము—ఆ వీరాసనము ! తామరపూలవంటి ఆ అరచేతులు !—అయ్యో, పొరబాటున ఎడమకాలు పెట్టితినే.

నళిని—అమ్మా ! ధ్యాననిమీలితనేత్రములలోని జ్యోతిని చూచితివా ?

పార్వతి—కంటికొసలు, ఆహా, చెవిదాకా ఉన్నాయే—! ఉన్నతఫాలం, తిన్నని నాసిక–ఎంత అందం !

నళిని—అమ్మా, తపఃప్రభావం చూడు, ప్రాణాయామంవల్ల అక్కళించిన పొట్ట ఎక్కడా కదలటం లేదు.

పార్వతి—ఆహా, ఎంత సన్నని నడుము! 'వ్యూఢోరస్కుడు' అన్న పదం ఈయనకే తగును.

నళిని—శిరస్సుచుట్టూ ఎంత తేజస్సు ! నమశ్శివాయ !

పార్వతి—జటాజూటము ముఖమునకు ఎంత నైసర్గికశోభను కలిగిస్తోందీ ?

నళిని—అమ్మా, స్వామి వీరాసనబంధమును కదల్చుచున్న ట్లున్నారు. నేను ఆశ్రమద్వారముదగ్గరనే ఇటుప్రక్కగానే నిలబడి ఉందును. సమయమునకు నమస్కారము చేసి పూలు సమర్పించు అమ్మా! (ద్వారము దగ్గరకు వచ్చును)

పార్వతి—ఏమి నా చేతులు వణకుచున్నవి !

శివుడు—సోఽహం, సోఽహం.

పార్వతి—శివోఽహం! దేవ, నమస్తే

శివుడు—అనన్యాసక్తుడగు పురుషుడు నీకు భర్త కాగలడు.

పార్వతి—ధన్యురాలను ! దేవా, ఇదిగో పుష్పములు.

శివుడు—ఆహా, ఈమె ముంగురు లెంత చిక్కనివి, నల్లనివి. మోమందము, సుకుమారత !

అమ్మాయి, నా తామరపూసల తావళ మేదీ ?

పార్వతి—ఇదుగో స్వామీ. (అని బుట్టలో పూలదండ తీసి పైకి యెత్తును.)

శివుడు—ఆహా ! తామర తూండ్లవలె ఈమె చేతు లెంత మృదువులు !

అన్నట్లు పార్వతీ, ఇది పూలదండగదా! నే నడిగినది తామరపూసల తావళమే ! పోనీలే.

పార్వతి—అయ్యో, పారబడితిని!

శివుడు—పరవాలేదు. నీచేత మెడలో దండ వేయించుకొనుట కర్హుడను కానా? నీసుకుమారహస్తములు ఏ స్నేమి చేసినను చేయగలవు.

పార్వతి—చిత్తము స్వామీ, ప్రభువుల ఆజ్ఞ. (కంకణముల చప్పుడు)

శివుడు—దొండపండువంటి పెదవిమీద మల్లె పూలవంటి పలువరస ముత్యాలపేరు—సిగ్గుపడకు, పిల్లదానివి. నే నెత్తుగా ఉన్నానా, ఇదుగో శిరసు వంచుతాను.

పార్వతి—(దండ వేయబోగా-)

శివుడు—ఛీ, ఎదుట అగ్నిహోత్రుడు! అగ్నిసాక్షిగా మనోవికారమునకు లోనై—ఏమింతకుగాతిని!

పార్వతి—సుందరాకారా, శివా!

శివుడు—ఛీ! ఎవడురా అక్కడ? (శివ్వన గాలిమ్రోత)

(తెరలో) నందీశ్వరుడు—స్వామీ!

శివుడు—ఆ, ఎదుట వా డెవడు? వానిప్రక్కన జవత? ఎవడురా అక్కడ?

నందీశ్వరుడు—(ప్రవేశించి) ప్రభూ, ఏమి సెలవు?

శివుడు—ఆ దేవదారువృక్షముపక్కన ఎవతెనో పక్కన బెట్టుకొని పొంచిఉన్న దెవడు? వా రీ ఆశ్రమ సమీపమున కెట్లు వచ్చిరి?

నందీశ్వరుడు— తప్పు స్వామీ, చూడలేదు. మాయవేషమున వచ్చిన ట్లున్నది. ఇదిగో పోవుచున్నాను. (పోవును)

శివుడు—ఈ వసంతలక్షణము లేమి? (పరికించి) ఓహో వీడా! మన్మథుడు. రతీసహితుడై నన్ను మోహపెట్టుటకు వచ్చినాడా? సరే, క్షణః మిక వీని బ్రతుకు అంతమగుగాక!

(తెరలో) "క్రోధం ప్రభో సంహర సంహర"

నళిని—(ప్రవేశించి) ఏదీ పార్వతి! అమ్మో, మంటలు. దేవదారుచె ట్టంటుకొన్నది. ఈ ఉత్పాత మేమిటి? పార్వతీ, పార్వతీ! ఎక్కడ!

(లోనికి తొంగిచూచి) ఏదీ, ఆశ్రమం లోపల లేదే! స్వామి లేరే!

నందీశ్వరుడు—(ప్రవేశించి) ఈ ఆడుమాయలో ప్రభువులు చిక్కుదు రనుకొన్నావా, పో, అంతా పాం డిక్కడనుంచి—ఆయన అంతర్ధానమైనాడు.

నళిని—మా పార్వతి?

నందీశ్వరుడు—అదుగో, నూరుబారల దూరము పోయిన. తండ్రి వచ్చి తీసుకొనిపోయినాడు.

నళిని—ఏమి, ప్రభూ, కాలగతి!

(తెరలో దూరముగా శివుని కంఠధ్వని) సరే, లోకరక్ష! ఆకాశవాణిద్వారా వినిపింతునులే—రతీదేవి అవిధవయే అగునుగాక—పో.



# పదాంకదూతము

— శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి —

వ్రజరమణీమనోహరునిఁ బాసి, వెతంబడి, వాడువాఱి, వా
రిజదళనేత్ర యొక్కతె, చరించుచు వీఱఁడివోలె, ఊరుపుల్
గజిబిజిఁ బుచ్చు, చియ్యెడఁ గలండు మురాంతకుఁ డన్న భ్రాంతిఁ గ్ర
న్నఁ జనియె స్ఫీతపూతయమునాతటమంజునికుంజభూమికిన్.

అందు వ్రజేందునందనుని అరసియారసి, కాన కెందునుం,
గొందల మంది, మూర్ఛపడి, కొంత కెలంగి, లతాంగి, అందు నిం
దుం దరళేక్షణమ్ములను తోరణగట్టుచుఁ జూచెఁ జెంతఁ గ
న్విందుగ, దివ్యలక్ష్మకమనీయము శ్రీహరిపాదచిహ్నముల్.

ఆ సమయంబునన్ నవనవాంబుదగర్జలు మింట రేఁగ; చే
జే సుమకార్ముకమ్ముఁ గొని చీలిచె డెంద మనంగుఁ; డంత నా
యాసముఁ జెంది యా యబల యాచనసేసెను దౌత్య మూన, నెం
తే నఖు నెన్నుచుం, గరణహీన మచేతన మా పదాంకమున్.

అరవిందాక్షుని పాదపద్మమున రమ్యప్రక్రియం దోఁచు వ
జ్రరథాంగధ్వజముఖ్యచిహ్నములు రారాజిల్లు నీయందునన్;
హరిపాదాంకమ! స్పష్టమై ప్రియుని చెంతన్ బ్రేమదౌత్యమ్ము లే
బరగానో యని, ప్రేమయు నందియులఁ దాల్పన్ మానినా నీ వోహో!

మధుపురి కేఁగినంతఁ, గడు మాలిమి నర్పణసేసి స్వాగతం,
బధికముగా స్రవించు ప్రమదాశ్రుజలమ్ముల నర్ఘ్యపాద్యముల్
విధి నమకూర్చి, పౌరజనబృందము పుల్కల నించు మేనితో,
మధురసపూరపూరితసుమమ్ముల నీ కొనరించుఁ బూజలన్.

* శ్రీ కృష్ణచంద్ర సార్వభౌముని రచనకు అనువాదము.

అను వను నూహ నెమ్మనము నంపితి దౌత్యము నిర్వహింప; ని
ల్చిన దది యిచ్చటే ప్రియుని చిన్ని పదమ్మును గాంచి లగ్నమై;
చను మనఁ, జేరి, గారవవశమ్మునఁ బోదు మనోరథమ్ము; మ
న్నన నిఁక నెవ్వరే నినువినా కొన నా పనుపున్? పదాంకమా!

"క్రమ్మరి వత్తు నే నచిరకాలమునన్ ప్రియురాల! ధీరమా
నెమ్మది నుండుమా" అని చనెన్ మధురాపురి కచ్యుతుండు; నే
నమ్మిక నుంటి, వాని వచనమ్ము చెవిన్ విని; కాని, రాఁడు; ని
క్కమ్ముగఁ దోఁచె నిత్తఱిని, కార్యము కారణరూప మా ననన్.

ఈ విఁక వేగమే మధుర కేగుము; నాకు సుహృద్వియోగబా
ధావశశాంతి, నీ కెలమిఁ దత్పురిఁ ద్రొక్కిన పుణ్య మబ్బు; బృం
దావని కన్న భూరిసుకృతమ్ము గడింతువు; నిత్యనిస్తుల
శ్రీవిభవాభిరాములు వరింపరె తన్మహితార్థలాభమున్?

పరమానందము నొందు గోపవనితాప్రాణాభిపానోద్యమా
దరుఁ డక్రూరుఁడుగూడ, నిన్ గనినయంతన్; మా అభీష్టార్థముల్
నెరవేరన్ పని లేకపోయినను, పోనీ, దుఃఖ మేమాత్రమా?
అరిపత్యాభ్యుదయంబు శ్లాఘ్యముకదా హర్షప్రకర్షంబులోన్?

ఘోరములైన మా కలుషకోటుల పేరిటి యేన్గులన్ మహో
దారతరత్వదంకుశముఁ దాలిచి సంస్మృతిహస్తమం దిదే
దూరము సేసికొంటి; మిఁకఁ దూర్ణగతిన్ యదురాజధాని కా
భీరవధూహితమ్ముఁ దలపెట్టి చనంగదవే పదాంకమా!

గోకులమందు గోపకులఁ గూడి, మనోహరబాలలీలలన్
మా కనువిందు పెట్టి, తనుమానసముల్ హరియించి వైచినాఁ
డా కనకాంబరుం, డిపుడు యాదవమండలిఁ గూడి యాడి పల్
పోకలు పోయెడున్ మధురలోఁ, దన పుట్టినచోటునం బలెన్.

గుండములై సుడుల్ దిరుగ, ఘోరములై జలజంతుసంతతుల్
నిండ, గభీరమై, యమున, నీ చనుదారికి నడ్డమౌఁ; గడుం
గొండికగాఁ దరింతు; పెదఁ గొల్చినమాత్ర, భవాబ్ధి దాఁటి వై
వం డకటొంకులేని నినువంటి పజీరుకు లెక్కలా నదుల్?

కన్నారన్ నిను జూచుచుండ, మనసా కంజాతపత్రేక్షణుం
గన్నట్లే యయి, పొంగుచున్నది రసోత్కంఠ్యమ్మునన్; దూతవై
క్రన్నన్ నీ వటు పోయిర మ్మికఁ; స్మృతిప్రాప్తుం బ్రియుం గూడి, సం
పన్నప్రీతి రమించుచుందు నిట నే వానీరకుంజమ్మునన్.

సొంపారున్ పురవీథులున్, రవిసుతాసోపానబృందంబు నీ
సంపర్కంబునఁ గెంపురాల వరుసల్ స్థాపించి నిర్మించిన
ట్లింపై, అయ్యెడనే చరించుచు నిలన్ వీక్షింతువో యేమొ, భా
రంపుం గార్యముఁ బూనియుంట మఱవన్ రా దీవు పాదాంకమా!

మణిమంజీరవరాభిరంజితము రమ్యంబైన మా అంబుజే
క్షణు పాదాంబుజముం గనుంగొని, అమోఘంబైన హర్షం బను
క్షణముం బొందుచునున్న పౌరు, లరివ్రజస్యందనాబ్జాదిల
క్షణసంలక్షితమైన నిన్నుఁ గని దృక్సాఫల్యముం జెందరా?

సుందరి యయ్యె రాయి, పయి సోఁకి యదీయపరాగరేణువుల్;
పొందిరి నారదాదులు నపూర్వమహత్త్వము దేనికూర్మి; నా
మందరధీరు పాదకుసుమమ్మున నుండి జనించినావు మా
బృందలొ నీవు, దీనజనబృందముఁ గావఁగనై, పదాంకమా!

పడగలపైని భాసిలి భవచ్ఛుభచిహ్న మొకండు పాములం
బడక ఖగేంద్రువాతఁ బరిపాలన సేయుచు నున్న; దింక నొ
క్కఁడు పితృముక్తిహేతువయి క్రాలుచునున్నది; నిక్క మెన్న, నీ
వుడుగక విశ్వమంగళమహోదయలక్ష్యమ వో పదాంకమా!

ఫుల్లపయోజగంధపరిపూర్ణములై, యమునాతరంగిణీ
సల్లలితాతిశీతలపృషత్పరిషద్భరవాహకమ్ములై,
చల్లని మందవాయువులు, స్వైరవిధూతమయూరపింఛసం
పల్లవనమ్ములై, మలసి, భవ్యము సేయును నీ ప్రయాణమున్.

పరిచితజన్మభూమి నెడఁబాయఁగ నయ్యె నటంచు ఖేదముం
బొరయకుమా, జగత్త్రితయపోషణసంతతమా! క్రమాంకమా!
పరుల హితమ్ముకోస మెది భవ్యులు వీడ? రభీష్టకాశికా
పురి విడనాడి నిత్యముగఁ బోఁడె అగస్త్యుఁడు దక్షిణాశకున్?

పరిమళనిర్మలోదకము వైతరిణీజల మయ్యె; తోఁచె ని
ష్ఠురముగ భృంగగానము; కఠోరము కోకిలకూజితమ్ము; చం
దురుఁడు విసమ్ము గ్రక్కె నిడ నూల్కొనినాఁ డిదె బృందలోన; మా
వరునకుఁ జిప్పఁబోకు పొరబాటున నేనియు పాదచిహ్నమా!

అశనిం గాంచి, భవత్ప్రమాణము ధ్రువంబంచున్ బుధుల్ చెప్పినన్,
వశమున్ దప్పుచుఁ దొందరింపఁగడఁగెన్ మా ఆత్మ నిన్నెగ; ఈ
దశతో, నమ్మికఁ బాపె, వ్యాపకము సిద్ధంబౌను వ్యాప్యంబక
ర్కశమై లెస్సగ జ్ఞాతమౌనెడ ననంగాఁ, దద్వియోగం బెదన్.

యమునాకాళియగాథ కేవలము గాథాంశమ్మె సుమ్మీ! క్రమాం
కమ! నీకున్ భయహేతు వెందునయినన్ కానంతయే నున్నదే?
సమయున్ మృత్యుభయమ్ము, నెమ్మది భవత్సంగక్షణం బబ్బుచో;
అమరున్ వజ్రముఁ దాల్చుచుంటివి విలాసార్థంబుగాఁ, గాదొకో?

తలపయి నెక్కి త్రొక్కి విషధారి నహీంద్రుని; సంచరించె వ్రేఁ
తల చనుగొండలందు, పదతామరసాంకమ! నీకు మూలమౌ
నలినదలాక్షు పాద మనినన్, వెలి పెక్కుడ నెప్పు డెట్లు గాఁ
గలుగును నీకు? నిక్కముగఁ గార్యము కారణతుల్యమే కదా?

కులిశముఁ బోలినట్టి రొయికె గుర్తిది! వజ్రము కాదు; నిక్క; మ
ట్టులె యగు నేని, కన్నుల కెటుల్ గలిగించును ప్రీతిధార? ద
వ్వుల మనియుం గలంచు మది,భోరనఁ జిల్లులువైచుఁ జెవ్వ లా
విలమగు వ్రోఁత వజ్రమని విందు; మెఱుంగము ప్రీతిదం బనన్.

అవిగో, నల్లని కార్మొయిళ్ళఁ గని నాట్యంబాడుచుంబాడుచు
న్నవి నెమ్మిల్; చెలరేగె గర్జనలు మింటన్; కంటఁ గన్నంత నీ
నవనీలాంబుదమున్, వినీలతనుఁ డా నాళీకపత్రాక్షు నెం
చి విరాళిం బువ్విల్తుకోల్తలకు డస్సెన్ మేను పాదాంకమా!

క్రోసెఁడు వోయి కాల్గడిగికొమ్ము కళిందజనీటిలోన; అ
యాసమువోఁ దటక్షితిరుహమ్ముల నీడల విశ్రమింపుమా;
దాసుల కెల్ల నుత్తమపదంబు నొసంగు నినుం బదోనముం
జేసి వచించు మాట, పదచిహ్నమ! కచ్ఛపలోమ మట్టిదే.

తోడరి మదంతరంగ మను తుంగతురంగము నెక్కి, కార్మొయి
ల్గొడుగున నెండఁ బాపుకొని, కూరిమిదూతగఁ బొమ్ము నీ విఁకన్;
వెడలి వెలుంగఁ జేయఁడులె వేడివెలుంగుల నా సరోజమి
త్రుఁడును సరోజమిత్రమగు రూపమునం బొలుపారు నీపయిన్.

వ్రజవనితావతంసముల వాలుకనుంగొలఁకుల్ వెలార్చు బా
ష్పజలము పొంగులై పొరలి, పంకిల మయ్యెను త్రోవయెల్ల; ఈ
యిఱుకునఁ బోవు పెట్టులని యెంచకు, కృష్ణవియోగయోగరో
గజపరితాప మాయడుసుఁ గన్పడకుండఁగ నెండఁ జేయదే?

నలినాప్తాత్మజ గోపికాశ్రువుల నిండంబాఱె లే దిప్పు, డా
నలినశ్యాము వియోగతాపమున నెండం బాఱిపోయెం జుమీ;
కలదో నిండుగ, నీరు గోకులమునం గాల్వెట్టఁగా సాధ్యమే?
వల దేశంకయు, నిర్నిరోధముగఁ బోవన్ వచ్చు నవ్వీటికిన్.

యమున కృశించిపోయె, నిజ; మాహరితోడి వియోగ మబ్బుచో
రమణి యెవర్తె పుష్టిఁ గొను? ప్రధ్నజ పుష్టిని గాంచె గోపికా
రమణుల వారిపూరము నిరంతరమై ప్రవహింప; వారలుం
గ్రమమ కృశించిపోయి రనఁగా మది నమ్మకుమా, క్రమాంకమా!

పరికర మున్నచో సరిగ వ్యాప్తి ఫలించుట నిక్కువంబె; ఆ
పరికర మీవ్రజాంగనల బాష్పబలమ్మున లేదుసు; మ్మెదం
బిరిగొనియున్నచో విధురవిహ్వలభావము, పుష్టినొంద రే
కరణినినేని మానవులు, కారణముల్ పదికోటు లుండినన్.

కావున, నెమ్మనమ్ము కలకం బడకుండుటయో, మఱొక్కటో
కావలె మంచి కారణము; కారణమే మృషయైనఁ, గార్యసం
భావన యేని గల్గ; దొకపట్టున హేతువు లేకయున్ ఫలం
బావహియిల్లు, నష్టమగు యాగమునన్ సుకృతంబునం బలెన్.

మలయసమీరచారమున మా ఉసుఱుల్ కడబట్టు; మూర్ఛలం
గలుగును శాంతి లెన్న; విధికల్పితచిత్ర మిదంతయుం జుమీ;
దలములు మాడి వాడును సుధారుచి వెన్నెల సోఁకినంత, ఉ
జ్జ్వలముగ నల్లసిల్లు జలజంబులు వేడివెలుంగువెల్గుకున్.

ప్రణయిజనమ్ముపైఁ బ్రణయభావముఁ బాయఁగలేరు ప్రేయసీ
మణు; లటుగాన నిన్ను బ్రతిమాలెద మాధవుపాలి కేఁగ; ఉ
ల్బణకుసుమాస్త్రధాటి వెతలం బడియున్ రతి అంగలార్పదే
త్రిణయనలోచనాగ్నిఁ బడి దేహముఁ బాసిన భర్తకోసమై?

మారి ఘసంగి మాడిచిన మారుని వాసన మాసిపో, కఠి
క్రూరముగా వ్రజాంగనల కోమలచిత్తనికేతనంబులం
దోరిమిఁ జేరి, పాదుకొని, ఒక్కొక చిచ్చుల పూవుటమ్ముతో
ఊరక త్రావుచున్నయది ఒక్కొక ప్రాణము పాముపోలికన్.

విషమును ద్రావితిన్ భువనవిప్లవశంక మునింగి; కాని, ఆ
విషమును బోలు బాణముల వేగ దహించుచునున్నవాఁ డిసీ!
విషమశరుండు లోక; మని, వెల్లని బూడిద చేసివేసె మున్
విషధరభూషణుండు పువువిల్తునిఁ జిచ్చులకంటిమంటలోన్..

శంబరశాత్రవాశుగవిషంబునకున్, జలరాశికాలకూ
టంబునకున్ వచింపఁగలఁడా ఒకపోలిక యెవ్వఁడేని? భీ
మంబు భయంకరంబు విషమంబు సుమా ప్రథమంబు; నమ్మి తి
థ్యం బనఁబోరుగాక గిరిశాదులు దీనిని దగ్ధకాములై.

కందర్పానలజాతతాపము మహోగ్రంబై విజృంభించె; ఈ
బృందారణ్యమునందు నిల్చువన దీక్షన్ మాకు నిం; కిట్లు మా
కందమ్ముల్ గురియించు బాష్పఝరి పొంగం బాతె రాకున్నచో
ఇం దీ పూవుల యింట నిల్వఁగలవా రెవ్వారు? పాదాంకమా!

పొందుట కల్ల, బ్రహ్మమును పొందియుఁ గన్నుల, నందనందనా
నందపదారవిందభజనస్మరణమ్ముల నొందిపొందు నా
నందమునందు లేశమయినన్, నిజ మంచు వచించె శ్రీశతా
నందుని నందనుండు; వినినా మది; మాధవు నమ్మినా మెదన్.

అరవిందాక్షుఁడు సుప్రసాదమున నేకాంతమ్మునం దున్నయం
తర మీ వారసి విన్నవింపుము అనంతమ్మైన మా దుఃఖముల్;
హరిపాదాంకమ! నిన్నుఁ గన్గొనినయంతం బ్రీతుఁడై శ్యామసుం
దరుఁడున్ నీదు కథావిధానము వినం దాత్పర్యముం బూనెడున్.

మఱచితివో వ్రజాంగనల? మంజులవంజులకుంజపుంజముల్
మఱచితివో? త్వదీయసుకుమారపదాంకితమైన బృందనున్
మఱచితివో? అవున్, తెలిసె; మాధవ! కుబ్జకవుంగిటన్ రుచుల్
మఱఁగితి వీవు నేఁడు; అని మాటికి మాటికి విన్నవింపుమా.

మా చిత్తమ్ములఁ దత్తరంపఱచి ఉన్మాదించు నాకాంతు, నీ
వాచాచాతురి శాబ్దధర్మగతమై వర్తిల్లినన్ మేలె; రుక్
ప్రాచుర్యోజ్జ్వలమూర్తి కా హరికి సాకాంక్షోక్తులం దెల్పుమా
మా చారిత్రము లెస్సగాఁ, బ్రమితిసంబద్ధార్థ మానట్లుగాన్.

వినిపింపన్ వలె నీవు, కృష్ణుఁ డిటకున్ వేంచేయున ట్లీ నుడుల్;
అనుమానమ్మునఁ జిక్కు నర్థమును, ప్రత్యక్షమ్ము గాకున్నచోఁ;
కొనవచ్చున్ దృగభావభావనల, మున్నొక్కరా దటుల్; నిల్చినం
త నిరూఢంబయి చూడ్కి, ఒండొక ప్రమాణం బప్రమాణంబెగా!

నతతానంగశరాభివిద్ధమగు నస్మద్గాత్ర మబ్జాస్త్ర న
స్తిత కీదేని ప్రమాణసాక్ష్యము, శ్రుతశ్రీకృష్ణమిథ్యాభిధా
పితయోగమ్మునఁ జేసి, బౌద్ధమత మన్ చెట్టొయ్యనన్ మట్టిచే
ద్రుత మాచ్ఛాదితమూలమై చనును; చిద్రూపాంక! పాదాంకమా!

క్షణికం బందురు మందబుద్ధులు సమస్తంబున్; బుధుల్ పల్కరు;
ట్లనపాయంబుగ నిల్చెఁ దద్విరహజన్యంబైన ఖేదంబు మా
మనమం; దంత్యము కాదు శబ్దమును; అస్మద్రీతియా, అట్టి; దా
తని గోపీకృతమైన ప్రేమ మయథార్థంబున్ క్షణధ్వంసియున్.

అని యాచించి వచించు గోపసతి నత్యంతానురాగక్రమం
బున నోదార్చి, పోయివత్తు; నిట కా ఫుల్లాబ్జపత్రేక్షణుం
గొని తెత్తున్; నిజ; మిప్పుడే, ఉడుగుమా గోరంబు నీ వంచు మ
న్నన లక్ష్మీరమణక్రమాంకము ప్రసన్నం బయ్యెఁ జిహ్నంబులన్.

---

# ప్రాచీన ఖగోళము

## ౨. వేదమధ్య జ్యోతిషము

●

— శ్రీ వేలూరి శివరామశాస్త్రి —

ఋగ్వేదమునందు కనబడు యజ్ఞము మిగిలిన వేదసంహితలందును, బ్రాహ్మణములందును, ఆరణ్యకములందును బహుముఖములుగా వికసించెను. ఋగారణ్యకముల సందు కొన్ని వేల యేండ్లుండును.

యజ్ఞ మన్నను, సత్ర మన్నను ఒకటి. ఇవి కొన్ని ఒక యేడాదిపొడుగునను సాగుచుండెడివి. కొన్ని నూరేండ్లును, వేయేండ్లును జరిగినటులు కనబడును. ఏడాదిపొడుగునను యజ్ఞము జరిగె ననుటకు సాక్ష్య మిాకిసుక చూడగలము.

'సంవత్సరాయ దీక్షిష్యమాణా ఏకాష్టకాయాం దీక్షేరన్' (తై. సంహి. ౭-౪-౮) 'ఏతా హవై ప్రాచ్యై దిశో న చ్యవన్తే సర్వాణి హవా అన్యాని నక్షత్రాణి ప్రాచ్యై దిశశ్చ్యవన్తే' (శత. బ్రా. ౨-౧-౨) = 'మిగిలిన చుక్కలన్నియు తూర్పునుండి తుడిచిపెట్టుకొనిపోవును, ఈ కృత్తికలు మాత్రము పోవు.'

కృత్తికలలో సోమయాగము చేయవలయును. పగట నవి కనబడవు. రాత్రి కనుగొనవలెను.

'యాగమునకు ప్రాగ్వంశము అను శాల వేయ చోవుమందు తూర్పునుండి పడమటికొక గీటు గీచి దానిమీద దవుదవుల రెండు మేకులను, నడుమ రెండు నిట్రాడులను పాతవలెను. ఆ గీటును ఇంకను తూర్పునకు పొడిగించి మూడడుగుల దవ్వునను, ముప్పదియారడుగుల దవ్వునను మరి రెండు రాడులు పాతవలెను. అటుల పాతినపిదప మొదటి రాడువెనుక కూరుచుండి ముందు రెంటిమీదుగా చూచుచో క్షితిజాకాశమండలముల పూర్వబిందువు కానవచ్చును.' (చూ: శత. బ్రా. ౩-౫-౧)

నేడెల్లరును చూచుచున్నచో ఏ చుక్క తూర్పున నుదయించునో సులభముగా కనబడును. ఇప్పుడు కృత్తికలు పూర్వబిందువునకు ఉత్తరముగా ౨౪° అంశలో ఉదయించుచున్నవి. ఇవి ఒకకాలమున సరిగా పూర్వబిందువుకడ నుదయించెను. అది యెప్పుడు? గణితము చేసినచో క్రీ. పూ. ౨౯౦౦ సాలు వచ్చును. ఇదియే కృత్తికాకాలము. పూర్వబిందునిర్ణయమున ౧° అంశలు పొరపాటువచ్చినను క్రీ. పూ. ౨౯౦౦-౨౫౦౦ నడుమ అని చెప్పవచ్చును. నాలుగు సూర్యబింబములు ప్రక్కప్రక్కల నానించుచో రెండంశ లగును. కాన సుమారు రేడెనిమిది వందల యేండ్లపాటు ఏటేట అయిదారు నెలలు ప్రతి రాత్రియు కృత్తికలు పూర్వబిందువున ఉదయించుచుండగా వారు చూచియుందురు. పై తైత్తిరీయసంహిత చెప్పినది సంవత్సరదీక్ష. ఈ సత్రమునకు దేశదేశములనుండి వచ్చినవారును, స్థానికులును ఎందరో యుందురు. వారిలో కొందఱిందులకు పూనుకొనియుందురు. ఇదేమంత కష్టమైన పని కాదు. మరియు క్రీ. పూ. ౩౨౫౦ అబ్దప్రాంతమున నక్షత్రచక్రము కల్పితమై యుండును. అప్పుడు ప్రతి నక్షత్రమునుగూర్చియు పరిశోధన జరిగియుండవలెను. ఎటులనగా, ఇరువది యెనిమిది నక్షత్రములును, వాని అంతర్భాగములును, వాని గుణగణములను ఒక నాడు కాదుగదా, వందయేండ్ల కయినను తెలిసికొనుట కల్ల. అటుపిమ్మట వానిమీద కవిత్వము చెప్పుట కొన్ని యేండ్లు పట్టునో ఆలోచింపదగిన విషయము.

యజ్ఞారంభమునకు తిథి, మాసము, ఋతువు, అయనము ఈ మొదలగువాని పరిజ్ఞాన మవసరము. బ్రాహ్మణములలో ఈ కాలమును గూర్చిన విచారణ చాల గలదు. జ్యోతిశ్శాస్త్రదృష్టితో జూచినయెడల యజ్ఞము కాలమును కనుగొనుట కేర్పడిన పరిశోధనా గారమని తోచును.

విషువముచే సంవత్సరము ద్విధా విభక్తము. ముప్పది దినములచే నిండిన ఆరారు నెల లొక్కొక భాగము. ఉభయసంధ్యలయు, పూర్ణిమామావస్యలయు, ఋత్వయనములయు ఆరంభకాలమున సోమయాగవిధి. నా డారబ్ధమయిన యజ్ఞ మేడాదిపాటుగను జరుగు చుండెడిది. కావున యజ్ఞసంవత్సరపదము లేకార్థక కోటిలోనికి వచ్చెను. ఋతుయజ్ఞముల సంబంధము ఋత్విక్ పదమున స్పష్టము. 'ఋతు + యజ్, ఇక్ = ఋత్విక్'. మరియు ఉదయమునుండి ఆరంభమగు దినము నకు సావనదిన[1] మని పేరు. సవనమునకు సంబంధించి నది సావనము అని మొదటి వ్యుత్పత్తి. సవన మనగా సోమరససంధానము, లేక యజ్ఞము. సూర్యోదయము నుండి ఆరంభమయిన యజ్ఞమును దెలుపు నీ సావన శబ్దము క్రమముగా దినార్థక మాయెను.

ముప్పది సావనదినములు కల సావనమాసములను, మున్నూట అరువది దినములు కల సంవత్సరములను పండ్రెండు నెలలకు పన్నిద్దరు సూర్యులను ఋగ్వేదము నందు కనిపింతురు. కాని ముప్పది సావనదినములు చాంద్రమానపు నెల కెక్కుడు. ౨౯॥ సావనదినము లతో నొక చాంద్రమానము పూర్తి యగును. కాగా పండ్రెండు నెలల కారు దినములు తేడా వచ్చును. అనగా ౩౫౪ సావనదినములతో పండ్రెండు చాంద్ర మాసములు నిండును. చాంద్రసౌరమాసముల యీ తేడావలన చాంద్రమాసములకును, ఋతువులకును ఐక్యము[2] కలుగదు. దాన యజ్ఞకాలమున నైక్య మసంభవము. కాన వాని నైక్యమున కధిమాసకల్పన జరిగెను.

## ద్వాదశాహ

తొలుదొలుతటి మున్నూట అరువది దినముల యేడాది మున్నూట అరువదియారు దినముల యేడా దిగా మారెను. అపుడు పండ్రెండు దినములు శేషము కలిగెను. ఈ పండ్రెండుదినములకును వేదమునందు కడు ప్రసిద్ధి. వారే యేటి కాయే డీ పండ్రెండు దినము లను పరిపుచ్చుకొనెడివారో, లేక ౫ ఏండ్లకే పరి పుచ్చుకొనెడివారో తెలియదు.

## సంవత్సరాది

'నూరు హేమంతముల ఆయువు నిమ్ము' అని ఋగ్వేదమున పలుతావుల గలదు. దీని నిప్పుడు 'నూరు వసంతముల ఆయువు నిమ్ము' అని అనవచ్చును. అనగా 'నూరేండ్లపాటు మమ్ము బ్రతుకనిమ్ము' అని అర్థము. ఆ కాలమున హేమంతము సంవత్సరాది కావున వారటు లనిరి. మార్గశిరము, పుష్యము హేమంత ఋతువు. కావున మార్గశిరముతో వర్షారంభము. మార్గ శిరమునకు అగ్రహాయనము మారుపేరు. అగ్ర=తొలి, హాయనము=సంవత్సరము,[3] అనగా సంవత్సరాది.

---

1. రాశిచక్రమున రవి ఒక అంశ గడచు కాలము సౌరదిన మని సిద్ధాంతములలో నున్నది. ఈ లెక్కన ౩౬౦ దినము లొక యేడని మనము సాధారణముగా వ్యవహరించుచుందుము. ఇది Civil day. ఈ సౌరదినము ఆంగ్లేయుల Solar day కాదు. సిద్ధాంతములందలి కుదినమును, Solar day యును సమ్యక్సరిపోవును. కుదిన మనగా భూమి భ్రమించు దిన మని అర్థము. భూవాసరము, Sid real day యును ఒకటి.

2. 'పూర్వాపరం చరతో మాయ యైతౌ శిశూ క్రీడంతౌ పరియాతో అధ్వరమ్
విశ్వా న్యన్యో భువనా భిచష్టే ఋతూ నన్యో విదధ జ్జాయతే పునః'
'చంద్రమా వై షడ్ఢోతా. స ఋతూన్ కల్పయతి'. (తై. ఆర. ప్ర. 8, అను ౭.)

3. 'అగ్రే హాయన మస్యాః, మార్గశీర్ష మారభ్య వర్షప్రవృత్తేః. ప్రజ్ఞాద్యణ్. 'పూర్వపదా' దితి ణత్వమ్. అగ్రహాయణీ పౌర్ణమాసీ. తద్యోగా న్నక్షత్ర మపి తథా' (భానుదీక్షితుని అమరవ్యాఖ్య, కాలవర్గ.)

వర్షపదమునకు వాన యనియు, సంవత్సర మని యును అర్థము. వానకాలమునుండి, అనగా ఉత్తరాయణాంతమునుండి ఒకానొకప్పుడు సంవత్సరారంభ మయి యుండును. కావున వర్ష పదమునకు సంవత్సరము అను అర్థము సంభవించెను. కాని ఏ ఆయనాంతమునుండి సంవత్సరాది యైనను విషువము4 సంవత్సరమునకు మధ్య దినము కాదు. విషువమునకు సంవత్సరాది ఇటు మూన్నెలలును, అటు తొమ్మిది నెలలును ఉండును. కావున యజ్ఞకాలములో విషువమునుండియే సంవత్సరాది యని శ్రీ బాలగంగాధరుల యభిప్రాయము.

## మాసాది

మాసారంభము మొదట పున్నమనుండి. తైత్తిరీయసంహిత మాఘపూర్ణిమనుండి సంవత్సరాదిని చెప్పుచున్నది. వేదాంగజ్యోతిషము, పైతామహసిద్ధాంతము దక్షిణాయనాంతదినమునుండి సంవత్సరాదిని చెప్పుచున్నవి. అనగా మాఘము. కాని యీ రెంటను అమావాస్యతో సంవత్సరాది యని కలదు. సిద్ధాంతములను ఆ విధముగనే కైకొనెను. కాని కొంతకాలమునకు అమావాస్య పున్నమకు మారెను. కొన్ని దేశములందు నేటికిని పున్నమనుండియే సంవత్సరాది.

## ఋత్వాది

ఋతువులందు హేమంతము మొదటి ఋతువని చూచితిమి. ఒకానొక కాలమున వసంతము మొదటి ఋతువు. ఆ పరిగణనము నేటికిని అనువర్తిత మగు చున్నది. శతపథబ్రాహ్మణమున వసంతము, గ్రీష్మము, వర్షము ఈ మూడును దేవర్తువులు5. శరద్ధేమంతశిశిరములు మూడును పితౄతువులు. ఇటులే దేవనక్షత్రము లనియు6, పితృనక్షత్రము లనియు విభాగము కలదు. వాసంతవిషువము (Vernal equinox, సుమారు 21st Mar) మొదలుకొని ఆరు నెలలు ఉత్తరాయణము. శారదవిషువము (Autumnal equinox, సుమారు 21, Sept) ఆరునెలలు దక్షిణాయనము.

కాలక్రమమున నిది మారి దక్షిణాయనాంత దినము (W. Solstice 21 Dec) మొదలుకొని ఉత్తరాయణమను గణనము ప్రచారములోనికి వచ్చెను. మరికొంతకాలమునకు వాసంతవిషువద్దినమునుండి (V. equinox 21 Mar) సంవత్సరాది ప్రచారములోనికి వచ్చెను.

## బార్హస్పత్యాబ్దము

వేదాంగజ్యోతిషమునందును, పైతామహసిద్ధాంతమునందును అయిదు సౌరవర్షము లొక యుగమని గణన. పురాణజ్యోతిషమునందును ఈ గణనము మాట కలదు. ఇట్టి యుగముతో బృహస్పతి భగణభోగకాలము యుక్తమై బార్హస్పత్యాబ్ద మానవ్యవస్థిత మాయెను. కార్తికమాసముతో ఈ యబ్దారంభము. కావున కృత్తికలో విషువ మున్నప్పుడే యబ్దమునకు గణనము.

కృత్తికలో విషువ మున్నప్పు డశ్లేషతో రవి ఉత్తరగతియు, ధనిష్ఠతో దక్షిణగతియు చెల్లు. కావున వేదాంగజ్యోతిషరచనాకాలమునగాని, దానికి ముందుగాని బార్హస్పత్యమానారంభము. శ్రీ శ్రీధర వెంకటేశకేతకరుల లెక్క వెనుక వ్రాసియుంటిని.

---

4. 'ఫాల్గునే దీక్షేరన్. ముఖం వా ఏత త్సంవత్సరస్య యత్ ఫాల్గునీ ముఖత ఏవ తత్ సంవత్సర మారభ్య దీక్షంతే తస్య సా నిర్యాయత్ సమ్మేఘే విషువాన్ సంపద్యతే' (తాండ్య బ్రాహ్మణ. ౫-౯.)

5. 'వసంతో గ్రీష్మో వర్షా. తే దేవా ఋతవః. శరద్ధేమంతః శిశిర స్తే పితరః'. (శత. బ్రా. ౩-౧-౩)

6. 'దేవగృహా వై నక్షత్రాణి......కృత్తికాః ప్రథమమ్. విశాఖే ఉత్తమమ్. తాని దేవనక్షత్రాణి. అనూరాధాః ప్రథమమ్. అపభరణీ రుత్తమమ్. తాని యమనక్షత్రాణి. యాని దేవ నక్షత్రాణి తాని దక్షిణేన పరియంతి. యాని యమనక్షత్రాణి తా న్యుత్తరేణ'.

## సంహితాజ్యోతిషము

జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకులు పదునెనమండ్రు రని ప్రసిద్ధి.[7] సూర్యుడు పితామహుడు[8] వ్యాసుడు వసిష్ఠుడు అత్రి పరాశరుడు కశ్యపుడు నారదుడు గర్గుడు మరీచి మనువు అంగిరసుడు లోమశుడు, లేక రోమకుడు[9] పౌలిశుడు[10] చ్యవనుడు యవనుడు భృగువు శౌనకుడు అని వారి పేరులు. మనకు వీరి పేరులు దొరకెనను సంబరమే కాని వారు రచించిన యే గ్రంథమును సమగ్రముగా దొరకదు.

ఈ పైని గల శాస్త్ర ప్రవర్తకులలో పరాశరుడు కశ్యపుడు నారదుడు గర్గుడు[11] వ్యాసుడు మనువు

---

7. ఆ ఇన్-ఇ-అక్బరీలో పుస్తకబృహస్పతి సిద్ధాంతమును చేర్చి అబుల్ ఫజల్ ఇరువది సిద్ధాంతములని వ్రాసెను. బృహత్సంహితలో దేవలసంహిత యొకటి కలదు. అందు అశ్విని ఆది. (చూ. బృహత్ శుక్రచారాధ్యాయ.)

8. విష్ణుధర్మోత్తరపురాణమున బ్రహ్మసిద్ధాంతము సంగ్రహముగా గలదు. బ్రహ్మగుప్తుడు దానిని వివరించెను. ఆర్యభటాదులు పైతామహసిద్ధాంతకర్త యగు బ్రహ్మను ప్రథమమునిగా తలచిరి. ఖాల్డియావారు అబ్రహామ్‌ను ప్రథమజ్యోతిర్మునినిగా గణించిరి. కొందరు శబ్దపరిశీలకులు ఈ బ్రహ్మ, అబ్రహామ్ శబ్దములలో ఒకటి మరొకదానికి పూర్వరూప మనిరి. అది యటుండె. సిద్ధాంతములు దైవము లనియు, ఆర్షము లనియు, మానవములనియు ముత్తెగలు. బ్రాహ్మసూర్యాదులు దైవములు. పరాశరవసిష్ఠాదిసిద్ధాంతము లార్షములు. ఆర్యభట భాస్కరాది సిద్ధాంతములు మానవములు.

9. రోమకసిద్ధాంతము గ్రీసుకో, రోముకో సంబంధించిన జ్యోతిర్విషయముల జెప్పును. దాని బాట వేరు, భారతీయుల బాట వేరు. రోమ్ రోమకములు Alexandria అని కొందరు చెప్పిరి. Alexandria ను అల్ బేరునీ సైంద్ర అని కాబోలు వ్యవహరించెను. రోమకసిద్ధాంతమునందు అహర్గణము తెలిసికొనుటకు యవనపురమునందలి మధ్యాహ్న ముపాత్తము. దీనికి టాలెమీ పుస్తకము మూలము కానగును. లాట వసిష్ఠ విజయనంద్యార్యభటుల గణితమును గ్రహించి శ్రీషేణుడు రోమకసిద్ధాంతము చెప్పెనని బ్రహ్మగుప్తుడు. అల్ బేరునీ బావుదాజీ లీ మతమువారు. పంచసిద్ధాంతికలోని రోమక సిద్ధాంతమునకు లాటుడు వ్యాఖ్యాత. ప్రాచీనరోమక సిద్ధాంతమును లాట శ్రీషేణులు వివరించియుందురు. రోమకసిద్ధాంతమునందును, పైతామహసిద్ధాంతమునందును కరణాబ్దమును తన కాలమున కనుకూలముగా వరాహమిహిరుడు చూపించియుండవలెను.

లండనులో నొక రోమకసిద్ధాంత మున్న దనియు, అది ఫలగ్రంథ మనియు, దాన క్రీస్తు జాతకమును, జేకర్ పేరును కలదనియు, గ్రంథకర్త కర్మాక్ అను పారసీకు డనియు, రచనాకాలము ౧౬ A. D. అనియు Dr Kern వ్రాసెను.

10. ఈ పౌలిశునిమీద పాశ్చాత్యవిమర్శకులు చాల కథ లల్లిరి. ఇందు యవనపురమునండి ఉజ్జయినికిని, కాశికిని గల దూరమునకు లెక్క కలదు.

11. జ్యోతిషగ్రంథములలో గర్గవృద్ధగర్గులనుండి చాల శ్లోకముల ఉదాహరణములు కలవు. పురాణములలో గర్గుడు చెప్పిన జ్యోతిర్విషయములు కలవు. తైత్తిరీయబ్రాహ్మణమునందును గర్గుడు కనబడును. గర్గసంహిత చేసిన దే గర్గుడో. డా. కెర్న్‌కు 'గార్గిసంహిత' ఒకటి దొరకెను. మొదటి ౩౧ పుటలు లేవు. పదపటి ౯౧ పుటలు కలవు. ఇందు గ్రహయుద్ధము, గ్రహశృంగాటకము, ఇంద్రధ్వజము మొదలగు సంహితాసామాన్యములగు విషయము లున్నవి. యవనులు సాకేతమునుండి పుష్పపురమువరకు ఆక్రమింతు రని యుండుటచేసి ఐతిహాసికసాహాయ్యముతో డా. కెర్న్ దీని రచన క్రీ. పూ. ౧ శతాబ్దిలో ననియు, నాటినుండి ఆర్యులకు యవనపరిచితి యనియు, గర్గపరాశరాదు లందరు కల్పితపురుషులనియు, వా రసలు లేరనియు వ్రాసెను. ఈ మాటలో కటిక చీకటి జలజల రాలుచున్నది. ఋగ్వేదములోని గర్గునిమొదలు నేటి గర్గయ్యవరకు ఉన్న గర్గులందరు నీ మాటకు నవ్వుదురు. అది యటుండె. జైమిని యవనుల నెరుగును. చూ. పూర్వమీమాంసాసూత్ర.౧.౩. మాఘమాసమున గ్రహణము పట్టినయెడల వంగానర్తక యవన కాశిదేశములు నాశనమగునని పరాశరుడు. క్రీస్తు

భృగువు యవనుడు సంహితాకర్తలు. మిగిలినవారు సిద్ధాంతకర్తలు. ప్రకృతము మనకు కనబడుచున్న గ్రంథములనుబట్టి ఇట్టి నిర్ణయము చేయుదుముకాని రే పౌశ పరాశరసిద్ధాంతముకాని, వసిష్ఠసంహితకాని దొరకినయెడల ఈ నిర్ణయముకూడ మారవలయును.

ఈగ్రంథములు సంపూర్ణముగా మనకు దొరకనపుడు వానిలోని విషయములనుగాని, వాని కాల నిర్ణయమునుగాని సరిగా నెరుగుటకు వలనుపడదు. కాని పదపటి గ్రంథకర్తలు వీరి పౌర్వాపర్యమును భిన్నక్రమముగా తమతమ గ్రంథములలో వ్రాసిరి. అయిదవ శతాబ్దమునడుమ వరాహమిహిరుడు (బ్రాహ్మ) పైతామహ వాసిష్ఠ రోమక పౌలిశ సౌర సిద్ధాంతముల నవలంబించి పంచసిద్ధాంతికను వ్రాసెను. 'వేదాంగరూప మగు జ్ఞానము వేదమధ్యమున గలదు. పితామహుడు, లేక బ్రహ్మ దానిని బడసెను' అని సూర్యారుణసంవాదమున గనబడును. ఆ బ్రహ్మ చెప్పినదే బ్రాహ్మసిద్ధాంతము, లేక పైతామహసిద్ధాంతము.

వరాహమిహిరుడును, భట్టోత్పలుడును ఈ సంహితలనుండియు, సిద్ధాంతములనుండియు చాల శ్లోకము లుదాహరించిరి. కాని యివన్నియు మూలగ్రంథములుగా కనుపట్టవు.

ప్రాచీనగ్రంథములకు పెక్కు సంస్కరణములు జరిగెను. సంస్కర్తల పేరు లేకయే కొన్ని మారినటులను, కొన్ని సంస్కర్తల పేరున క్రొత్తగా పెట్టినటులును కనబడును. కావున వరాహమిహిరుడును, భట్టోత్పలుడును ఏ సంస్కర్తలనుండి ఉదాహరించిరో దురవగాహము.

పాశ్చాత్యపండితులును, భారతీయపండితులును ఈ సిద్ధాంతముల కాలమునుగూర్చియు, పౌర్వాపర్యమునుగూర్చియు విపులముగా చర్చించిరి. వివరము నెరుగగోరువారు యీ గ్రంథములు చూడగలరు.

లుప్తప్రాయమైన యీ సంహితలయందున్న విషయములను బృహత్సంహితను బట్టి యూహింపగలము. ఎట్లన, అది సంహితల సంకలనము. అందు గల నూరు నెనిమిది అధ్యాయములలోని విషయసూచిక నతిస్వల్పముగా నిట వ్రాసినచో సంహితల వైపుల్యము తెలియును. జ్యోతిర్విద్య ఆరహవిద్య ఉద్భిద్విద్య ప్రాణివిద్య భూవిద్య ఆయుర్వేదము వాస్తువిద్య రాజవ్యవహారము వాణిజ్యము అంగవిద్య శకునవిద్య ముహూర్తవిచారము జాతకము వివిధవిషయములు మొదలగునవి. మఱియు భట్టోత్పలు డుదాహరించిన ఏబదిమూడు పైచిలుకు గ్రంథములలోని మచ్చుముక్కలను చూచినచో నాటివారు ప్రకృతిని ప్రత్యక్షానుమానశాబ్దప్రమాణములతో నెంత పరిశీలించిరో అది మన కాశ్చర్యము కలిగించును.

వరాహమిహిరుడు తన పంచసిద్ధాంతికలో బ్రాహ్మసిద్ధాంతమునుండి అయిదు శ్లోకములుమాత్ర ముదాహరించెను. మన కివియే దక్కుడు. ఈ అయిదును గలిసి ఒక కరణగ్రంథ మనియు, మన కిపుడు దొరకినంతలో నిదియే ప్రాచీనగణిత మనియు చెప్పవచ్చును. ఈ శ్లోకములు నాటి సౌరవర్షమును, చాంద్రమాసమును, కృష్ణశుక్లపక్షములను, తిథులను, రవినక్షత్రములను, చంద్రనక్షత్రములను, వ్యతిపాతాదియోగములను, దివామానమును తెలుపును. నాటి ఆర్యులకు వీనితో పనియున్న దన్నమాట. నేటి పంచాంగమున నాటికంటె వారము, కరణము ఎక్కువ. నాటి నక్షత్రగణనమునకు ధనిష్ఠ ఆది. నే డశ్విని. యోగములలో నాడు వ్యతిపాత మాది, నేడు విష్కంభము.

## ప్రాచీనగణితము

వేదమధ్యకాలమున నున్న గణిత మెట్టు లుండెనో బ్రాహ్మసిద్ధాంతమునుండి దాని మచ్చు ఈదిసున.

---

చాల వెనుకనున్న పాణినికి యవనపరిచితి కలదు. మఱియు 'అరుణ ద్యవన స్సాకేతమ్' అను భాష్యోక్తిని పై గర్గోదాహరణముతో కలిపి చూచునది. మఱియు 'గర్గాః శ్శతం దండ్యంతామ్'='గర్గులనుండి నూరు (రూకలు) జరిమానా వసూలుపరచుడు' అను మహాభాష్యోక్తియందలి రహస్యముతో గర్గుల కేదో సంబంధము ఉండవలెను.

'ఐదేండ్లు రవిచంద్రుల కొక యుగము. ౩౦ నెలల కొక అధిమాసము. ౬౨ దినముల కొక అవమ' అని పితామహుడు చెప్పెను. అనగా ధనిష్ఠలో రవి చంద్రయోగమున ఉగాది. నాడు మొదలయిదేండ్లొక యుగము. ఐదేండ్లకు రవిచంద్రులు మరల ధనిష్ఠలో కలియుదురు. ౫ యుగములకు ౬౦ సౌరమాసములు, ౬౨ చాంద్రమాసములు. అనగా రెండధిమాసములు. చాంద్రమాసమునకు ౩౦ తిథులు, ౬౨ చాంద్రమాసములకు తిథులు ౧౮౬౦. ౬౨ తిథుల కొక అవమ. కాన ౩౦ తీసివేసినచో దినసంఖ్యవచ్చును. కాన ౫ సౌర వర్షములకు వచ్చిన ౧౮౬౦ దినములలో ౩౦ తీసివేసినచో ౧౮౩౦ దినములు12.

తిథ్యానయనము—౧౮౩౦ దినములలో, ౧౮౬౦ తిథు లున్నచో13 అహర్గణమున ?

$$\frac{\text{౧౮౬౦} \times \text{అహ}}{\text{౧౮౩౦}} = \frac{\text{౬౨} \times \text{అహ}}{\text{౬౧}} = \text{అహ} + \frac{\text{అహ}}{\text{౬౧}}$$

దివామానానయనము—'ఉత్తరాయణమున గడచినవియు, దక్షిణాయనమున గడవవలసినవియు నగు దిన సంఖ్యకు ౭౩౨ కలిపి, రెంట హెచ్చించి ౬౧ చే భాగింపగా వచ్చిన లబ్ధమునుండి ౧౨ తీసివేయుచో దివామానముహూర్తము వచ్చును.' = అలతిదినము ౧౨ ముహూర్తములు. వలతిదినము ౧౮. తేడా ౬ ముహూర్తములు. అయనమునకు ౧౮౩ దినములు. ఇపుడనుపాతము చేయునది. ౧౮౩ దినములలో ౬ ముహూర్తములు ఎడమగు చెడల ఉత్తరాయణాదినుండి గడచిన ఇష్టదినములకును, దక్షిణాయనమున గడవవలసిన దినములకును ఎన్ని ముహూర్తము లెడము ?

$$\frac{\text{౬} \times \text{ఇష్టదిన}}{\text{౧౮౩}} = \frac{\text{౨} \times \text{ఇష్టదిన}}{\text{౬౧}}$$

దీనికి పండ్రెండు ముహూర్తములు కలిపి దినమానము

$$\text{౧౨} + \frac{\text{౨} \times \text{ఇష్టదిన}}{\text{౬౧}} = \text{౨౪} + \frac{\text{౨} \times \text{ఇష్టదిన}}{\text{౬౧}}.$$

$$\text{౧౨} = \frac{\text{౨౪} \times \text{౬౧} + \text{౨} \times \text{ఇష్టదిన}}{\text{౬౧}} - \text{౧౨} = \frac{\text{౨}}{\text{౬౧}}$$

$$(\text{౧౨} \times \text{౬౧} + \text{ఇష్టదిన}) - \text{౧౨} = \frac{\text{౨}}{\text{౬౧}}$$

$$(\text{౭౩౨} + \text{ఇష్టదిన}) - \text{౧౨}.$$

---

12. ౫ ఏండ్లకు ౧౮౬౦ దినములు. ౧ ఏటికి ౩౬౬ దినములు. ౫ ఏండ్లకు. ౬౨ చాంద్రమాసములు. కాన చాంద్రమాసపరిమాణము ౨౯. ౫౧౬ దినములు. (సూర్యసిద్ధాంతమతమున ౨౯. ౫౩౧ దినములు). ౧౨ చాంద్రమాసములకు ౩౫౪. ౧౯౨ దినములు. ౩౬౬ దినముల యేడాదికి ౧౧. ౮౦౮ దినములు తక్కువ. ౫ ఏండ్లకు ౫౯. ౦౪ దినములు, లేక ౨ చాంద్రమాసము తక్కువ. చాంద్రమాసము ౩౦ దినములకు ౦.౪౮౪ దినము తక్కువ. ౬౨ దినముల కొకసారి ౧ తిథి తీసివేసినచో అహర్గణము, లేక దినసంఖ్య తుల్యమగును.

13. నాటినుండి తిథ్యానయనవిధానముగూర్చి తెలిసికొనుటకు తిథికల్పద్రుమ తిథిచింతామణి గణితతత్త్వచింతామణి తిథిచూడామణి గ్రహగణితము, లేక తిథిచక్రము మొదలగు గ్రంథము లారయునది. ఈ చివరి పుస్తకము రచించినవా డాంధ్రుడు. వాడపల్లివాస్తవ్యుడు. దీనిని ఆంగ్లవ్యాఖ్యతో సుగృహీతనామధేయులు శ్రీ ధూళిపాటి అర్కసోమయాజులుగారు M. A., B. Ed. తమ 'Planetary Theory of the Ancient Hindu Astronomers' అను గ్రంథము తుద ప్రకటించిరి.



# భూప్రదక్షిణము

— శ్రీ మావిండిపూడి వెంకటరంగయ్య —

ప్రకృతిశాస్త్రజ్ఞానదుర్వినియోగముచేత సంక్షుభితమైన ప్రస్తుతప్రపంచమున శాంతిని నెలకొల్పుటకు ప్రేమ, అహింస, సహనము తప్ప వేరుమార్గములు లేవని ఏబదిసంవత్సరములుగ తదేకదీక్షతో ఉపదేశించి, ఆ ఉపదేశానుసారముగ సర్వకాల సర్వావస్థలందును ఏకాగ్రతతో ప్రవర్తించి మానవకల్యాణమునకును, దానికి ప్రధానాంగమగు భారతీయుల దాస్యవిమోచనమునకును నిరంతరము కృషిచేసిన సాధుసత్తముడును, అవతారపురుషుడును అగు మహాత్మాగాంధీని ప్రపంచము పోగొట్టుకొన్నది.

"మన సారథి మన సచివుడు
మన వియ్యము మన సఖుండు మన బాంధవుడున్
మన విభుడు గురుడు దేవర
మనలను దిగనాడి చనియె........"

ముప్పదికోట్ల భారతీయులు విషాదసాగరమున మునిగియున్నారు. తన సారథ్యముచే కౌరవబలము నంతను నిర్మూలము గావించి పాండవులకు విజయము చేకూర్చిన శ్రీకృష్ణుడు అధముడగు ఒక వేటకాని బాణమునకు గురియై ప్రాణమును కోల్పోయినట్లు కాంగ్రెసురథమునకు సారథియై, అహింస యను గుఱ్ఱములచే దానిని అతికౌశలముతో నడిపి, మహాసామ్రాజ్యము లన్నిటిలో అగ్రస్థానము వహించిన బ్రిటిష్ సామ్రాజ్యము నోడించి, భరతఖండమునకు స్వరాజ్యము సంపాదింపగలిగిన మహాయోధుడు తుచ్ఛుడగు ఒక హంతకుని గుండుదెబ్బకు గురియై ప్రాణములు విడువవలసివచ్చెను. ఇది ఒక్కటే విచారమునకు హేతువు. ఇట్టి విపరీతము జరుగునని స్వప్నమందుకూడ ఎవరును అనుకొనలేదు. కాని నిజముగా ఇది విచారమునకు



సమయము కాదు. మహాత్ముడు అమరజీవి. అతడు భౌతికశరీరమును విసర్జించెనేగాని, ఏ తత్త్వమును ఉపదేశించుటకు అతడా శరీరమును సాధనముగ నుపయోగించెనో, ఏ తత్త్వమును ఉపదేశించినందులకై ప్రపంచమంతయు నేడు అతనిని పూజించుచున్నదో

ఆ తత్వము నాశరహితమైనది; ఆచంద్రార్కము స్థిరముగ నుండునది. ఆ జ్యోతిని ఆర్పివేయగల శక్తి ఎవ్వరికిని లేదు.

## కర్తవ్యము

కాని ఇప్పుడు మనము చేయవలసిన పని ఎట్టిది? అన్న విషయమై ప్రజలు, ప్రజానాయకులు పరిపాలక వర్గమువారు ఆలోచించవలసియున్నది. గాంధీమహాత్ముని హత్య తోకచుక్క వంటిది. తోకచుక్క కనపించినప్పుడు ప్రపంచమున ఏదో ప్రమాదము సంభవించు నని పెద్దలు చెప్పుట కలదు. సాత్వికశిఖామణి యగు మహాత్ముని హత్య దేశమునకు రానున్న ప్రమాదమును సూచించుచున్నది. సుమారు నూరుసంవత్సరములకాలము బ్రిటిష్‌వారు వారి సైనికబలముచేతను, సామదానభేదదండములు ప్రయోగించుటయందు వారికి గల నేర్పుచేతను, దేశమందు శాంతిభద్రతలను స్థాపించి ప్రజలందరు చట్టబద్ధులై జీవించునట్లు చేసిరి. ఇప్పుడు పరిపాలనమంతయు కాంగ్రెసునాయకుల చేతులలోనికి వచ్చినది. కాని వారి అధికార మింకను దేశమందు స్థిరముగ నాటుకొనలేదు. ఒక ప్రభుత్వము మారి మరియొక ప్రభుత్వము స్థిరపడునంత వరకు అధికారములోనికి వచ్చుటకు అనేకవర్గములవారు, భిన్నఆశయములు గలవారు ప్రయత్నించుట సహజము. అధికారవ్యామోహము మూలమునమాత్రమే గాక, ఆదర్శములయందు భేద ముండుట మూలమున గూడ ప్రముఖులలో కొందరు కాంగ్రెసువర్గమును అధికారమునుండి తొలగించి స్వాధికారమును స్థాపించుకొనజూచెదరు. ఇదికూడ మానవస్వభావమే. కాంగ్రెసుకు గాంధీమహాత్ముడు గురు వనియు, కాంగ్రెసుకు గల బలమునకును, పలుకుబడికిని, పేరు ప్రఖ్యాతులకును ప్రజలకు మహాత్మునియందు గల గౌరవమే ప్రధానకారణ మనియు, గురుస్థానమునుండి వారిని తొలగించినగాని కాంగ్రెసుయొక్క బలమును నాశము చేయుటకు వీలుండ దనియు, వారు జీవించియుండునంతవరకు గురుస్థానమునుండి వారిని తొలగించుటకు సాధ్యము కాదనియు అనుకొన్నవారు దేశమందు కొంద రుండుటచేతనే వారికి ఘోరహత్య సంప్రాప్తమయ్యెను. కాంగ్రెసు పక్షము యొక్క బలమును వినాశముగావించు ప్రయత్నములో ఇది మొదటి మెట్టు అని గ్రహించవలసియున్నది. కాని ఇది ఇంతటితో ముగియదు. తపశ్శాలియగు గాంధీ మహాత్మునినే చంపినవారు ఇతర నాయకులను చంప ప్రయత్నించకమానరు. ఒక నాయకులనే గాదు, అధికార సంపాదనమునకై తాము చేయు ప్రయత్నముల కేమాత్రము ఆటంకము కలిగించినను అట్టి ఆటంకమును కలిగించువారిని చంపుటకు వారు వెనుదీయరు. అనగా పరిపాలనాధికారమును సంపాదించుటయందు దౌర్జన్యము, రక్తపాతము అనుసరణీయము లగు సాధనములని నమ్మినవారు తదేకదీక్షతో ఇప్పటినుండి కృషిచేయ సంసిద్ధులైనారని ప్రజలు తెలుసుకొనవలసి ఉన్నది. దౌర్జన్యము నుపయోగించక, విస్తారరక్తపాతము లేక మహాత్ముని నాయకత్వమున మనము బ్రిటిషు వారిని ఓడింపగలిగితి మని గర్వపడుచుంటిమి. కాని దీనిమూలమున మనము సాధించిన స్వరాజ్యము ఏ భారతీయుల ఏలుబడిలో ఉండవలె నను విషయమును తీర్మానించుటలో రక్తపాతము గావించుటకు సిద్ధపడినవారు దేశమందున్నారనియు, వా రందుకై తీవ్రప్రయత్నములు గావింపబోవుచున్నారనియు, ఇదియే మనకు కలుగబోవు ప్రమాద మనియు మనము గ్రహించ వలసియున్నది.

## నిరంకుశత్వము

స్వరాజ్యమును సంపాదించిన తర్వాత దేశమును పాలించు సందర్భములో దౌర్జన్యమును, హత్యలను, రక్తపాతములను సాధనములుగ నుపయోగించుటకంటె ప్రమాదము వేరొకటి లేదు. ఇట్టి సాధనములద్వారా అధికారములోనికి వచ్చు ప్రభుత్వమునకు స్థిరత్వ ముండదు. అట్టి ప్రభుత్వములో చేరినవారు నిర్భయముగ పరిపాలనము చేయలేరు. తమ ప్రాణములను రక్షించుకొనుట యందును, తమకు విరోధులన్నవారు దేశమం దుండకుండ చేసుకొనుటయందును కాలము గడపవలసినవా రగుదురు. వారి ప్రభుత్వము నిరంకుశ మగును. విరో

ధులను వెదకిపట్టుకొనుటకై పోలీసువారికి ఎక్కడలేని అధికారము ఇయ్యవలసియుండును. అధికారుల చర్యలను విమర్శించుటగాని, ఖండించుటగాని, అట్టి విమర్శలు చేయుటకై పదిమంది కలిసి పనిచేయుటగాని నేరమగును. వాక్స్వాతంత్ర్యము అడుగంటును. ఇతరవిషయములలో స్వేచ్ఛ అన్నది లేకపోవును. ప్రజలు భయభ్రాంతులై, ప్రభుత్వోద్యోగులకును, వారి గూఢచారులకును దాసానుదాసులై మెలగవలసినవారగుదురు. ఇదే నిరంకుశత్వము. ఇట్టి రాజ్యము నిజమైన స్వరాజ్యము కాజాలదు. ప్రజలలో ఎవరు దౌర్జన్యమును ఉపయోగించి ఇతరులను భయపెట్టుటయందు సమర్థులో వారిదే రాజ్యము. తక్కినవారు వారి చెప్పుచేతలలో ఉండవలసినవారగుదురు. గాంధీమహాత్ముని హత్య ఇట్టి నిరంకుశప్రభుత్వమునకును, దీనికి పునాదియగు రక్తపాతసహితమగు దౌర్జన్యమునకును దారితీయు ప్రమాదము రానున్నదని సూచించుచున్నది.

## కాంగ్రెసును విమర్శించువారు

కాంగ్రెసుపక్షమువారి పరిపాలనము దేశమునకు నష్టము కలిగించుచున్నదనియు, వారిని అధికారమునుండి తొలగించినగాని దేశసౌభాగ్యము వృద్ధికాజాలదనియు కొందరి తలంపు. మహాత్ముని హత్యగావించినవాడు అట్టి వర్గమునకు చెందినవాడే. కాంగ్రెసుయొక్క రాజకీయతత్వము సరియైనది కాదని వారి అభిప్రాయము. రాజ్యాంగపరిషత్తుద్వారా మనము నిర్మించుకొనదలచిన రాజ్యము హిందూరాజ్యముగ నుండవలెననియు, హిందువులు కానివారికి సంపూర్ణమైన రాజకీయహక్కులు ఉండరాదనియు, మహమ్మదీయులు మొదలైన అల్పసంఖ్యాకులకు ప్రత్యేకరక్షణలు అవసరములు కావనియు, ఎవరి ఆందోళనమూలమున దేశము విభక్తమై పాకిస్థానము, ఇండియా అను రెండు రాజ్యము లేర్పడెనో అట్టి మహమ్మదీయులకు ఇండియాలో సమానగౌరవ ముండరాదనియు, వారి నందరిని పాకిస్థానమునకు పంపివేయుటగాని, నిర్మూలముచేయుటగాని అధర్మము కాదనియు వారి విశ్వాసము. కాంగ్రెసుపక్షమువారును, మహాత్మాగాంధీగారును మొదటినుండి ఈ సిద్ధాంతమును ఖండించినవారు. మతభేదములనుగాని కులభేదములనుగాని పాటింపక, దేశములోని వ్యక్తుల నందరిని ఒకే విధముగ నాదరించురాజ్యమే ఆదర్శపూర్వరాజ్యమనియు, హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, సిక్కులు, పార్సీలు—అందరును సమానహక్కులు గలవారలుగ నుండునట్లు చేయుటయే మనకు అనుసరణీయమనియు వారి అభిప్రాయము. మహాత్ముడు ఈ ధర్మమును నిలబెట్టుటకై ప్రాణత్యాగమునుగూడ గావించెను. ఇదిగాక కాంగ్రెసుప్రభుత్వమువారు పాకిస్థాన్‌పట్ల అనవసరముగ దయాదాక్షిణ్యములు చూపుచున్నారనియు, దండమును ప్రయోగించవలసిన ప్రస్తుతసమయమున సామోపాయము నొకదానినే అనుసరించుచున్నారనియు, కాశ్మీరముపై దాడి చేయు కొండజాతులవారికి పాకిస్థాన్ ప్రభుత్వమువారు సహాయముచేయుచున్నారని దృఢపడినపుడు పాకిస్థానముపై దండెత్తి వారికి బుద్ధిచెప్పుటయే మార్గము కాని, అట్టి చర్య తీసుకొనక ఐక్యరాజ్యసమితియొక్క సహాయమును కోరుట మన ప్రతిష్ఠకు భంగకరమనియు, అట్లే హైదరాబాదుపైకి సైన్యములను పంపి నైజామును లోబరచుకొనుటకు బదులు అతనితో యథాతథపు ఒడంబడిక చేసుకొనుట తగని పని అనియు వీరి మతము. మరికొందరు కాంగ్రెసువారిని మరికొన్ని కారణములచే విమర్శించుచున్నారు.

ఈ విధముగ విమర్శ చేయుచుండువారిలో హిందూమహాసభవారు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, ఎడమ పక్షమునకు చెందిన మరికొందరు పేర్కొనతగియున్నారు.

## అధికారసంపాదనము : మార్గాంతరము

ఈ విమర్శలన్నియు సహేతుకములా, కావా అని వితర్కించుట కిది సమయము కాదు. కాంగ్రెసుపక్షము వారిని అధికారమునుండి తొలగించి, హిందూమహాసభవారు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు మొదలైనవారు కేంద్రప్రభుత్వమందును, రాష్ట్రప్రభుత్వములందును మంత్రులైనప్పుడే దేశమునకును, సామాన్య

ప్రజలకును లాభకరముగ నుండు పరిపాలనము ఏర్పడు నని మీరు అభిప్రాయపడవచ్చును. కాని కాంగ్రెసు వారిని తొలగించుటకును, ఇతర పక్షములవారు అధికారములోనికి వచ్చుటకును మార్గ మేది అను విషయ మొక్కటే ఇచ్చట నిర్ణయించవలసియున్నది. కాంగ్రెసు నాయకులను, వారి ననుసరించు ఇతర ప్రముఖులను హత్యగావించి, దౌర్జన్యము రక్తపాతములద్వారా మీరు అధికారమునకు వచ్చుటయా, లేక మార్గాంతర మేమైన గలదా? అట్టి మార్గ మొకటి ఉన్నది. అదియే అనుసరణ యోగ్యమగు మార్గము. సవ్యమైన పరిపాలనము జరుగుటకు అదితప్ప వేరు మార్గము లేదనికూడ చెప్పవచ్చును.

## ప్రజామోదమును సంపాదించుట

ప్రజల ఆమోదమును సంపాదించుటయే ఆ మార్గము. స్వరాజ్యమనగా ప్రజారాజ్యముగ నుండవలెను. ప్రజారాజ్యమనగా ప్రజలు ఎన్నుకొన్నవారు—వారి ఆమోదమును పొందినవారు పరిపాలకు లగుట, ఆ ఆమోదము ఎంతకాల ముండునో అంతకాలమువరకే వారు అధికారములో ఉండుట, అది ఉన్నదో లేదో కనుగొనుటకు మూడునాలుగు సంవత్సరముల కొకపర్యాయమైనను ఎన్నికలు జరుగుట, పరిపాలనమందుండువారి చర్యలను, వారు గావించు చట్టములను, వారి పరిపాలన క్రమమును వార్తాపత్రికలద్వారాగాని, గ్రంథముల ద్వారాగాని, సభలద్వారాగాని ప్రజలు స్వేచ్ఛగా విమర్శించుట, దీని మూలముగ ప్రజాభిప్రాయ మేర్పడుట, ఎన్నికలలో దాని ఫలితము ప్రతిబింబిత మగుట. ఇట్టి పరిపాలనవిధానము ఏ దేశమందుండునో, అట్టిదేశములో దౌర్జన్యముగాని, రక్తపాతముగాని లేకయే మంత్రివర్గమువారు మారుటకు అవకాశ మున్నది. రెండుసంవత్సరములక్రింద ఎన్నికలు జరుగుటమూలముననేగదా కాంగ్రెసు పక్షము వారు మంత్రులు కాగలిగినది! తిరిగి ౧౯౫౨ లో ఎన్నికలు జరుగనున్నవిగదా? ఇంతటికిని కేంద్రమున కాంగ్రెసు వారి అధికారము స్థాపితమై ఆరుమాసములుకూడ కాలేదు. వారు ప్రజలసౌభాగ్యమునకై ఏమి చేయ గలిగినదియు, ఏమిచేయలేనిదియు నిర్ణయించుటకు ఇంకను కాలవ్యవధి చాలదు. వారిలో లోపములు లేవని ఎవరును చెప్పుటలేదు. కాని ౧౯౫౨ లో జరుగనున్న ఎన్నికలవరకు వేచియుండి, ఈమధ్యకాలమున ప్రజాభిప్రాయమును మార్చి, ఎన్నికలలో ప్రజామోదమును సంపాదించి అధికారములోకి వచ్చుట సక్రమముగాని నాయకులను హత్యచేసి, దేశమందు అరాచకపరిస్థితులను కల్పించి, అధికారమును సంపాదింపజూచుట ప్రమాదకరము. ప్రజాస్వామ్యము లేని దేశము లనేకము లున్నవి. అందు పరిపాలకులను విమర్శించి, వారి పరిపాలనము చక్కగ లేదని ప్రజలకు నచ్చజెప్పి, ఎన్నికలలో వారి ఆమోదమును పొంది, అదికారణముగ అధికారములోనికి వచ్చుటకు వీలులేదు. పరిపాలకుల చర్యలు ఎంత సహింపరానివైనను దౌర్జన్యము నుపయోగించక వారిని తొలగించుటకు వీలుండదు. అట్టి దేశములలో రక్తపాతముతో గూడుకొనిన విప్లవములు జరుగుట అవసరము కావచ్చును. ప్రజామోదమును ఎన్నికలలో పొందినవారు పరిపాలించుచుండు మన దేశములో అట్టి అవసరము లేదు. ఇప్పుడు రాజ్యాంగపరిషత్తువారు నిర్మించుచుండు రాజ్యాంగ విధానములో ప్రజారాజ్యమునకు ఇప్పటికంటె ఎక్కువ అవకాశము ఏర్పడనున్నది. శాసనసభలలోని సభ్యులను, తద్ద్వారా పరిపాలకవర్గమును ఎన్నుకొను హక్కు యుక్తవయస్సు వచ్చిన స్త్రీపురుషులందరికిని లభింప గలదు. ధనికులు దరిద్రులు, భూస్వాములు కార్మికులు, మహమ్మదీయులు మహమ్మదీయేతరులు అను భేదములు ఉండజాలవు. ఇట్టిసందర్భములో దౌర్జన్యమును ఉపయోగించుటయు, తద్ద్వారా అధికారములోనికి వచ్చుటకు ప్రయత్నించుటయు అనుచిత మని వేరుగ చెప్పనక్కరలేదు.

## కేంద్రమందు కాంగ్రెసుపరిపాలనము

నెహ్రూ నాయకత్వమున సుమారు అయిదు నెలలక్రింద కేంద్రములో ఏర్పడిన మంత్రివర్గమువారు చేయ నుద్దేశించుకొన్నదానికిని, చేయగలిగినదానికిని ఎంతో తారతమ్య మున్నది. ఉద్దేశించుకొన్నదానిలో సహస్రాంశముకూడ వారు చేయలేరైరి. నెహ్రూ సోషలిస్టు అనియు, సామాన్యప్రజల సౌభాగ్యమును

వృద్ధిచేయు ఆర్థికవిధానమే సక్రమమైనవిధానమనియు, అట్టి విధానమున కనుగుణముగ రాజ్యాంగ ముండవలెనని ప్రతిపాదించు సిద్ధాంతమే సోషలిస్టు సిద్ధాంతమనియు మన మీ సందర్భమున మరువకూడదు. కొన్ని సంవత్సరములక్రిందట నెహ్రూ జాతీయఆర్థికప్రణాళిక సంఘము (National Planning Committee) నకు అధ్యక్షులై చాలవరకు సోషలిస్టు సిద్ధాంతమున కనుగుణముగ ప్రణాళికను తయారుచేసెను. అట్టి నాయకుని పరిపాలనలో సోషలిజమును ఆచరణలో పెట్టుటకు కావలసిన ఏర్పాటు లనేకములు జరుగునని ఆశించుట సహజము. కాని స్వరాజ్యము వచ్చియురాక ముందే, పడమటి పంజాబులో దురంతములు ప్రారంభమై లక్షలకొలది హిందువులు, శిక్కులు తూర్పు పంజాబులోనికి, ఢిల్లీలోనికి పారివచ్చుట సంభవించెను. సుమారు ఏబదిలక్షల జనమునకు—కాందిశీకులకు—తగిన వసతులను ఏర్పాటుచేయుట అత్యవసరమయ్యెను. మరి ఏ విషయమునుగురించి ఆలోచించుటకు వ్యవధిలేని పరిస్థితులు ఏర్పడెను. ఇప్పటికికూడ ఈ సమస్య పరిష్కారము కాలేదు. కాందిశీకుల మూలమున మహమ్మదీయులపై గల క్రోధము మరింత వృద్ధిఅగుటయు, దాని ఫలితముగ వా రనుభవించవలసిన కష్టనష్టములు వర్ణనాతీతము లగుటయు, దానికి ప్రతిఫలముగ పాకిస్థానములోని అల్పసంఖ్యాకులగు హిందువులయొక్కయు, శిక్కులయొక్కయు, స్థితి దుర్భరమగుటయు, దినదినప్రవర్ధమానమగు ఈ పరస్పరద్వేషమును చూడలేక దాని నంతరింపజేయుటకై గాంధీమహాత్ముడు ఉపవాసదీక్ష వహించుటయు, తుదకు వారి హత్యకుకూడ ఈ ద్వేషమే కారణమగుటయు అందరికి తెలిసినదే. కాందిశీకుల సమస్యతోపాటు కాశ్మీర సమస్య యొకటి ఉత్పన్నమయ్యెను. పాకిస్థానము ద్వారా తండోపతండములుగ వచ్చు దోపిడిగాండ్రను ఎదుర్కొనవలసివచ్చెను. ప్రయాణసౌకర్యములు లేని పర్వతప్రాంతములమీదుగ కాశ్మీరములోనికి మన సైన్యములు, సైన్యపరికరములు వెళ్ళవలసివచ్చెను. ఇదంతయు చలికాలములో జరగవలసి వచ్చుటచేత, కాశ్మీరయుద్ధము ప్రారంభమై ఇప్పటికి సుమారు మూడుమాసములు కావచ్చినను, ఇంతటివరకు మనకు జయము లభించలేదు. ఈ గొడవలలో చిక్కుకొనియుండుటచేత నెహ్రూవంటి సోషలిస్టునాయకుడు కూడ ఆర్థికనిర్మాణమువిషయమై ఏమియు చేయలేకున్నాడు. కాని ఈ అయిదు నెలలలో కేంద్రప్రభుత్వమువారు చేసిన ఘనకార్యము లేవియు లేవని మనము భావించకూడదు. కాందిశీకుల సంరక్షణమునకై వారు చేసిన ఏర్పాటులు ప్రశంసింపదగియున్నవి. ఇదిగాక సర్దార్‌పటేల్ నాయకత్వమున సంస్థానములవిషయమై చేయబడిన మార్పులు ముఖ్యముగ గమనింపదగియున్నవి.

## సంస్థానములు

ఈ మార్పులలో ముఖ్యమైనవి మూడు కలవు. (౧) దేశములో సుమారు ఆరువందల సంస్థానములు—పెద్దవి, చిన్నవి—ఉన్నవన్నమాట అందరికిని తెలిసినదే. ఆగష్టు ౧౫ తేదీన బ్రిటిష్ ప్రభుత్వము తొలగగానే ఇవన్నియు సర్వస్వాతంత్ర్యము కలవి అయ్యెను. కాని స్వతంత్రరాజ్యము లిన్ని దేశములో నుండుట అనేకవిధముల ప్రమాదకరము. అందుచేత వాటిని ఇండియారాజ్యములో చేరునట్లు ప్రోత్సహించుట అత్యవసరమయ్యెను. సైనిక బలప్రయోగము చేసి, వాటిని బెదిరించి వశపరచుకొనుట క్రమపద్ధతి కాదని వాటితో సంప్రతింపులు కావించి తుదకు హైదరాబాదుతప్ప ఇండియాను అనుకొనియుండు తక్కిన సంస్థానములన్నియు ఇండియాలో చేరునట్లు పటేల్ చేయగలిగెను. (౨) కాని ఇంతటితో సంస్థానముల సమస్య పరిష్కారము కాలేదు. వీటిని పాలించువారు నిరంకుశులగు ప్రభువులు. చట్టబద్ధముగ ప్రజలను ఏలువారు కారు. వారు విధించు శిక్షలు అతికఠినములైనవి. వారు మితిలేని పన్నులను వసూలుచేయుచుండిరి. ప్రజలకు ఎట్టి స్వాతంత్ర్యమును లేదు. అందుచేత నిరంకుశత్వమును తొలగించి, ప్రజాస్వామ్యమును స్థాపించుటకై అనేకసంస్థానములలో ప్రజానాయకులు ఆందోళన చేయసాగిరి. కొన్నిటిలో ప్రజలు తిరుగబడిరి. పరిస్థితులు విషమించు నని తలచి పటేల్ కొందరు ప్రభువులతో సంప్రతింపులు గావించి, ప్రజా

స్వాతంత్ర్యమును నెలకొల్పుటకు కావలసిన ఏర్పాటులు చేసెను. కొన్ని సంస్థానములలో ప్రజాప్రతినిధులతో కూడిన శాసనసభలు, మంత్రివర్గము ఇప్పటికే ఏర్పడియున్నవి. తక్కినవాటిలో అనతికాలముననే అట్టివి ఏర్పడగలవు. (౩) కాని, సంస్థానములలో ఏ పది పదిహేనో తప్ప తక్కినవన్నియు మిక్కిలి చిన్నవి. సంవత్సరమునకు నూరురూపాయల ఆదాయముమాత్రమే గల సంస్థానములు కొన్ని కలవు. ఇట్టివాటిలో సొంతముగ పరిపాలనమునకు అవకాశమే లేదు. స్వల్పాదాయముగల సంస్థానాధీశులు ప్రజల సౌభాగ్యము నెట్లు వృద్ధిచేయగలరు? విద్యావ్యాప్తికి, ఆరోగ్యాభివృద్ధి, ఆర్థికాభివృద్ధి! కావలసిన ద్రవ్యము వారి కెక్కడ కలదు? ఇట్టి సంస్థానములు కొన్నిటిలో ప్రజాస్వాతంత్ర్యోద్యమము ప్రారంభమయ్యెను. దాని నణచుటకు ప్రభువులు సమర్థులు కాకైరి. వారిలో కొందరు రాజ్యమును వదలి ప్రదేశాంతరములకు పారిపోవలసి వచ్చెను. అందుచేత అరాజకము తలయెత్తెను. వారిలో కొందరు పరిపాలనభారమును తాము వహింప సామర్థ్యము లేదని కేంద్ర ప్రభుత్వమునకు విన్నవించుకొనిరి. ఇట్టి పరిస్థితులను పటేల్ గమనించి చిన్న సంస్థానముల సమస్యను పరిష్కరించుటకు వాటి సమీకరణము గాని, వాటిని చుట్టుప్రక్కల నుండు రాష్ట్రములలో కలిపివేయుట గాని తగిన సాధనమని నిశ్చయించి గతమాసములలో దానిని అనేక ప్రదేశములలో ఉపయోగించెను.

ఇండియాతూర్పుభాగమునందుండు సంస్థానములలో కొన్ని ఒరిస్సాలోను, కొన్ని మధ్యరాష్ట్రములలోను, కొన్ని బీహారులోను కలిసిపోయినవి. దక్కను సంస్థానములు కొన్ని బొంబాయిలో కలిసిపోయినవి. ఇట్లు కలియుటచేత ఈ ప్రదేశములలోని ప్రజలకు మంచి పరిపాలనలాభము లభించుననుట నిశ్చయము. చిన్న సంస్థానముల ప్రభుత్వములు చేయలేని పనులను రాష్ట్ర ప్రభుత్వములు చేయగలవు. ఇదిగాక రాష్ట్రములలోని తక్కిన ప్రజలకు శాసనసభలలో ప్రాతినిధ్యమున్నట్లు సంస్థాన ప్రజలకు కూడ ప్రాతినిధ్యము లభించును. సంస్థానాధీశులు నిర్ణీతమైన పెన్షనుతో తృప్తిపడియుందురు.

## సౌరాష్ట్రము

ఈ చిన్న సంస్థానముల సమస్య బొంబాయి రాష్ట్రమును ఆనుకొనియుండు కాతియవారులో అతిక్లిష్ట రూపమును ధరించియుండెను. అందు ౨౨౦ కి మించిన సంస్థానము లున్నవి. పదిపండ్రెండు తప్ప తక్కినవన్నియు మిక్కిలి చిన్నవి. ఏసంస్థానములోని గ్రామములుకూడ ఒకే ప్రదేశమున లేవు. ఇందుచేత సౌకర్యమగు పరిపాలన సాధ్యము కాకుండెను. పటేల్ యొక్క ప్రయత్నమువలన ఈసంస్థానముల సమీకరణము పూర్తియై, సౌరాష్ట్ర మను పేర క్రొత్త రాష్ట్ర మొకటి ఏర్పడెను. ఇందు సుమారు ఏబది లక్షల ప్రజ లున్నారు. వీరి కందరికి కలిసి ఒకే ప్రభుత్వము స్థాపింపబడును. ప్రజ లెన్నుకొనిన ప్రతినిధులతో కూడిన ప్రజాపరిషత్తుద్వారా రాజ్యాంగనిధానము ఏర్పడును. ప్రజాస్వామ్యసిద్ధాంతము ననుసరించి ఇకమీదట పరిపాలన జరుగగలదు. ఇదేవిధముగ మధ్య ఇండియాప్రాంతములోని సంస్థానములన్నిటిని కలిపి 'మాళవరాష్ట్రము' నొకదానిని ఏర్పరచుటకు సంప్రతింపులు జరుగుచున్నవి. ఈ సమీకరణమువలన పరిపాలనసౌకర్యము తప్పక వృద్ధిగాంచును. కేంద్రప్రభుత్వము గత ఆయిదుమాసములలో సాధించిన మహాకార్యములలో ఇది ఒకటి అని చెప్పవచ్చును.

## హైదరాబాదు

కాని హైదరాబాదుసమస్య పరిష్కారము కానంతవరకు సంస్థానముల సమస్య పరిష్కారము కానట్లే భావింపవలసినదని కొందరు వాదింపవచ్చును. ఈ వాదములో కొంత సత్యమున్నదనియు, ఇతర సంస్థానముల విషయమున చూపించినంతటి దార్ఢ్యమును హైదరాబాదువిషయములో కేంద్రప్రభుత్వము వారు చూపలేకపోయినారనియు సర్దార్ పటేల్ కూడ ఈమధ్య అంగీకరించెను. రెండునెలల క్రిందట జరిగిన యథాతథపు ఒడంబడికలోని షరతులనుకూడ నైజాం అతిక్రమించినట్లు పటేల్ అభిప్రాయపడియున్నాడు. అతనిపై కేంద్రప్రభుత్వమువారు గట్టిచర్య తీసుకొనుటకు ఇష్టపడకున్నారు. ఒడంబడికకు విరుద్ధముగ

నైజాం పాకిస్థాన్ ప్రభుత్వమునకు ఇరవై కోట్లరూపాయల ఋణము నిచ్చెను. ఇండియా ప్రభుత్వపు ప్రతినిధిగ హైదరాబాదుకు వెళ్ళిన మున్షీకిని, అతని ఉద్యోగవర్గమునకును వారివారి హోదాకు తగిన బసలను, కార్యాలయములను ఏర్పాటు చేయుటలో కూడ మామూలుగ గృహస్థునకు చూపదగిన మర్యాదనుకూడ నైజాం చూపడాయెను. హైదరాబాదు రాష్ట్రములోని దుండగీడులు సరిహద్దులోని ఇండియా జిల్లాల గ్రామములను ప్రవేశించి దౌర్జన్యములు జరుపుచున్నారు. కాని మన ప్రభుత్వమువారు వీటి విషయమై తీవ్రమైన ప్రతిక్రియను చేసినవారు కారు. సంప్రతింపులతో కాలము గడుపుచున్నారు. తక్కిన సంస్థానములకును, హైదరాబాదునకును భేదముండుట వాస్తవమే. ఇది మహమ్మదీయ రాజ్యములలో ఒకటి. ఇండియాలో నేగాక ప్రపంచములోని ఇతర మహమ్మదీయుల గౌరవమునకుకూడ పాత్రమైనది. దీనిని సాధ్యమైనంతవరకు సామోపాయముచే లొంగతీయవలయునేగాని తొందరపడి దండోపాయమును ప్రయోగించుట ప్రమాదకరము కాగలదు. హైదరాబాదుతో యుద్ధమనిన ఇండియాలోని హిందూ మహమ్మదీయులమధ్య అంతర్యుద్ధమనియు, పాకిస్థానముతో యుద్ధమనియు గ్రహించవలెను. ఎంతో సహనము జరిగిపిమ్మటగాని అట్టి యుద్ధములోనికి దిగుట రాజనీతి కాజాలదు. యుద్ధముగాక సాధనాంతరముల ద్వారా హైదరాబాదుసమస్యను పరిష్కరించుటకు ప్రయత్నించుటయే ఉత్తమము.

## ప్రభుత్వమువారి బాధ్యత

ఈ సందర్భములో కేంద్ర ప్రభుత్వమువారికిని, రాష్ట్రప్రభుత్వములవారికిని గల భేద మొకదానిని గమనించవలసియున్నది. కేంద్రప్రభుత్వమువారు పరిష్కరించవలసిన సమస్యలు గడ్డుసమస్యలే. దేశరక్షణకు కావలసిన సైన్యములను, సైనికపరికరములను సమకూర్చుకొనుట, రోజురోజుకు క్లిష్టతరము అగుచుండు అంతర్జాతీయ వ్యవహారములను దూరదృష్టితో పరిశీలించి ఎవరితో స్నేహము చేసికొనవలయునో నిర్ణయించుట, కాందిశీకుల సంరక్షణము, కాశ్మీరవ్యవహారపరిష్కారము—ఇవన్నియు సామాన్యసమస్యలు కావు. దీనితోపాటు దేశమందంతట శాంతిభద్రతలను స్థాపించవలసియున్నది. కాని రాష్ట్రప్రభుత్వములవారు వారి దృష్టిని ఇట్టి విషయములపై మరలించవలసినది లేదు. ప్రజల విద్య, ఆరోగ్యము, ఆర్థికసౌభాగ్యము, వ్యవసాయము, పరిశ్రమలు మొదలగువాటిని వృద్ధి చేయుటయే వారి ముఖ్యమైన పని. కాని దీనినికూడ అనేకరాష్ట్రములలో మంత్రివర్గమువారు చక్కగ నిర్వర్తించుటలేదు.

## అశాంతిని అరికట్టుట

మహాత్ముని హత్య దేశమునకు సంభవింపబోవు ప్రమాదమును సూచించుచున్నది గదా? దౌర్జన్యము, రక్తపాతము, అల్లరులు దేశమంతటా వ్యాపించకుండ నుండునట్లు ప్రభుత్వమువారును, ప్రజలును చేయవలసియున్నది. ఈ సందర్భములో రెండు ప్రధానసూత్రములున్నవి. అల్లరిచేయువారి నెదుర్కొనుటకై ప్రజలు స్వయముగ ఏర్పాటులు చేసుకొనవలసినదే. ప్రతిగ్రామమునకును, ప్రదేశమునకును పోలీసువారిని, సైన్యమును పంపుట సాధ్యముకాని పని. మద్రాసుప్రభుత్వమువారు ఏర్పరచబోవు హోంగార్డ్సు (Home guards) కూడ ఈ పనిని పూర్తిగ చేయలేరు. కాని ఈ ఉద్దేశముతో ఎవరన్న వారు సొంతసైన్యములను తయారు చేసుకొనుట ప్రమాదకరము. సైనికశిక్షను పొందిన దళములన్నియు ప్రభుత్వమువారి యాజమాన్యమునందే యుండవలెను. వారి శాసనములకు లోబడియే వారు వారి పనులను నెరవేర్చవలెను. ఇది మొదటిసూత్రము. ప్రజల సౌఖ్యమును వృద్ధిచేయగల ఏర్పాటులను ప్రభుత్వమువారు వెంటవెంటనే ప్రవేశపెట్టవలెను. ప్రతి రాష్ట్రప్రభుత్వము చురుకుగ పనిచేయవలెను. ఇది రెండవ సూత్రము. ఈ రెండుసూత్రములను అనుసరించిన గాని మనకు రానున్న ప్రమాదము తప్పదు. దౌర్జన్యము, విప్లవము దేశమున వ్యాపించి, చైనాలో జరుగుచుండు అంతర్యుద్ధమువంటి యుద్ధమును ఇచ్చటకూడ లేవదీయును.

## స్వయంసహాయము - కాశ్మీరము

ఈ ప్రమాదమును ఎదుర్కొనుటలో మనము స్వయంసహాయముపై ఆధారపడవలయునే గాని విశ్వ రాజ్య సమితిపైన గాని, అగ్రరాజ్యములపైన గాని ఆధారపడుటవల్ల లాభము లేదు. కాశ్మీరవిషయమునుగురించి భద్రతాసంఘములో జరుగుచుండు చర్చల వైఖరియే దీనికి తార్కాణము. భద్రతామండలియెదుట మనము చేసిన ఫిర్యాదులలో క్లిష్టవిషయము లేవియు లేవు. చట్టరీత్యా కాశ్మీరము ఇండియాలో ఒక భాగము. కాశ్మీరమహారాజుయొక్క కోరికపైననే అది ఇండియాలో ఒక భాగమయ్యెను. ఆకారణముచేత శత్రువుల దాడినుండి దానిని రక్షించు బాధ్యత ఇండియా ప్రభుత్వము వహించవలసియున్నది. తిరువాన్కూరు, మైసూరు, కొచ్చిన్ మొదలగు సంస్థానములకు ఇతరుల నుండి ప్రమాదము సంభవించినపుడు వాటి రక్షణకై సైన్యములను పంపుట ఎట్లు ఉచితమో ఇండియా ప్రభుత్వమునకు లోబడుట కంగీకరించిన కాశ్మీరు రాజ్యమును రక్షించుటకై సైన్యములను పంపుటయూ ఉచితమే. ఇందులో చట్టవిరుద్ధము లేదు. కాశ్మీరములోని ఇండియా సైన్యములు పరాయి సైన్యములు కావు. కాశ్మీరముపై దండెత్తివచ్చిన కొండజాతులవారి సైన్యము లట్టివి కావు. అవి ఆ రాజ్యములోనికి ప్రవేశింప హక్కులేని సైన్యములు. అవి పరాయి సైన్యములు. ఇది గమనించవలసిన అంశములలో మొదటిది. ఇండియా సైన్యములు కూడ పరాయి సైన్యములను పాకిస్థాన్ ప్రభుత్వమువారి వాదము ఆధారరహితమైనది. ఇదిగాక కొండజాతుల వారికి పాకిస్థాన్ ప్రభుత్వమువారు సర్వవిధముల సహాయము చేయుచున్నారు. పాకిస్థాన్ రైళ్లు, బస్సులు, ఆయుధములు వారివశమందున్నవి. యుద్ధ సన్నాహమునకై వారేర్పరచుకొన్న శిబిరములన్నియు పాకిస్థానములోనే యున్నవి. ఇట్టి సహాయమును పాకిస్థాన్ ప్రభుత్వము వారు కొండజాతులకు చేయుట అంతర్జాతీయ ధర్మశాస్త్రమునకు (International Law) విరుద్ధము. అట్టి సందర్భములో ఇండియా సైన్యములు పాకిస్థానములో ప్రవేశించి, కొండజాతుల శిబిరములను నాశము చేయుట ధర్మవిరుద్ధము కాదు. కాని అట్లు చేసినయెడల పాకిస్థానముతో యుద్ధము సంభవించినట్లే. ఇండియాకు, పాకిస్థానమునకు బహిరంగయుద్ధము సంప్రాప్తమైనయెడల అది భరతఖండమందంతట వ్యాపించుటయే గాక మధ్య ప్రాచ్యములోని మహమ్మదీయ దేశములన్నిటిలో కూడ వ్యాపించుట తప్పదు. అట్టి యుద్ధములో అగ్రరాజ్యములలోని రష్యా ఒక వైపునను, బ్రిటన్ అమెరికాలు ఇంకొక వైపునను చేరుట కూడ అసంభవము కాదు. అనగా ఈ యుద్ధము క్రమక్రమముగా ప్రపంచయుద్ధముగ పరిణమించును. ఇంతటి ప్రమాదమునకు కారణభూతమగు యుద్ధము రాకుండ చేయుటకు ఒకటే సాధనము. పాకిస్థాన్ ప్రభుత్వమువారు కొండజాతులవారికి సహాయము చేయకుండుటయే ఈ సాధనము. ఇందుకై ఇండియా ప్రభుత్వమువారు పాకిస్థాన్ ప్రభుత్వముతో కొన్ని సంప్రతింపులు కావించి అవి విఫలములగుటచేత పాకిస్థాన్‌పై భద్రతాసంఘము ఎదుట ఫిర్యాదు చేసిరి. కొండజాతులవారికి పాకిస్థాన్ ప్రభుత్వము సహాయము చేయకుండ చేయవలసినదని ఇండియా ప్రభుత్వము కోరెను.

ఈ కోరిక సమంజసమైనదా, కాదా అని నిర్ణయించుటలో ఎట్టి కష్టము లేదు. పాకిస్థాన్ కొండజాతుల వారికి సహాయము చేయుచున్నదా, లేదా అను విషయమును కనుగొనుట, సహాయము చేయుచున్నదని ఋజువైనయెడల దానిని నిరోధించుట. నిరోధించుట శాస్త్రసమ్మతమని అందరు అంగీకరించినదే. పాకిస్థాన్ సహాయము చేయుచున్నదని ఇండియాయొక్క వాదము. చేయుట లేదని పాకిస్థాన్ వాదము. ఉభయుల వాదములలోని సత్యాసత్యములను తెలుసుకొనుటయే గదా భద్రతామండలి చేయవలసిన పని. కాని దానిని చేయుటకు బదులు ఇండియా-పాకిస్థానుల మధ్యనుండు వివాదములన్నిటిని విచారణచేయుట అత్యవసరమని వారు తీర్మానించిరి. ఇదిగాక ఇండియా సైన్యములు కూడ పరాయి సైన్యములనియు, కాశ్మీరములో అవి ఉండుటకు హక్కు లేదనియు అభిప్రాయమును వ్యక్తపరచిరి. అనగా దుండగీండ్రతో సమానత్వమును ఇండియాకు ఆపాదించిరి, పాకిస్థాన్ చేయుచున్న

సహాయమును అపేక్షించుటనుగురించి ఆలోచించుటకు బదులు కాశ్మీరము ఇండియాలో చేరువిషయమై ప్రజాభిప్రాయమును కనుగొనుటయే ప్రధానమని ఊహించిరి. అనగా ప్రపంచములో శాంతిని స్థాపించుటకును, యుద్ధజ్వాలలు వ్యాపించకుండ చేయుటకును స్థాపింపబడిన భద్రతా సంఘము కాశ్మీరములో శాంతి సంస్థాపనకు ఉపకరించు ధర్మశాస్త్రమును, చట్టమును ఉపయోగించుటకు వెనుదీసినది.

## అగ్రరాజ్యముల స్వలాభకాంక్ష

భద్రతామండలిలోగాని, ఐక్యరాజ్య సమితి మహాసభలలోగాని జరుగు చర్చలన్నిటిలో సత్యాన్యాయవిచారణకు బదులు స్వలాభకాంక్షయే ప్రాబల్యము వహించుచున్నదని నిరూపించుటకు ఎన్నో నిదర్శనములు కలవు. కాశ్మీరమునుగురించి ఇప్పుడు జరుగుచుండు చర్చలు దీనికి మరియొక నిదర్శనము. న్యాయమైనను అన్యాయమైనను పాకిస్థాను పక్షమును వహించుటయే తమకు లాభకరమని ఇంగ్లీషువారియొక్కయు, అమెరికనులయొక్కయు అభిప్రాయము. పాకిస్థాన్ మహమ్మదీయరాజ్యము. సమీప ప్రాచ్యమునందును, మధ్యప్రాచ్యమందును ఉండు రాజ్యములన్నియు మహమ్మదీయ రాజ్యములు. వీటియొక్క సహాయము, సానుభూతి బ్రిటిష్‌వారికిని, అమెరికనులకును అత్యవసరము. అవి రష్యాపలుకుబడిలోనికి రాకుండచేయుట వారి ప్రధానోద్దేశము. మహమ్మదీయరాజ్యముల సహకారమును ఎట్లైన నిలబెట్టుకొనుటయే వారు కాంక్షించుటచేత కాశ్మీరవిషయములో న్యాయము, ధర్మము ఇండియాపక్షముం దున్నను వారుమాత్రము పాకిస్థాన్ పక్షమును వదలుటకు అంగీకరింపకున్నారు. ఇదిగాక కాశ్మీరము పాకిస్థానములో చేరుటయే వారు కోరునది. కాశ్మీరము రష్యాసరిహద్దులలో నున్నది. అది పాకిస్థానములో చేరినయెడల తమ సైన్యములను అక్కట నుంచుకొనుటకు శిబిరములు లభింపగలవనియు, విమానాశ్రయములు సులభముగ సంపాదింపవచ్చుననియు వారి ఆశయము. బ్రిటిష్‌వారు అనేకసంవత్సరముల నుండి మహమ్మదీయపక్షపాతులై, భరతఖండవిభజనకు దారితీసినమాట అందరు ఎరిగినదే. ఆ పక్షపాతమును వారిప్పటికికూడ వదలలేదు. రష్యావారుకూడ కాశ్మీరసమస్యవిషయములో నిష్పక్షపాతమును చూపరైరి. వారి ప్రవర్తన గోడమీది పిల్లిప్రవర్తనరూపమును ధరించినది. ఐక్యరాజ్యసమితిలో జరుగు చర్చల ధోరణి ఎట్లుండునో ఎరిగియు మన ప్రభుత్వమువారు కాశ్మీరసమస్యావిషయమై భద్రతామండలి ఎదుట ఫిర్యాదుచేయుట యుక్తము కాదేమోనని ఊహించవలసియున్నది. దూరాలోచన చేయక, తొందరపడి, వారిట్లు చేసిరి. బహుశః వారు ఇప్పుడైనను ఈ చర్చల ధోరణిని స్మరణకు తెచ్చుకొని, తమ ఫిర్యాదును ఉపసంహరించుకొనుట ఉత్తమమార్గము. ఉపాయాంతరమున పాకిస్థానుకు బుద్ధిచెప్పి, తద్వారా కొండజాతులకు లభించు సహాయము రాకుండచేయుటకు ప్రయత్నించుటయే మర్యాద.

## రష్యాపట్ల బ్రిటిష్ విరోధము

రష్యాఅమెరికాలమధ్య దినదిన ప్రవర్ధమానమగుచుండు ద్వేషము బ్రిటిష్‌వారి విదేశరాజ్యాంగ నీతియందు ఎట్టి మార్పును కలిగించునో అన్నవిషయమై ఇదివరకు కొంత అనుమాన ముండెడిది. ఇప్పుడీ అనుమానము చాలవరకు తగ్గినది. బ్రిటిష్ ప్రధానమంత్రి జనవరి ౩వ తేదీన చేసిన ఉపన్యాసములోను, ఉపమంత్రియగు మారిసన్ ౧౧వ తేదీన చేసిన ఉపన్యాసములోను, అఖరువారమున పార్లమెంటులో విదేశాంగమంత్రియగు బెవిన్ చేసిన ఉపన్యాసము, దానిపై జరిగిన చర్చలు వీటి అన్నిటియందును ఒకేధోరణి కనబడుచున్నది. రష్యావారు కమ్యూనిజమును బలాత్కారముగ పశ్చిమ యూరపు దేశములలో వ్యాపింపజేయుటకు ప్రయత్నించుచున్నారనియు, కమ్యూనిజం వ్యాపించిన తూర్పు యూరపు దేశములలోని ప్రజలు స్వాతంత్ర్యమును కోల్పోయి నిరంకుశముగ ప్రవర్తించు కమ్యూనిస్టు పక్షమునకు దాసానుదాసులై దుర్భరములగు కష్టముల ననుభవించుచున్నారనియు, కమ్యూనిజం పశ్చిమ యూరపు దేశములలోని ప్రజాస్వామ్య సాంప్రదాయములకు విరోధియనియు, అట్టి సిద్ధాంతమును ప్రచారముచేసి అన్ని దేశములలో విప్లవములను లేవదీయుటకు దీక్షవహించిన రష్యాతో ఎట్టి పొత్తు ఇంగ్లండుకు కుదరదనియు, దానిని అరికట్టుటకు పశ్చిమ యూరప్ దేశములన్నియు ఇంగ్లండు, ఫ్రాన్సు, బెల్జియం, హాలెండు, లక్సెంబర్గు, డెన్మార్కు, నార్వే, స్వీడన్—ఒక సమాఖ్యగా ఏర్పడవలెననియు, ఇందులో ఇటలీ కూడ చేరవలెననియు, బెవిన్, అట్లీ, చర్చిల్ మొదలైన బ్రిటిషు నాయకులందరు ఘంటాపథముగా చెప్పిరి. ఇదిమొదలు

బ్రిటీషు వారు అమెరికా పక్షమును బహిరంగముగ వహింతురనియు, రష్యాయొక్క అధికారము పశ్చిమ యూరపులోనికి వ్యాపించకుండుటకై అచ్చటి దేశముల నన్నిటిని ఒక సమాఖ్యలో చేర్చుటకు ప్రయత్నింతురనియు చెప్పవచ్చును. యూరపు ఖండము రాజకీయముగ రెండు ముక్కలుగ చీలిపోవుటయే దీని ఫలితము.

## అమెరికావారి సన్నాహము

అమెరికావారు కోరినదికూడ ఇట్టిదే. రష్యాతో యుద్ధము తప్పదను అభిప్రాయముతో అమెరికా అధ్యక్షుడు, ఇతర నాయకులు ప్రవర్తించుచున్నారు. అమెరికన్ కాంగ్రెసులో (శాసనసభలో) చర్చించుటకై ట్రూమన్ అధ్యక్షుడు తయారు చేసిన ౧౯౪౮-౪౯ బడ్జెట్ దీనికి ప్రధానమగు తార్కాణము. ఈ సంవత్సరములో ప్రభుత్వపు ఖర్చుయొక్క మొత్తము ౧౩౯,౪౦ కోట్ల డాలర్లు (డాలరు అనగా నాలుగు రూపాయలు). ఇందులో ౧౧౦౦౦ కోట్ల డాలర్లు (అనగా నూటికి ౨౮) సైన్యమునకు గాను ప్రత్యేకింపబడినది. యుద్ధము లేని శాంతికాలమున ఇంతటి మొత్తమును అమెరికావారిదివరకెన్నడు ఖర్చుచేయ దలచుకొనలేదు. ఇదిగాక విదేశముల ఆర్థిక సైనిక సహాయమునకై ౪౦౦ కోట్ల డాలర్లు ప్రత్యేకింపబడినవి. అనగా ఇంతటి విలువగల సరకులను—బొగ్గు, ఆహార పదార్థములు, యంత్రములు, సైనికపరికరములు మొదలగు వాటిని—వారు ఫ్రాన్సు, ఇటలీ, ఇంగ్లండు, చైనా మొదలైన దేశములకు పంపుటకు సిద్ధపడియున్నారని మనము గ్రహించవలెను. ఇట్టి సహాయము చేసి, దీని మూలమున ఈ దేశములవారిప్పుడను భవించుచుండు ఆర్థికకష్టములను తొలగించి వారి కృతజ్ఞతను సంపాదించి కమ్యూనిజముగాని, రష్యాయొక్క ప్రాబల్యముగాని వాటిలో వ్యాపించకుండునట్లు చేసి, రష్యాతో యుద్ధము సంభవించినరోజుల వారి సహాయము లభింపజేసుకొనుటయే అమెరికావారు కోరుచుండు ఫలితము.

## పశ్చిమయూరపు సమాఖ్య

పశ్చిమయూరపులోని దేశములన్నియు ఒక సమాఖ్యగా (Union) ఏర్పడవలెనని బెవిన్ చెప్పుటలోను, అతని అభిప్రాయముతో అచ్చటి దేశముల నాయకులు కొందరు ఏకీభవించుటలోను మరియొక విశేషముకూడ కలదు. ఈ దేశములలో ప్రధానమైన ఇంగ్లండు, ఫ్రాన్సు, బెల్జియం, హాలెండు దేశములకు లోబడిన వలసరాష్ట్రములు అనేకములు (Colonies) ఉన్నవి. వీటిమూలమున వారు ఏటేట ఎంతో లాభమును సంపాదించుచున్నారు. వారి భోగభాగ్యములకు చాలవరకివియే కారణము. ఆఫ్రికాఖండమున బెల్జియంవారికి కాంగోరాష్ట్రము, ఫ్రాన్సువారికి గొప్ప సామ్రాజ్యము, బ్రిటిష్‌వారికి ఇంకొక సామ్రాజ్యము కలదు. అట్లే ఏషియాఖండములో మలయా ఇంగ్లీషువారి అధీనమందును, ఇండోచైనా ఫ్రెంచివారి అధీనమందును, ఇండొనీషియా హాలెండు ప్రజలగు డచ్చివారి అధీనమందును ఉన్నవి. వీటిలో ముఖ్యముగ ఇండోచైనా, ఇండొనీషియాలలో ప్రజలు తిరుగబడి స్వాతంత్ర్యమును సంపాదించుటకై ప్రయత్నించుచున్నారు. కాని అట్టి ప్రయత్నము సఫలమగుట వీరెవ్వరికి ఇష్టములేదు. ఇండోచైనాలో తమ అధికారమును నిలబెట్టుకొనుటకు ఫ్రెంచివారు సర్వవిధముల ప్రయత్నించుచున్నారు. అదేవిధముగ డచ్చివారు ఇండొనీషియాను వదలిపెట్టుట ఇష్టపడక అక్కడి ప్రజలతో పోరుచున్నారు. గనుక ఈ దేశములవారందరు కలసి, ఈ వలసరాష్ట్రములు తమ చేతులలో నుండి తప్పిపోకుండ చేసుకొనుటకై ప్రయత్నింతురు. పశ్చిమయూరపుసమాఖ్యయొక్క ఉద్దేశములలో ఇది కూడ ఒకటి. (1-2-1948)






# 1947 నోబెల్ బహుమానానికి నోచుకొన్న దిట్ట రాబర్ట్ రాబిన్సన్

కొందరు వైజ్ఞానికులపట్ల యశఃకాంత తనంత తాను వలచివచ్చి వారిని జగద్విఖ్యాతులుగా చేస్తుంది. మరికొందరు ఎంత ఆరాధించినా వారిని క్రీగంటనైనా కనికరించదు. అందులో రసాయన శాస్త్రజ్ఞులను మరీని. అయితే నిరహంకారంతో, ప్రసన్నచిత్తంతో ప్రకృతిపోకడలను నిరంతరాయంగా పరిశోధించే ఆ సత్యాన్వేషకులు ఆయాచితలబ్ధములైన పేరు ప్రతిష్ఠలకు పొంగకుండా, క్రుంగకుండా తమ తమ పనులను తాము చేసుకుంటూ పోతారు. వారి నిరంతరకృషి పరిణతిపొందినప్పుడుగాని వారి వ్యక్తిత్వ, వ్యక్తిత్వప్రతిభావిశేషాలు మనకు తెలియరావు.

ఎలెక్ట్రాన్లకు సంబంధించినంతవరకు జె. జె. థాంసన్, 'అణువు'లపై లార్డ్ రూథర్‌ఫర్డ్ ఆఫ్ నెల్సన్, రేడియోతరంగాల ప్రమాణాలనుగురించి సర్ ఎడ్వర్డ్ యాపిల్‌టన్ అనేవారు నవ్యభౌతికవిజ్ఞానంలో ఇలాంటి ఉత్తమకృషిని సాగించారు. అయితే రసాయనశాస్త్రం ఇంతకన్నా సమగ్రమైనది. రాసాయనిక విజ్ఞానప్రతిభను పరిగణించేటప్పుడు అతని బాహ్యస్వరూపం, జీవితవివరాలు, నిపుణత్వం, వస్తుగుణతత్వాన్ని గురించి జరిపే పరిశోధనల తీరూ ఇవన్నీ మామూలుమానవులమనస్సుకు అతీతమైనవిగా ఉంటూ ఉంటాయి. ఇలాంటివాడే సర్ రాబర్ట్ రాబిన్సన్. ఇతడే ౧౯౪౭వ సంవత్సరానికి రసాయనవిజ్ఞానంలో నోబెల్ బహుమతిని పొందిన దిట్ట. ఈ నోబెల్ బహుమానం వైజ్ఞానికప్రపంచంలో అగ్రగణ్యతకు ముద్ర. ఇతను ఆజీవితమూ చేసిన ఉత్తమకృషికి ఫలితంగా ఈ ఏడాది ఈ ఉత్తమబహుమానం వచ్చింది.

సర్ రాబర్ట్ రాబిన్సన్ ఎంతో వ్యక్తిత్వము కలవాడు. అయినా అందరితో బాగా కలిసిమెలిసి తిరుగగలవాడని యుద్ధకాలంలో పెన్సిలిన్‌పై చేసిన పరిశోధనలను బట్టి తెలుస్తున్నది. వయసు పైబడి పనిలోనుంచి రిటైరు అవుతున్నా అంత కీర్తికండూతి లేనివాడు. కావాలంటే బ్రిటిష్ దీవులలో ఉన్న ప్రచారసాధనాలన్నీ ఇతనికి అందుబాటులో ఉన్నవి. కాని ఉపయోగించుకోలేదు. ఇతని ప్రతిభావిశేషాలను పరీక్షించిన వైజ్ఞానికరంగంలో ఉన్న తపస్వులను నిగ్రహింపగలవాడవటం నిస్సందేహం. నిరంతరం ప్రయోగశాలలో పనిచేసే కార్మికుడితడు. అయినా సాంఘిక మర్యాదలు బాగా తెలిసినవాడు. అమితమేధావి. ఎంతటి మేధావియో అంతటి ఆత్మసంయమనం కలవాడు. కరుణాశాలిఅయినా పరుషభాషణాలకు వెనుదీయడు.

## బాల్యం

ఇతని తల్లిదండ్రులు అంత అమితభాగ్యశాలురు కారు. అలాగని కటికదరిద్రులూ కారు. ఏదో ఇంత తినడానికి ఉన్నవారుమాత్రమే. శస్త్రచికిత్స చేసినప్పుడు కట్లు కట్టడానికి పనికివచ్చే బట్టలను తయారుచేసేవాని కుమారుడు ఇతడు. బాల్యదశలో తన పరిసరప్రాంతాల ఉన్న ఒక వీధిబడిలో చదువుకున్నాడు. ఆ బడినిగురించి అప్పటికీ, ఇప్పటికీ ఎవరికీ అంత బాగా తెలియదు. ఆతరువాత మాంచెస్టర్‌నగరంలోని విక్టోరియాయూనివర్సిటీలో చదువుకున్నాడు. ఇతను అక్కడ చదువుకునే సమయంలో ఆ విశ్వవిద్యాలయంలో లార్డ్ రూథర్‌ఫర్డ్ ఫిజిక్స్‌లో ప్రధానఅధ్యాప

కర్తవ్యపదవిని నిర్వహిస్తున్నాడు. నాటినుంచి నేటివరకు సర్ రాబిన్‌సన్ వైజ్ఞానికరంగంలో తన కృషిని నిరంతరాయంగా సాగిస్తూనే ఉన్నాడు.

ఇరవై ఆరో ఏట సర్ రాబర్టు రాబిన్‌సన్ న్యూ సౌత్ వేల్స్‌లోని సిడ్నీ విశ్వవిద్యాలయంలో ఆర్గానిక్ కెమిస్ట్రీలో ప్రొఫెసర్‌గా నియమితుడయ్యాడు. అక్కడ ఉన్నప్పుడే జెర్ట్రూడ్ వాల్ష్ అనే పడుచుతో ఇతనికి ప్రణయం కొంత సాగింది. ఆమెకూడా ఒక రసాయనిక విజ్ఞాని. ఈ రేండాకే ఈ ఉభయులూ వివాహం చేసుకున్నారు.

మూడేళ్ళ అనంతరం వైజ్ఞానికులైన దంపతులు ఉభయులూ ఇంగ్లాండుకు తిరిగివచ్చారు. వచ్చిన వెంటనే లివర్‌పూల్ విశ్వవిద్యాలయంవారు ఆర్గానిక్ కెమిస్ట్రీలో హీత్ హారిజన్ ప్రొఫెసరుగా నియమించారు. ఆ తరవాత ఒకటిరెండుసార్లు కొంతకాలంపాటు ఊరికే ఉండవలసివచ్చింది. ఇండస్ట్రియల్ కెమిస్ట్రీలో కొంతకాలంపాటు పనిచేసినా, తిరిగి విశ్వవిద్యాలయంలో ఉద్యోగాన్ని స్వీకరించాడు.

౧౯౨౦ లో సర్ రాబర్టు రాబిన్‌సన్ బ్రిటిష్ డైస్టఫ్స్ కార్పొరేషన్ లిమిటెడ్ అనే రంగుల తయారీ సంస్థలో రిసెర్చి డైరక్టరుగా ఉద్యోగాన్ని స్వీకరించాడు. ఒక ఏడాదిపాటు ఈ ఉద్యోగంలో ఉండి సెయింట్ ఆండ్రూస్ స్కాటిష్ యూనివర్సిటీలో (కెమిస్ట్రీ) రసాయనశాస్త్రాధ్యాపకుడుగా ఆచార్యపదవిని అంగీకరించాడు. తిరిగి ౧౯౨౨ లో తన పాత విశ్వవిద్యాలయంలో రసాయనశాస్త్రాధ్యాపక పదవిని ఆక్రమించి ఆరేళ్లపాటు ఆ పదవిని నిర్వహించాడు. అక్కడనుంచి లండన్ యూనివర్సిటీ కళాశాలలోను, ఆక్స్‌ఫర్డులోను ఆచార్యపదవిని అధిష్ఠించాడు. గత పదిహేడు సంవత్సరాలుగా ఈయన ఆక్స్‌ఫర్డులో వేన్‌ఫ్లేట్ కెమిస్ట్రీ ప్రొఫెసరుగా పనిచేస్తున్నాడు. సుదీర్ఘమైన ఈయన ఆచార్యజీవితంలో దేశాన్ని ఒకసారి వదలిపెట్టి, ప్రతిభాన్వితుడై తిరిగి రావడంతప్ప గణనీయమైన సంఘటన మరొకటి సామాన్యదృష్టికి కానరాకపోవచ్చును. అయితే అలా తిరిగి రావడంమట్టుకు సామాన్యమైన పని కాదు. ఇంగ్లండు అనేక విశ్వవిద్యాలయాలలో రసాయనికాధ్యాపకపదవి ఖాళీఅయినప్పుడు అందరూ సర్ రాబర్ట్ రాబిన్‌సను నే కోరడం గమనించదగిన విషయం. అది ఈయన అనన్యమైన ప్రతిభకు మంచి తార్కాణం.

ఈయన తన జీవితంలో కెమికల్ సొసైటీవారి లాంగ్‌స్టాఫ్ మెడలును, ౧౯౩౦ లో రాయల్ సొసైటీవారి డేవీ మెడలును బహుమతిపొందాడు. ఇతడు సభ్యుడుగాచేరిన అచిరకాలంలోనే ఈ రెండుసంస్థలకు అధ్యక్షుడు కాగలిగాడు.

ఇతను ౧౯౪౫ నుంచి బ్రిటిష్‌రాయల్ సొసైటీకి అధ్యక్షుడు. ఇది ఇతరులకు అందరాని అనన్యసామాన్య గౌరవం. బ్రిటిష్ వైజ్ఞానికప్రపంచంలో ఇది అగ్రగణ్యతకు చిహ్నం. ఇది బాధ్యతాయుతమైన వైజ్ఞానిక నాయకత్వానికి చిహ్నం. ఇది వ్యక్తిగతంగాకూడా ఎంతో గౌరవమైన పదవి. ఈయనకు పరిశోధనాస్వాతంత్ర్యంలో, అంతర్జాతీయవైజ్ఞానిక సహకారంలో విశ్వాసం చాలా హెచ్చు. తన ఈ అపూర్వపదవిని తన భావాలను విరివిగా ప్రచారం చెయ్యడానికి ఉపయోగించాడు. విశ్వవిద్యాలయాలలో తప్ప ఇతరత్ర ప్రచురించడానికి వీలులేకుండా కంట్రాక్టుపద్ధతులపై పరిశోధనలు కొనసాగించడమంటే సర్ రాబర్టుకు అంతగా గిట్టదు. ఇదే సంగతి ఆయన పదేపదే విస్పష్టంగా అనేకసార్లు ప్రకటించాడు.

రసాయనశాస్త్రవేత్తగా ఈయన చాలాభాగం పెన్సిలిన్‌పై గొప్పగొప్ప పరిశోధనలు జరిపాడు. మొక్కలలో భారవహమైన రసాయనపదార్థాలు కలిగించగల మార్పులను గురించి ఈయన చేసిన పరిశోధనలు గణ్యతముమైనవి. ఈ ప్రసిద్ధవిజ్ఞాని మార్ఫిన్, స్ట్రిక్నైన్ వంటి పదార్థాలపై విశేషకృషిని స్వంతలాబరేటరీలలో కొనసాగించాడు. ఆల్కలాయిడ్లపై ఈయన చేసిన పరిశోధనలను గురించి నోబెల్ కమిటీవారు ప్రత్యేకంగా ప్రశంసించారు.

౧౯౨౨ నుంచి ఈయన చేసిన పరిశోధనలో శ్రీమతి రాబిన్‌సన్‌కూడా పాల్గొన్నది. ఆమె సహాయంతో ఈయన పువ్వులలో కలిగే రంగుల మార్పులను గురించి పరిశోధనలు జరిపాడు. ఈ సందర్భంలో ఈయన విశ్వవిఖ్యాత జర్మన్‌విజ్ఞాని ప్రొఫెసర్ ఆర్. విల్‌స్టేటర్ అడుగుజాడలలో తన పరిశోధనలు కొనసాగించాడు. రాబిన్‌సన్‌దంపతుల కృషి కొంచెం క్లిష్టంగా ఉన్నట్లు కనపడినా నిజానికి ఎంతో సులువైన ప్రత్యేకత గలది.

పువ్వులలో చిరరకు రంగులు ఏర్పడడానికి కారణం ఆంథోసియానిడిన్స్‌అనే ఒక పదార్థం ఇతర

విషయాలతో కలవడంచేతనేనని రాబిన్‌సన్‌దంపతుల సిద్ధాంతం. ఈ ఆంథోసియానిన్స్ మొక్కలలో పంచదారతో ఏ నిష్పత్తిలో కలుస్తాయో, ఏయేవృక్ష సారంలో ఎంతెంత ఆమ్లం ఉన్నదో, ఒకటికంటె ఎక్కువ రంగులు కలిసినప్పుడు ఎలాంటి పరిణామాలు కలుగుతవో వీటన్నింటినిగురించి రాబిన్‌సన్‌దంపతులు పరిశోధనలు చేశారు. గడ్డిపువ్వులోని నీలిరంగు, గులాబీ పువ్వులోని ఎరుపు, ఉస్తిపువ్వులోని ఊదారంగు ఒకే ఆంథోసియానిడిన్‌నుంచి కలుగుతున్నవని వీరు ఋజువు చేశారు.

'ఎలాగ?' అన్నది ఒక చిక్కు ప్రశ్న. వీటన్నింటి అంతర్యాన్నీ సమన్వయపరచే గుణం ఒకటున్నది. ౧౯౩౭ సంవత్సరంనాటికి రాబిన్‌సన్‌దంపతుల కృషిఫలితంగా ఏడు వేర్వేరు ఆంథోసియానిడిన్స్ ఉన్నట్లు ఋజువైనది. ఇవన్నీ కూడా 'ఫ్లావోనెల్' అనే ఏకపదార్థ సంజనితములే అని కూడా వీరు ఋజువు చేశారు. దీని పరిశోధనాక్రమం అత్యంతమనోజ్ఞమైనది. ముందుముందు ఇందువల్ల కృషిజ్ఞానంలో అమోఘమైన సత్ఫలితాలు చేకూరవచ్చును. అంతేకాదు. రసాయనవృక్షవిజ్ఞానాల మధ్య అవినాభావసంబంధం ఏర్పడడానికి కూడా అవకాశము లున్నవి.

రసాయనికనిర్మాణరహస్యాలను పరిశీలించడంలో, పరిశీలించి నిర్ణయించడంలో ఈయన అద్భుతమైన ప్రతిభను వ్యక్తంచేశాడు. మచ్చుకు ఈ ఒక్క సంగతి చూడండి: ౧౯౫౩ లో లివర్‌పూలులో జరిగిన బ్రిటిష్‌అసోషియేషన్‌మీటింగులో ఎక్కువ అణుభారం కల కర్బనితపదార్థాల నిర్మాణాన్నిగురించి ప్రసంగించాడు.

౧౯౧౭ వ సంవత్సరంలో లీడ్సునగరసమీపంలో ఉన్న పరిశ్రమపరిశోధక సంఘానికి చెందిన ముగ్గురు విజ్ఞానులు—రసజ్ఞులు నిర్మించిన క్రిమినాశకౌషధం యాస్‌లో ప్రొఫెసర్ రాబిన్‌సన్ ఊహించిన నిర్మాణక్రమంలో ఉన్నదని ఋజువుచేశారు. ఇలాంటి ప్రభావం భూమిమీది వాతావరణంలో విశ్వకిరణాల రేడియేషన్‌వల్ల సుసాధ్యం కావచ్చునని మేడంక్యూరీ ఇదివరలోనే ఊహించింది. మేడంక్యూరీ ఈ ఊహ ఇప్పటివారి ప్రతిభవల్ల చక్కగా ఋజువైంది.

ఇంతకూ రసాయనిక నిర్మాణం అంటే 'ఏమిటి? ఎందుకు?' అనే అనాదిప్రశ్నలపట్ల ప్రొఫెసర్ రాబిన్‌సనుకు గల ఆసక్తి ఇప్పటికీ పోలేదు. కనుకనే, కెమికల్‌సొసైటీశతవార్షికసమావేశంలో షేండే లెక్చరు చెప్పుతున్నప్పుడు, ప్రొఫెసర్ రాబిన్‌సన్ అప్పట్లో పెన్సిలిన్‌పై పరిశోధనలు సాగిస్తున్నా, ఆ అంతర్జాతీయసమావేశంలో 'ఎలక్ట్రో కెమికల్ థియరీస్ ఆఫ్ ఆర్గానిక్ రియాక్షన్స్' అన్న తన అభిమానవిషయంపైన మాత్రమే ఉపన్యసించాడు.

ఇది అత్యంతక్లిష్టమైన, అతిగహనమైన వైజ్ఞానిక విషయం. అయినా తన శ్రోతలందరికీ కరతలామలకమయ్యేటట్లు విషయాన్ని చక్కగా విశదపర్చి, వివరించి చెప్పాడు.

ఒక్కమాటలో చెప్పాలంటే సర్ రాబర్టు రాబిన్‌సన్ గొప్ప ఆర్గానిక్ రసాయనికవిజ్ఞాని. ఇతనికి ఇందులో ఇతడే సాటి. ఈయనప్రతిభ అంతటి సర్వతోముఖమైనది.

వేమరాజు భానుమూర్తి.



# గాంధీజీ మహాత్ముడెందుకైనాడు?

[వెనుక నొకప్పుడు మహాత్ముని ఒకానొక జన్మదినోత్సవ సందర్భంలో రవీంద్రకవి గాంధీమహాత్మునిగురించి శాంతినికేతన విద్యార్థులకు ఇచ్చిన ఉపన్యాసంలోని కొంతభాగ మిది:]

నేడు మన దేశంలో దేశద్రిమ్మరులై సంచరించే సన్యాసులు, బైరాగులు ఎందరో వున్నారు. వీరికి లోకంతో సంబంధం లేదు. దేశంలోని దారుణ సంక్షోభాన్నీ, దారిద్ర్యాన్నీ చూసి చలించరు. దానితో వారికి పనిలేదు. వారికి కావలసిందల్లా తమ మోక్షమే. ఆ మోక్షంకోసం అభ్యాసాలు చేయటమే వారి పని. అటువంటి సన్యాసిని ఒకసారి ఒక పల్లెటూరిలో కలుసుకున్నాను. "ఆకలితోనూ, అనారోగ్యంతోనూ అలమటించే ఈ నిర్భాగ్యులకు మీ రేమైనా సాయం చేయకూడదా ?" అని ప్రశ్నించాను. నా ప్రశ్న విని ఆశ్చర్యంతోనూ, చికాకుతోనూ ఆ సన్యాసి "ఏమిటీ! నేనా ? సచ్చిదానందంకోసం ఈ మాయాప్రపంచ బంధాలన్నీ తెంపివేసుకున్నాను. మాయలో పడి కొట్టుకుంటున్న ఈ పల్లీయులకోసం నన్ను మళ్ళీ ఆ మాయాజాలంలో జొరబడమంటారా ?" అన్నాడు.

ఇటువంటి వేదాంతంతో మన జాతి నిర్వీర్యమై, నీరసమై, నిస్త్రాణమైపోయింది. ఆ సమయానికే మన దేశచరిత్రలో ఒక గొప్ప సంకటం వచ్చింది. అటువంటి స్థితిలోనే మన దేశం పాశ్చాత్యుల సామ్రాజ్యతృష్ణను అరికట్టటానికి ఎదురుగా నిలబడవలసివచ్చింది. అంతకుముం దెప్పుడూ లేనంత ప్రమాదావస్థ వచ్చింది. మనపు ఆర్యులు, ముసల్మానులు దేశంపై దండెత్తివచ్చి రాజ్యాలు స్థాపించుకున్నారు. కాని వారు మన దేశంలో స్థావర మేర్పరచుకొని మన దేశీయులుగా మారిపోయారు. వారు సాధించిన ఘనకార్యాలు మన జాతిసంస్కారానికి, యశస్సుకూ వన్నెలుదిద్దినవి. కాని ఈ పాశ్చాత్యుల సామ్రాజ్యం చిత్రమైనది, భిన్నమైనది. వీరు మనపైన కూచుని పరిపాలిస్తారే కాని మనలో ఒకరై కలిసిపోలేదు. మన దేశం వీరి స్వాధీనమైంది. కాని వీరుమాత్రం మన దేశీయులు కాలేదు. అంతకుముం దెప్పుడూ మన దేశం ఇంత విచ్ఛేదానికీ, ఇంత వంచనకూ గురికాలేదు. అంతకుముం దెవ్వరూ మన దేశాన్ని ఈవిధంగా కొల్లగొట్టలేదు. పాశ్చాత్యనాగరికత సంపర్కంవల్లా, ప్రభావంవల్లా మన హిందూ సంస్కారంలో అనాదిగా వస్తున్న ఏకీభావం ముక్కలుముక్కలై పోయింది. ఈవిధంగా పతితమై, విచ్ఛిన్నమైపోయిన మన జాతికి ఎన్నటికైనా మోక్షమున్నదా ? ఈ నిరాశనుంచి, నిస్పృహనుంచి జాతికెన్నటికైనా విముక్తి ఉన్నదా ?

మహానాయకుడు, సాధుమూర్తి గాంధీజీ రంగంలో అడుగుపెట్టగానే ఈ సందేహాలన్నీ మాయమైపోయినవి. అజేయమైన దివ్యశక్తి మహాత్మునిలో మూర్తీభవించింది. మహాత్ముడు మార్గదర్శకుడై మన కొక గొప్పబాటను చూపించాడు. ఆ బాటలో మనం దరం ముందడుగు వేసి సాగిపోగలిగితే మన జాతిని రక్షించుకోగలుగుతాం. ఇతరజాతులకుకూడా మార్గదర్శకులం కాగలుగుతాం.

స్వార్థరాహిత్యం ఈ మహాపురుషునికి పరివేషం! వ్యక్తులకు స్వార్థమున్నట్లే జాతులకుకూడా మితిలేని స్వార్థ ముంటుంది! ఈ రెండువిధాలైన స్వార్థాలకూ దూరంగా నిలబడగలగటమే మహాత్ముని విశిష్టత.

సాధారణంగా రాజకీయవేత్తల నీతినియమాలు అంత చెప్పుకోదగ్గవి కావు. అసత్యం చెప్పటం వారికి మంచినీళ్ళప్రాయం. తమజాతి ఘనతకోసం ఇతరజాతులను వంచించటానికి, హింసించటానికి వారు కొంచె

మైనా వినకూడదు. రాజకీయవేత్తలు కార్యసాధనమే తమ ముఖ్యోద్దేశమని గొప్పచెప్పుకుంటారు. తమ కార్యం సిద్ధిస్తే చాలు, తమ కార్యసాధనకు తోడ్పడితే చాలు ఎంత అక్రమపద్ధతినైనా సరే అవలంబిస్తారు. కొంచెమైనా సంకోచించరు. కాని మన భాగ్యవిధాతయైన మహాత్మునికి ఈ పద్ధతులు గిట్టవు. ఆయన క్షణికమైన, తాత్కాలికమైన ప్రయోజనాలకోసం విశ్వజనీనమైన, శాశ్వతమైన నీతిమార్గాన్ని వదిలేసి పెడదారి తొక్కమని ఎన్నడూ సలహా ఇవ్వలేదు. అట్లా ఉల్లంఘనచేస్తే ఎన్నడూ సహించనూ లేదు.

హింసను విసర్జించి స్వాతంత్ర్యాన్ని సంపాదించుకునే మార్గం ఆయన మనకు చూపించాడు. పాశ్చాత్యులవారికమైన మహా యుద్ధాలసంగతి చెప్పనేఅక్కర్లేదు. భారతంలోని ధర్మయుద్ధంలో కూడా ఎంతో హింస వుంది, కౌటిల్య మున్నది. కాని మొట్టమొదటిసారిగా ఈ అపూర్వమైన సందేశాన్ని విన్నాము. "ఇంకొకరి ప్రాణాన్ని బలితీసుకోరాదు. మన ప్రాణాన్నే సమర్పణచేయాలి. ఈ ఆత్మబలిదానమే మనకు విజయ సోపానం!" ఎంత అద్భుతసందేశ మిది! ఇది కుటిలమైన రాజనీతి కాదు; ఇది కేవలం రాజకీయమైన సాధకోపాయం కాదు. అధర్మయుద్ధంలో ఐతే మరణం వినాశనం; మరణమే సమాప్తి. కాని అహింసాయుతమైన ధర్మయుద్ధంలో మరణం అమరత్వానికీ, పరాజయం విజయానికీ ప్రాతిపదికలు కాగలవు.

ఇదివరకుమాదిరిగానే భారతదేశం తనను జయించిన జాతియొక్క సంస్కారంలోనూ, ధర్మంలోనూ వుండే ముఖ్యమైన అంశాలను గ్రహించి, వాటితో మానవజాతికి తానొక వినూతన సందేశాన్ని అందించింది. క్రైస్తవమతంలో మానవజాతిని ఉద్ధరించేటందుకు భగవంతుడే మనుష్యరూప మెత్తినాడనీ, మానవుల పాపాల బరువంతా తాను మోసి బాధలు పడ్డాడనీ, ఈ భువిమీదనే దివిని నెలకొల్పవచ్చునన్నాడనీ ఒక అద్భుతమైన విశ్వాసమున్నది. తిండిలేని వారికి ఆహారం, గుడ్డలేనివారికి దుస్తులూ ధర్మం చెయ్యాలని క్రైస్తవమతం ప్రబోధించినంతగా ఇంకే మతమూ బోధించలేదు. అట్లాగే దానమూ, ధర్మమూ అనే పవిత్రాదర్శాలను మన మతంకూడా ప్రచారంచేసింది. కాని క్రైస్తవమతంలో తోటిమానవునిమీద ప్రేమ వల్లనే ఈ సిద్ధాంతాలు పుట్టినయ్. ఈ అమూల్యమైన సందేశాన్ని మహాత్ముడు అద్భుతంగా ఆచరణలోకి తీసుకువచ్చాడు. అదృష్టవశాన మహాత్ముడు క్రీస్తు సిద్ధాంతాలను వారి మతప్రచారకులవలన గ్రహించలేదు. తన జీవితంలోని అనుభవాలవల్లా, సంఘర్షణలవల్లా అహింసయొక్క విలువను పూర్తిగా గ్రహించిన టాల్‌స్టాయ్‌దగ్గరనే మహాత్ముడు అహింసాసిద్ధాంతాన్ని నేర్చుకున్నాడు.

సాధువులే ధరాధిపతులు కాగలరని క్రీస్తు ప్రబోధించాడు. కాని క్రైస్తవులుమాత్రం క్రూరులకే, హింసాప్రమత్తులకే విజయం సిద్ధిస్తుందని విశ్వసిస్తున్నారు. దీంట్లో ఆశ్చర్యపడవలసింది లేదు. వారికి ఈ సిద్ధాంతం విరుద్ధంగా, అసత్యంగా కనిపించింది. సృష్టి పరిణామమంతా హింసాపూరితం, స్పర్ధాప్రేరితం. కనక మరొక ప్రవక్త ప్రభవించి, సాధుత్వమంటే సత్యంతోనూ, మైత్రితోనూ, ధర్మంతోనూ కూడిన సత్యాగ్రహశక్తి యని ప్రబోధించవలసిన అవసరం వచ్చింది. సాధుత్వమంటే లొంగిపోవటం కాదు, అక్రమాన్ని, అన్యాయాన్ని సహిస్తూ ఊరుకోవటం సాధుత్వం కాదు. ఆ విధంగా సహించటం పిరికితనం. అటువంటివారు తమకు తెలియకుండానే క్రూరశక్తులకు సహకారంచేసినవారవుతారు. కాని మహాత్ముడు ప్రబోధించిన సాధుత్వం, అహింసా ఉత్కృష్టమైన ధీరతాలక్షణాలు. బలమదాంధుల క్రూరతకు అహింస ప్రబలవిరోధి. వారి దౌర్జన్యానికి ఎదురునిలిచిగెలిచే అజేయమైన అద్భుతశక్తి అహింస.

ఆయనజీవితం అహింసాపథంలో మనలను ముందు తోడ్కొనిపోయే అమరజ్యోతి కాదా! ఆ బాటలో మనం ఎంత మందంగా ముందరికి సాగినా, ఆయనసందేశంమాత్రం మన హృదయంలో ప్రతిధ్వనిస్తూనే వుంటుంది.

అనువాదం: 'అమరేంద్ర'



# విమర్శనము



## పేరు ఫలములు, ౧౯౫౮

జరగబోయే సంఘటనలను ముందుగా తెలుసు కోవటానికి ప్రతివారూ కుతూహలపడతారు. అందుకు జ్యోతిషశాస్త్రం ప్రధానం. దానిలో ముఖ్యమార్గం గోచారఫలితాలు. అందుకు జన్మనక్షత్రం, పాదనివరం ఉండాలి. జన్మనక్షత్రం లేనివారుకూడా తమ పేరును బట్టి—పేరులో ఉండే మొదటి అక్షరాన్ని అను సరించి—౧౯౫౮ సంవత్సరంలో పన్నెండు నెలల్లో యే యే శుభాశుభాలు జరిగేదీన్నీ శ్రీ కోటాముత్తురి నాగ భూషణ సిద్ధాంతిగారు 'పేరు ఫలములు' అనే ఈచిన్న పుస్తకాల రూపంగా రచించారు. ఇటువంటి ప్రయత్నం తెలుగులో వృద్ధికావడం వాంఛనీయమే.

అక్షరాలకు నక్షత్రాలను నిర్ణయించటంలో కొన్ని చిక్కులు కనబడుతున్నవి. మచ్చుకు ఒకటి: పూర్వాభాద్ర ౩వ పాదానికి 'దా' అనే అక్షరం వ్రాసివుంది. ఇది కుంభరాశిలోనిది. ఉత్తరాభాద్ర ౪వ పాదానికిన్నీ 'దా' అనే అక్షరమే ఉంది. దండ పాణి, దానయ్య ఇత్యాది పేర్లు గలవారు ఫలితాలు చూచుకోవలసినది 'దా' అనే అక్షరాన్ని అనుసరించి కదా! వీరు కుంభరాశిఫలితాలు చూచుకొనవలసి ఉంటుందా? లేక, మీనరాశిప్రకారం చూచుకొన వలసి ఉంటుందా? ఇటువంటివే ఇంకా కొన్ని ఉన్నవి. జ్యోతిషగ్రంథాలకు విరుద్ధముగా, సాధా రణ జనానికి సంశయాస్పదాలుగా ఉండే ఈ చిక్కులు మరొకసారికి అయినా లేకుండా చూడడం మంచిది. ప్రకటించింది తెనాలి, సుందరరాం అండ్ సన్స్ వారు. ఖరీదు ఒక్కొక్కటి ౪ అణాలు.

సు శాస్త్రి.

## దేశీయవైద్య విజ్ఞానచరిత్ర

ప్రథమభాగము. రచయిత: 'కృషీవల'. ప్రకా శకులు: వావిళ్ళరామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, ౨౯౩, ఎస్ప్లనేడ్, మద్రాసు. వెల ౧ రూ.

'వైద్యము-వాఙ్మయము' అను పేరిటి ఈ ప్రథమ భాగములో ఈ రచయిత దశకుమారచరిత్ర, బసవ పురాణము, నవనాథచరిత్ర, పంచతంత్రము, హంస వింశతి, వేమననీతిపద్యములు మొదలైన ప్రాచీన వాఙ్మయములోని వైద్యవిజ్ఞానప్రస్తావనలను తేట తెల్లముగా సద్విగ్రహించియున్నాడు. దేశీయవైద్యము నకు ఆయా ప్రాచీనకాలములలో ప్రజాభిమాన మెంతెం తగా ఉండెడిదో, అప్పటి సర్వసామాన్యచికిత్స లెటువంటివో, అప్పటివైద్యుల రూపగుణవేషభాషాదు లెటువంటివో, దేశములో అప్పటి ఆరోగ్యసౌభాగ్య పరిస్థితు లెట్లుండెడివో తెలిసికొనుటకు ఈ ప్రస్తావనలు మిక్కిలి ఉపయోగపడగలవు. ఈవిషయములో రచయిత చేసిన కృషి, కావించిన వాఙ్మయపరిశీలన ప్రశంసింప దగియున్నవి.

* * *

## యక్షప్రశ్నలు

రచయిత: మహీధర జగన్మోహన్‌గారు. ప్రకా శకులు: విశ్వసాహిత్యమాల, రాజమండ్రి. వెల రూపాయిన్నర.

శాస్త్రీయవిజ్ఞానవిషయాలకు సంబంధించి, ముఖ్యంగా మన బాలబాలికలకు ఎన్నో సంశయాలు తోచి, అందుమీదట వారు పెద్దలకు వేసే ఎన్నో 'యక్షప్రశ్నల'కు సమాధానరూప మీగ్రంథం. ఆ సమా ధానాలున్నీ బహుసులభమైన భాషలో, పది హృద

యాలకు ఆసక్తి పుట్టించే తీరులో, శాస్త్రీయంగా ఉన్నవి. పాఠపుస్తకాలతో విసుగెత్తిపోయిన విద్యార్థులకు ఇది శాస్త్రీయవిషయాలలో ఇనుమడించిన ఆసక్తిని పుట్టిస్తుందనుటకు సందేహం లేదు.

---

# గ్రంథ స్వీకారము

## విజయ విలాసము

చేమకూర వేంకటకవిరచన. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి రచిత లఘువ్యాఖ్యాసహితము. ద్వితీయ ముద్రణము. ప్రకాశకులు : వేదం వెంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్సు, ౮ మల్లికేశ్వర గుడిసందు, లింగిశెట్టివీధి, మద్రాసు ౧. వెల ౩ రూ.

## కుందమాల

డిఙ్నాగుని సంస్కృతకృతికి ఆంధ్రీకృతి. ఆంధ్రీకర్త: బులుసు వెంకటేశ్వర్లుగారు, బి. ఏ., రామారావుపేట, కాకినాడ. వెల ౨ రూ.

## స్నేహలతాచరిత్రము

సంస్కరించి, పెంపొందించిన నాల్గవ కూర్పు. రచయిత: కొమాండూరి శఠకోపాచార్యులు గారు, వకీలు, కాకినాడ. వెల రూ. ౨-౮-౦

## సుబ్బలక్ష్మి

కథల సంపుటి. కథకుడు: తెన్నేటి సూరిగారు. ప్రకాశకులు : మహోదయప్రచురణలు, మచిలీపట్టణము. వెల ౧౨ అ.

## మృత్యుంజయులు

తెలంగాణవీరగాథ. కథకుడు: బొల్లిముంత శివరామకృష్ణగారు. ప్రకాశకులు: ప్రజాశక్తి ప్రచురణాలయము, బెజవాడ. వెల రూపాయన్నర.

## కారుమబ్బులు

వ్యాససంపుటి. రచయిత: కె. సచ్చిదానందమూర్తి గారు. ప్రకాశకులు: కృష్ణా బుక్ డిపో, తెనాలి. వెల రూపాయిపావలా.

## నవ్యకవితానీరాజనము

రచయిత: దేవులపల్లి రామానుజరావుగారు, బి. ఏ., యల్. యల్. బి. ప్రకాశకులు: శోభనసమితి, హైదరాబాదు (దక్కను). వెల ౧౨ అ.

## ౧. గోర్కీ కథలు
## ౨. టాల్‌స్టాయి కథలు
## ౩. లెనిన్ జీవితకథలు.

మొదటివి రెండూ అనువాదాలు. మూడవది స్వతంత్రం; పిల్లలకోసం ఉద్దేశించి వ్రాసినది. మూడూ మహీధర జగన్మోహన్ గారి రచనలు. రాజమండ్రి విశ్వసాహిత్యమాల ప్రచురణలు. వెలలు: రూ. ౧౨; ౧౨; ౧.

## ప్రగతి

వివిధరచనల సంపుటి. ప్రకాశకులు : కౌముదీ ప్రచురణలు, ౪౧/౧౫ ఎ, ఆంధ్రనగరం, హైదరాబాదు, దక్కను. వెల రూ. ౧-౮-౦.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No, 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.



ధ్యానముద్రలోనున్న
అపరబుద్ధుడు బాపూజీ



‘ పగకు ప్రేమలు నేర్పిన పసిడి నవ్వు ’

ఇంట ఒంటరిగా కూర్చొని. సహజమైన చిరునవ్వుతోనే దీర్ఘాలోచనామగ్నులైన గాంధీమహాత్ములు.